## కొన్ని కర్తవ్యాలు

భారతదేశం ఉపఖండంలో మహమ్మదీయ మతాన్ని అనుసరించేవారు ఇప్పటికి వెయ్యేళ్ళపయిగా నివసిస్తూ ఉన్నారు. కొన్ని వందల ఏళ్ళు సామ్రాజ్యాలు పాలించారు. ఒకవిధంగా 'భారతదేశం' అనే భావానికి స్వరూపం కూడా కల్పించారనవచ్చు. నేడు భారతీయ నిత్యజీవితంలో యూరప్ ప్రభావం ఎంతో ఉంది, అదేవిధంగా అరేబియా, పర్షియా దేశాల ప్రభావం కూడా చాలా ఉంది. ఈ ప్రభావం ఇంచుమించు అంతా మహమ్మదీయ మతానికి సంబంధించినదే అనవచ్చు

ఇక జనాభా సంఖ్యలు తీసుకున్నప్పటికీ భారత ఉపఖండం మీద మహమ్మదీయుల సంఖ్యమాత్రం తీసివెయ్య తగినది కాదు

అనేక కారణాలవల్ల మహమ్మదీయ మతస్తులకీ, హిందువులనబడే వారికీ మధ్య ఉండవలసినంత స్నేహభావం లేకుండా పోయింది ఈ లోటువల్లనే పాకిస్తాన్ అనబడే దేశం ఒకటి 1947 లో సృష్టింపబడింది ఆ దేశం ఇటీవలే విచ్ఛిన్నమయి పోయింది.! ఒకనాటి పాకిస్తాన్‌లో అధిక సంఖ్యాకులు 'బంగ్లాదేశ్'గా విడిపోయి భారతదేశంతో శాశ్వతమైత్రి కోరుతున్నారు.

దీనివల్ల మనం గ్రహించగలిగింది ఏమిటంటె హిందువులనబడేవారు మహమ్మదీయులతో శాంతియుత సహజీవనం చెయ్యటం అసంభవం కాదు, అని. అయితే, శాంతియుత సహజీవనానికి కొన్ని కనీసపు అవసరాలు ఉంటాయి వాటిలో ముఖ్యమైనవి ఈ కిందివి అనిపిస్తుంది—

1. భారతదేశాభిమానం తీవ్రంగాకలవారు మహమ్మదీయులని పరదేశస్తులుగాకాక తమతోటి వారే అని గుర్తించగలగటం

2. మహమ్మదీయ మతానికి చెందినవారు కాలానుగుణంగా కొన్ని సంస్కరణలు, మార్పులు అవసరం అని అంగీకరించడం, (బంగ్లాదేశ్ నాయకులు తమ దేశం లౌకిక, ప్రజాస్వామ్య సిద్ధాంతాలని స్వీకరిస్తున్నట్లు స్పష్టంగా తెలిపారు. ఇది భారతదేశంలో ఉంటున్న మహమ్మదీయులు గమనించాలి.)

3. మహమ్మదీయుల వోట్లకోసం లాపత్రయం పడే భారత రాజకీయవాదులు మహమ్మదీయుల సాంఘికంగా ముందంజ వేసినప్పుడే దేశం కూడా అభివృద్ధి చెందగలదని తెలుసుకోవటం. అదనుగుణంగా ప్రవర్తించటం. మత స్వాతంత్ర్యానికి ప్రతికూలం అని అత్యవసరమయిన సంస్కరణలు చెయ్యకపోవటం రాజకీయవాదుల కొందరు చేస్తున్న పొరపాటు. అస్పృశ్యత, వర్ణవిభేదాలు, స్త్రీలకి జరిగే అన్యాయాలు వీటిని హిందువులనబడే సంస్కర్తలు ఎప్పటినుంచో ప్రతిఘటిస్తున్నారు. ఇటువంటి సంస్కరణలు మహమ్మదీయ సమాజంలోనూ అవసరం )

4. భారతదేశంలో ఉన్న మహానుభావులకివర్తించే శాసనాలని అమలుపరచటం

శ్రీమతి ఇందిరాగాంధిగారి నాయకత్వంకింద ప్రభుత్వం ఎన్నో గడ్డు సమస్యలని నిర్భయంగా, మొహమాటం లేకుండాఎదుర్కొంటోంది బంగ్లాదేశ్ సృష్టికి తోడ్పడి అక్కడ కొన్నికోట్లమంది మహమ్మదీయుల అభివృద్ధికి పునాదివేసింది

మన స్వంతదేశంలో కూడా మార్పుకోసం ఎందుకు కృషి చెయ్యరాదు ? — (బి.వి.)

# ఉత్తరాలు

## సీరియల్

17.12.1971 లో ప్రచురించిన సీరియల్ 'పిల్లలతో ప్రేమయాత్ర' భాగం చదివిన తరువాత ఈ లేఖ వ్రాయవలెనని పించినది. అందులో శ్రీమతి పరిమళా సోమేశ్వర్ గారు తిరుపతియాత్రను అతి చక్కగా వర్ణించారు. రచయిత్రి వర్ణించిన బాధలన్నియు ఒకానొకప్పుడు మేము కూడా అనుభవించినవే. తిరిగి మరల తిరుపతియాత్ర చేయరాదు అనిపించినది అందువల్ల మనోనేత్రములో భగవంతుని తలుచుకొని ధ్యానము చేయుట అలవరచుకొంటిమి ఇందులో రచయిత్రి గారు వ్రాసిన ఈ వాక్యము 'ఈనాడంలో పుణ్యక్షేత్రలన్నీ వ్యాపార సంస్థలుగా ఉంటున్నాయే తప్ప మన శాంతిని, ఆత్మవికాసాన్ని కలిగించే వీలూ వాతావరణమే ఉండటంలేదు' నాకు యెంతయో సత్యంగా అనిపించుచున్నది ఇలాంటి వివల చదివిన తరువాత యినా అమాయక ప్రజలు మోసపోరని దీనిని చదివిన తరువాత కనీసము ఆంధ్రదేశములోని దేవాలయములలో నైనా ప్రభుత్వము వారు కొన్ని సత్వర చర్యలు తీసుకొంటారని తలుస్తాను. రచయిత్రి గారికి పత్రికా సంపాదకులకు అభినందనలు.

—కె వి యల్. యన్ శాస్త్రి, (కొండగాన్ పోస్టు) (మధ్యప్రదేశ్.

'గూడుచేరిన పక్షులు' సీరియల్‌లో రేఖాదేవికి రక్తం కావల్సి వస్తుంది ఆమె గ్రూపురక్తం ఒక్క ప్రసాద్ దగ్గర తప్ప బ్లడ్‌బాంక్‌లో, నర్సింగ్‌హోమ్స్ స్టాన్ దగ్గర కూడా ఉండదు. ప్రసాద్ రక్తం రేఖకి ఇవ్వాక, ప్రసాద్‌కి రక్తం కావలసి వస్తుంది. ప్రసాద్‌కి రక్తం ఇచ్చినట్లుగా రాధ (పాత్ర) చేత రచయితగారు చెప్పించారు. ఒకేగ్రూపు రక్తం ఎక్కడనుండి వచ్చింది?

పిండి వేంకట విజయకుమార్, (హైదరాబాద్)

## గమనిక

సకాలానికి అందని కారణంగా విధిని నమ్ముతారా, సినిమాడైరీ, మీకు తెలుసా? ఈ వారం ప్రచురించలేకపోతున్నాము— సం॥

## వ్యాసాలు

సంక్రాంతి సంచికను అందమైన ముఖచిత్రంతో అలంకరించినందుకు మీకు ముఖ్యముగా మా అభినందనలు.

సంచికలో సంక్రాంతి వ్యాసాలకన్నా తారల ఇంటర్వ్యూలే ఎక్కువగా ఉన్నవి. అది మాత్రం మాకు నచ్చలేదు.

శ్రీ 'ఎల్క్ర్టాన్'గారి కథానిక, శ్రీ 'మూర్తి' శ్రీ జయ సౌజన్య' గారి వ్యాసము మమ్మాకర్షించాయి ముఖ్యంగా మూర్తి శ్రీ జయ సౌజన్యగారు తమ వ్యాసంద్వారా మొదటనే మమ్మాశ్చర్యపరచారు. 'సంవత్సరానికి పన్నెండు సంక్రాంతులని'— తెలంగాణా వేడుకలనూ, ఆంధ్ర సంబరాల్నీ పోల్చడం, ఇంకా ఇతర ప్రదేశ పద్ధతులను వివరించడం. అన్నీ నూతనంగా, తెలుసుకోదగినవిగా కనుపించినవి. ఇలాంటి వ్యాసాలు తరచు ప్రచురించ గలరు. తారల ఇంటర్వ్యూలకన్నా ఇలాంటివి విలువైనవి కావా?

పై. పుష్పలత, మంజువాణి, నాగమణి, హేమ (కరీంనగర్)

## రచయిత్రి సమాధానం

శ్రీ యన్ ఆర్. పట్నాయక్ (ఖరియూరోడ్) గారు 24—12—71 ఆంధ్రసచిత్ర వార పత్రికలో వ్రాసిన ఉత్తరం చదివేను పాఠకుల నుండి వెలువడిన రకరకాల ఉత్తరాలను చదవటం నాకలవాటె గాని, యీ రకం ఉత్తరం చదవటం ఇదే మొదలు నోపక్క ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ఏదే ఒన్నిసీరియల్స్ కలదు అందరూ చదువుతారని చదివి తీరాలని అంటూ. సెక్స్ గురించిన వ్రాతలను కూడా పత్రికవారు ప్రచురిస్తున్నారనీ యీ కాలంలో పిల్లలక కూడా సెక్స్ బోధిస్తున్నా రని ఒప్పుకుంటూనె మరోవంక నా సీరియల్ నవలను సెన్సార్ చెయ్యమని ఆయన కోరటంలోని అంతరార్థమేమిటో నాకు బోధపడటం లేదు. ఎప్పార్టులు • రోజూ చూసే సినిమాలోను, రేడియోలో వినే కుటుంబ నియంత్రణ ప్రచారాలోను, వారు చదివే పాఠ్య గ్రంథాలలోను (సైన్సుకీ సాహిత్యానికీ రెంటికి సంబంధించినవి) ఉన్నదాని కంటే అక్షేపణీయమైన విషయాలేవీ నేను నా నవలలో వ్రాయలేదే! పట్నాయక్‌గారు ఒరి తెలించి వ్రాసేనని ఆలోచించటంలో కొస్త తొందర పడ్డారేమో ననిపిస్తోంది సినా 'ప్రేమయాత్ర'లో శృంగార రసం కాక, శోకరసం గురించి వ్రాయమంటారండీ పట్నాయక్ గారూ?

'సెక్సు'కీ 'శృంగారా'నికీ ఎంత వ్యత్యాసముందో గ్రహించటానికి ప్రయత్నించండి. ఈనాడు వార, మాస పత్రికలలోను, యితరంగాను అచ్చవుతున్న నవలలో, కథానికలలో ఎన్ని అశ్లీలాలు, అక్రమ సంబంధాలు ఉంటున్నాయో వాటిని రెగ్యులర్‌గా చదివే పాఠకులందరికీ తెలిసేఉంటుంది సినా ప్రథమ పీక్షణంలోనే ప్రణయావేశం చెంది ప్రేమ విషయాలలోనూ అధర్మ పరమైన సంఘ నిషిద్ధమూ అయిన స్త్రీపురుష సంబంధంలోనూ కేళీ విలాసాలను గురించి గాక, యిక్కడ

# రచయితలకు మనవి

**కథలు, వ్యాసాలు :**

ప్రచురణకి స్వీకరింపబడని తమ వ్రాత ప్రతులని తిప్పిపంపగోరే రచయితలు వ్రాత ప్రతులతోబాటే తగుమాత్రం తపాలాబిళ్లలు అతికించిన స్వంత చిరునామాకల కవరు కూడా పంపాలి. స్టాంపులుమాత్రం పంప రాదు. స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు. వ్రాత ప్రతులతోగాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికల కవర్లు పంపినా వ్రాత ప్రతులు తిప్పిపంపబడవు.

ప్రచురణకి స్వీకరింపబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తరప్రత్యుత్తరాలు జరుపబడవు.

**నవలలు :**

ప్రచురణకి స్వీకరింపబడని నవలల వ్రాత ప్రతులు మేమే తిప్పిపంపిస్తాము. వ్రాత ప్రతులతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంప నవసరం లేదు. 100 అరఠావు పేజీల కయిన ఉన్న వ్రాతప్రతులే నవలల క్రింద పరిగణింప బడుతాయి.

**కార్టూన్‌లు :**

ప్రచురణకి స్వీకరింపబడని కార్టూన్‌ల్ని తిప్పి పంపగోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరచి పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు.

**షరా:** వ్రాతప్రతులనీ, కార్టూన్లనీ వీలయినంత భద్రంగా తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము. కాని, వాటి విషయమయి ఎటువంటి బాధ్యతనీ స్వీకరించ లేము. ఈ షరతుని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్‌ల్ని పంపగలరు.

*సంపాదకుడు*

*ఆంధ్రసచిత్రవారపత్రిక*

# ఉత్తరాలు

పిల్లలకు తల్లి దండ్రులైన యువదంపతులలోని శృంగార భావాలను గురించి వ్రాయుటమే మీ దృష్టిలో నేను చేసిన అపరాధమనుకుంటాను. పాఠకుడిని వికృతమైన ఆలోచనలకు లోనుకానీయనంత వరకు, అధర్మపరము, అక్రమము అయిన సంబంధాలకు పురిగొల్పనంత వరకు సెక్సును గూర్చిన పరిజ్ఞానం ఉండటం మంచిదే! అంతే కాదు. మనసును ఆనంద మాధుర్యంతో నింపి గిలిగింతలు పెట్టే శృంగారం సాహిత్యంలో తప్పనిసరిగా ఉండి తీరాలి! మన ప్రాచీన సాహిత్యంలో కూడా లాక్షణికులు శృంగారరసానికి ప్రథమస్థానం యివ్వటంలోని అంతరార్థం అదేనండీ పట్నాయక్ గారూ! —పరిమళా సోమేశ్వర్

* * *

కొంతకాలంక్రితం ద్రావిడ మున్నేట్ర కజగమ్ వారు భారతదేశం నుంచి విడిపోతామనేవారు. కీ. శే. లాల్ బహదూర్ శాస్త్రిగారి ప్రధాన మంత్రిత్వం కాలంలో ఆ పక్షం నాయకులు తమ అపసరణ సిద్ధాంతాన్ని మార్చుకున్నారు. ఇప్పుడు అపసరణం బదులు 'స్వయం నిర్ణయాధికారం' లేక 'ఆటోనమీ' కావాలని అంటున్నారు. నిన్న త. నా. ముఖ్యమంత్రి శ్రీ కరుణానిధిగారు దీనిని గురించి ప్రస్తావిస్తూ బాంగ్లాదేశ్‌కి మద్దత్తు ఇచ్చిన ప్రధానమంత్రి తమిళనాడు స్వయంనిర్ణయాధికారానికి ఎదురు చెప్పరనే ధైర్యం ఉందన్నారు. ఆంధ్రప్రదేశ్‌కి సంబంధించినంతవరకూ ఒక ప్రాంతానికి స్వయం నిర్ణయాధికారం ఇచ్చినట్టే నాకు తోస్తుంది—పేరుకి ఆంధ్రప్రదేష్ అనే రాష్ట్రం ఉన్నప్పటికీ తెలంగాణా ప్రాంతం రాష్ట్రంలో రాష్ట్రంగా చెలామణి అవుతోంది. ఇది కొత్త విషయం కాదు. కాని ఎన్నికలు దగ్గిర పడటంతో తెలంగాణా నాయకులు తమ ప్రాంతానికి మరికొన్ని ప్రత్యేకమయిన ఏర్పాట్లు కావాలని కోరక తప్పదు. దీనివల్ల నష్టపోయేది ఆంధ్ర ప్రాంతంవారని ఊహించటం కష్టమేమీ కాదు.

అందుచేత ఇప్పటికయినా ఆంధ్ర ప్రాంతం నాయకులు మేలుకొని ప్రధానమంత్రి, భారత దేశానికి ఏకైక నాయకులు అనదగిన, శ్రీమతి ఇందిరా నెహ్రూ గాంధిగారి శరణు వేడుకుని తమ ప్రాంతం ప్రజలకి అన్యాయం జరగకుండా చూడాలి.

ద్రా. ము. క. గురించి ఎందుకు రాసానంటే, అపసరణ వాదాన్ని అంత తేలికగా వదులుకున్న వారిని చూసి మనం తగిన గుణపాఠం నేర్చుకోవాలి. విడిపోదామన్న వారి హెచ్చరికలకి మితిమీరిన విలువని ఇవ్వరాదు. (అసలు తెలంగాణా ఏర్పడితే వచ్చిన నష్టం ఏమిటి? అస్సామ్ ప్రాంతం ఎన్ని ముక్కలు కాలేదు?) ఈ రకం విధానం తెలంగాణాకేకాక రాయలసీమకీ వర్తిస్తుందని నా మనవి. ఇంతకి ముందు ఎవరో రాసినట్లు పరాన్న భోజన సిద్ధాంతం ఆత్మాభిమానాన్ని పెంచ లేదు!

కె. వి. శర్మ, (విజయవాడ)


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం 28–1–72'

శ్రీ విరోధికృన్నామ సం॥ మాఘ మా॥ శు॥ త్రయో॥

సంపుటము : 65 సంచిక : 23

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు - 1

విడి ప్రతి వెల 50 పైసలు

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 31.20 |
| 6 మాసముల చందా | 15 60 |
| 3 మాసముల చందా | 7 80 |


## విషయానుక్రమణిక


**కథలు :**

| | |
|---|---|
| స్వయంవరం | — 8 |
| ఎర్రగులాబి | — 18 |
| నాకో తోడు కావాలి | — 32 |
| పాత జీవితానికో క్రొత్త మలుపు | — 48 |

**సీరియల్ నవల :**

| | |
|---|---|
| గూడుచేరిన పక్షులు | — 24 |
| పిల్లలతో ప్రేమయాత్ర | — 40 |

**వ్యాసాలు, శీర్షికలు. సినిమా :**

ఉత్తరాలు — 2, ఊమెన్ కార్టూన్ — 5, బంగ్లా ప్రధాని షేక్ ముజిబుర్ రెహమాన్ — 6, ఒకవారం విపరీతం — 14, ప్రశ్నావళి — 16, నలుగురు రాష్ట్రపతులు—17, ఎవరి కెవరు ? (గేయం) — 20, ఏడవనీయండి ఒంటికి మంచిది—30, రసవరా లూ — గుణాలూ—34, జ్ఞాపకముంచుకోండి — 44, ధర్మపథం — 47, శ్రీ ం నమః శివాయ — 50, వారఫలం — 54, సినిమా — 56, పుస్తకాలు — 63.


ఎన్నికల్లో కూడా ఈ గుఱ్ఱం గెలుస్తుంది
యుద్ధంలో విజయం


హిమాలయాలంతటి పెద్దపని
బంగ్లా పునర్ నిర్మాణం


ఓర్పుతో ఈ ముళ్లని విప్పేయవచ్చు


తూ: పాకిస్తాన్ పోలేదు. మేం తిరిగి తీసుకుంటాం


పూర్తిస్వతంత్రాన్నే పుచ్చుకోమనండి


కొంత సంబంధం వుంటే మంచిది


బంగ్లాదేశం నిజంగా ఉద్భవించిందా

# బంగ్లా ప్రధాని షేక్ ముజీబుర్ రెహమాన్



భారత ప్రధానితో బంగ్లా ప్రధాని

షేక్ ముజీబుర్ రెహమాన్ పేరు ఇప్పుడు ప్రపంచమంతటా కూడా సుపరిచితమయి పోయిందంటే అతిశయోక్తి లేదు. ఆయన జీవిత చరిత్రయే ఒక అద్భుత గాథ ఆయన పుట్టినది భారతదేశంలో ఒకప్పటి భాగమయిన బెంగాల్‌లో. చదువు కొంత నేటి భారతదేశంలో ఉండే ఒక కలకత్తా కాలేజీలో. ఒకప్పుడు ఆయన ముస్లిమ్ లీగ్ సభ్యులు. నేడు ఆయన అవామీ లీగ్ మహానాయకులు. ఒక కాలంలో ఆయన పాకిస్తాన్ జననానికి తోడ్పడ్డారు. నేడు ఆయన పాకిస్తాన్ అనబడ్డ దేశం రెండుగా విడిపోయే ఉద్యమానికి ప్రాణం పోశారు.

ముజీబుర్ రెహమాన్ ఎప్పుడూ నిరంకుశ మయిన అధికారాన్ని సహించి ఊరుకోలేదు. 'పాకిస్తాన్ పిత అనదగిన మహమ్మదాలీ జిన్నా ఆదేశాలనే ఎదిరించటానికి ఆయన సందేహించలేదు. బెంగాలు జనం తమ భాషని వదులుకొనటానికి ఎన్నటికీ అంగీకరించరని జిన్నాకే ఎదురు చెప్పారు.

ఆ కాలంలోనే పాకిస్తాన్ పాలకులు షేక్ ముజీబుర్ రెహమాన్‌ని జెయిలుకి పంపారు. ఒకసారి కాదు ఆరు సార్లయినా కారాగృహంలో నిర్బంధించారు. ఆయనే చివరి నిర్బంధం పాకిస్తాన్ అనబడ్డ దేశం విచ్ఛిన్నానికే కారణం అయింది. ఒకప్పటి భారతదేశంలో మహమ్మదీయులకి సరయిన రక్షణ లేదని విడిపోయిన 'పాకిస్తాన్' అనబడ్డ 'మహమ్మదీయ రాజ్యం' లోనే చరిత్రలో ఎంతో అరుదుగా జరిగే జనహత్య జరిగింది. ఈ జనహత్యలో ఎక్కువమంది ప్రాణాలు కోల్పోయినవారు మహమ్మదీయులే. వారిని చంపినవారూ మహమ్మదీయులే. మత ప్రధానమయిన రాజకీయ సిద్ధాంతాలు నేటి ప్రపంచంలో ఎంతవరకూ









ఆగినవన్న ప్రశ్నకి ఈ దారుణమైయన ప్రజాహత్యే సరయిన సమాధానం ఇస్తుంది. 'వంగబంధు' షేక్ ముజీబుర్ రెహమాన్ అన్యాయాలని ఎన్నడూ సహించ లేదు. తన ప్రజల శ్రేయస్సే ఒక్కటే ఆయనకి కావలసింది అన్న సత్యానికి ఆయన జీవిత చరిత్ర ఒక చక్కటి నిదర్శనం. ఆయన త్యాగం, కృషితో ఉదయించిన 'బంగ్లాదేశ్' లౌకిక సిద్ధాంతాలకి, ప్రజాస్వామ్యానికీ నిలయమయి వర్ధిల్లాలని అందరూ కోరుకుంటున్నారు.

—ఒక విలేఖరి ●




శ్రీ వెంకటేశ్వర క్లాత్ మిల్లులోకి ప్రవేశించి సేఠ్ జ్ఞాన్‌చంద్ ఆఫీసు గది ముందుకు వచ్చిన సౌజన్యారావు ఆశ్చర్యపడ్డాడు. కర్మాగారం మేనేజరు పదవికి 'నీతి, నిజాయితీ పరులైన అభ్యర్థుల నుండి అర్జీలు కోరబడుతున్నవి' అన్న ప్రకటనను పత్రికలో చూచినపుడు తనలాగే వేలాది వ్యక్తులా పదవికోసం అప్లయి చేస్తారనుకున్నాడు. తీరా చూస్తే అక్కడ పాతికమందైనా లేరు. కృశ్చేవ్, బుల్గానిన్‌లు భారతదేశాన్ని సందర్శించినపుడు భారతీయుల నిజాయితీని పరీక్షించాలని యిస్త్రీకి వేసిన వస్త్రాల్లో రూపాయల నోట్లుంచితే లాండ్రీవాడా నోట్లను రష్యా నాయకులకు తిరిగిస్తే వారెంతో అభినందించారు. అలాంటి పుత్ర రత్నాల్ని కన్న భారతదేశానికి చెందిన యీ నగరానికి ఇంటర్‌వ్యూకై వచ్చింది కేవలం పాతికమందే అంటే ఆశ్చర్యపడ్డాడు సౌజన్యారావు. ఈ నగరంలోని నిరుద్యోగుల సంఖ్య యింతేనేమో! పరిసర ప్రాంతాల నుండైనా రావచ్చుగదా! ఒకే భాషా వారసత్వం, ఒకే సాంస్కృతిక రక్తసంబంధం, ఒకే సాహితీ జీవన సాంప్రదాయమూ, ఒకే నైసర్గిక ప్రాదేశికానుబంధమూ కల్గిన తెలుగు సోదరులు—కొమర్రాజు, సురవరం ప్రతాపరెడ్డి, హరిసర్వోత్తమరావు, మాడపాటి హనుమంతరావు, బూర్గుల రామకృష్ణారావు, పొట్టి శ్రీరాములాది మహనీయుల త్యాగనిరతితో సాగించిన జీవన్మరణ పోరాటాల ఫలితంగా ఒక్కటై నిలిచిన తెలుగు సోదరుల్ని, ద్వాదశ వత్సరాలకే కుహనా రాజకీయవాదుల చేతుల్లో పావికలై సదసత్ వివేచనాశక్తిని కోల్పోయి ఆవేశాంధకారంతో భ్రాతృ హంతకులుగా మారిన విషమ విపత్కర పరిస్థితుల్లో 'ంగా (అ) భాగ్య నగరానికి రావడానికి జంకినారో! ఈ ప్రకటనను ఒక 'ఫార్సు' క్రింద జమకట్టారో! బహుశా అందుకే ఎక్కువమంది రాలేదేమో! అని అనుకొంటూ సౌజన్యారావు అభ్యర్థులకై వేసిన బెంచీలలో ఒకదానిపై కూర్చుంటూ—పరిచిత ముఖాలేవైనా ఉన్నాయేమోనని పరికిస్తూ 'ఇంటర్‌వ్యూ మొదలైందా' అని ప్రశ్నించాడు. వారి నుండి సమాధానం రాలేదు సరికదా తన రాకతో పోటీదార్ల సంఖ్య పెరిగిందన్న భావం వారి ముఖాల్లో ద్యోతకమైంది. మరేమీ ప్రశ్నించకుండా ఆసీనుడయ్యాడు.

ఇంతలో బెల్లు మోగింది. ప్యూన్ బైటికి వచ్చాడు కోర్టుజవానులా కాక చాల పొలైట్‌గా 'కిషన్‌గా రెవరండి?' దొరగారు రమ్మంటున్నారు, అన్నాడు. బెంచీనుండి లేచిన ఒకయువకుడు 'టై' సవరించుకుంటూ లోనికేగాడు. ఆ యువకుణ్ణి ఎలాంటి ప్రశ్నలు వేస్తారో, ఆ ప్రశ్నలు విని తమవంతు వచ్చేవరకు సమాధానాలు సిద్ధపరచుకోవచ్చని తలుపుకు చెవులానించి వినసాగారు. కాని వారికేమీ వినిపించినట్లు లేదు. ఐదునిముషాల తర్వాత వివర్ణ్యముఖంతో బయటకు వచ్చిన ఆ యువకుణ్ణి చుట్టుముట్టి ప్రశ్నల్ని రాబట్టేందుకు ప్రయత్నించారు. కాని అతడేమీ సమాధానా లివ్వకుండనే శత్రువులు పన్నిన వ్యూహాన్ని చిన్నాభిన్నముచేసే యోధుడికి మల్లే ముందుకు దూసుకు పోయాడు.

ఛాన్స్ కొట్టేశాడేమో! అందుకే అంతతీవి!

ఒకరి తర్వాత ఒకరు ఆఫీసు రూంలోకి వెళ్ళడం—ఎవరికి వారే నవ్వుముఖాల్తో రావడం—ఎదుటివారి ప్రశ్నలకు సమాధానా లివ్వకుండా బయటికి దూసుకుపోవడం సౌజన్యారావును మరింత ఆశ్చర్యపరచింది.

తుదకు తన వంతు రాగానే ఏమౌతుం దేమోనన్న ఆతుర్దాలో అడుగులు తడబడ దడదడలాడే గుండెను కూడదీసుకొని, తొలిరేయి శోభనపు గదిలోకి వెళ్ళే నూతన వధువులా ఆఫీసు గదిలోకి ప్రవేశించాడు. వినమ్రతగా 'నమస్కారం' అన్నాడు.

సేఠ్ ప్రతినమస్కారం చేస్తూ — తన టేబుల్ కెదురుగా నున్న కుర్చీ చూపుతూ— 'కూర్చోండి' అన్నాడు అతని మాటల్లో సౌమ్యతయే తప్ప దర్పం లేనందుకు సౌజన్యారావు మనసు కాస్త తేలిక పడింది.

అనవసర ప్రశ్నలతో కాలయాపన చేయడం యిష్టంలేకనో, తన వ్యవహార దక్షతను నిరూపించుటకో లేక అతని స్వభావమే అంతో సేఠ్‌జీ సూటిగా 'సౌజన్యారావుగారూ! ఈ మిల్లులో నాతోపాటు మరిద్దరు వాటాదార్లున్నారు. మిల్లు నష్టంపై నడుస్తున్నట్లు లెక్కలు చూపితే ఆ యిద్దరూ తమ వాటాలను అమ్మేకుంటారు. అప్పుడా మిగతా షేర్లు నేనే కొనాలనుకుంటున్నాను. ఆ విధంగా మీరు లెక్కలు వ్రాయడానికి ఒప్పుకుంటే మిమ్మల్ని మేనేజరుగా నియమిస్తా. అందుకు నెలకు ఆరువందలు వేతనం ఇస్తా. ఉండేందుకు క్వార్టర్సు, ఉపయోగార్థం చక్కని ఇంపాలా కారు. అంతే కాదు— ప్రతి సంవత్సరం లాభాల్లో బోనస్ యివ్వబడుతుంది. చక్కని అవకాశం. జారవిడుచుకో రనుకుంటా.'

'మీరు పెట్టే షరతు కంగీకరించి ఉద్యోగంలో ప్రవేశిస్తా ననుకోండి. ఉద్యోగంలో ప్రవేశించిన తత్‌క్షణంనుండి ముగ్గురిలో ఒక్కరుగానే తప్ప మీరొక్కరే నాకు యజమాని కారుగదా?' తొణకకుండా నవ్వకుండా అర్ధోక్తిగా జవాబిచ్చాడు.

'సమాధానం సూటిగా చెప్పండి, నగదు ఏమైనా ఆఫర్ చేయమంటారా?' సేఠ్ వ్యవహార దక్షతతో, ఎదుటి వ్యక్తిని సుముఖుణ్ణి చేసుకొనే ధోరణిలో అన్నాడు.

'నగదు కాశించి నేనలా అనలేదు. మిగతా యిద్దరు యజమానుల్ని మోసగించిన వ్యక్తి మిమ్మల్ని మోసగించడని మీరెలా అనుకొనగలుగుతున్నారు?'

'మీరనేది కరక్టే. మిల్లు నా స్వంతమైనపుడు అజమాయిషీ నేనే చేస్తుంటాను కాబట్టి. ఎక్కడో మారుమూల గ్రామాల్లో సేద్యం చేసుకుంటూ నామీదున్న విశ్వాసంతో వ్యవహారమంతా నాకే వదలిపెట్టిన వాటాదార్లలా గాక నేనే స్వయంగా చూసుకొంటున్నప్పుడు నా కళ్ళు కట్టలేవు గదా?'

మిల్లు నష్టం మీద నడుస్తున్నట్లు చిట్టాల్లో తప్పుడు లెక్కలు రాసినప్పుడు మీతోటి వాటాదార్లనే కాక దేశాన్ని, ప్రభుత్వాన్ని కూడ మోసగించడమే అవుతుంది గదా! ఆదాయపు పన్నుల నెగవేయడం నేరం కాదా?'

'పత్రికా ముఖంగా మేము చేసిన ప్రకటనలో క్వాలిఫికేషన్ గురించి అడగలేదనుకోండి! కరస్పాండెన్స్‌కోసం విద్య అవసరమే గదా! మీరెంతవరకు చదువుకున్నారు?'

తనను వేరేదిక్కు డైవర్ట్ చేయాలని సేఠ్ అనుకొంటున్నాడని పసిగట్టి నా ప్రశ్నకు సమాధాన మివ్వడంలో తప్పేమి లేదు కాబట్టి — అతను అన్నట్లు కరస్పాండెన్స్‌కోసం విద్య అవసరమే కాబట్టి 'బి కాం' అన్నాడు క్లుప్తంగా.

'క్లాస్ వచ్చిందా?'

'ఫస్ట్ క్లాస్.'

'ఎం. కాం.కు ఎందుకు వెళ్ళలేదు.'

'ఆర్థిక స్తోమత లేక.'

'బి.కాం. పూర్తిచేసి ఎన్ని సంవత్సరాలయింది?'

'రెండు సంవత్సరాలు.'

ఇంతలో సేఠ్ గారు బెల్లు నొక్కారు. 'అయ్యా!' అంటూ లోనికి వచ్చిన ప్యూన్‌తో 'ఇంటర్వ్యూకు వచ్చినవారింక ఎవ్వరూ లేరనుకుంటా.' అన్నాడు రీవిగా.

'లేరయ్యా!' వినయంగా ప్యూన్ జవాబిచ్చాడు. ఎవరూ లేరని రూఢి చేసుకున్న సేఠ్‌జీ తనకు మస్కా కొట్టేందుకేమో నన్నట్లు ప్యూన్‌ను 'రెండు కాఫీ పట్టా' అని పురమాయించేడు.

శుభ్రంగా కడిగిన కప్పుల్లో ఫ్లాస్కులోని కాఫీని పోసిచ్చాడు. తాగాలా? వద్దా? అని సంశయిస్తున్న సౌజన్యారావుతో 'హేవిట్' అన్నాడు సేఠ్‌జీ!

సభ్యతకోసం 'సిప్' చేస్తున్నపుడు 'బి.కాం ఫస్ట్‌క్లాస్‌లో పూర్తిచేసి రెండు సంవత్సరాలయినా ఉపాధి కల్పించలేని దేశంపట్ల మీరు గౌరవాన్ని చూపుతున్నారా?' సేఠ్ ధోరణిలో హేళన ధ్వనించింది.

'శాస్త్రజ్ఞులు, ఇంజనీర్లతో పోల్చుకున్నప్పుడు వారిముందు నా క్వాలిఫికేషన్ ఏపాటి? వారికే ఉపాధులు లేనపుడు...'

'దేశంపట్ల గౌరవం ఎందుకు చూపాలంటాను?'

దేశం మనకేమి చేసిందని ప్రశ్నించే ముందు మనం దేశానికేంచేశామని ఆత్మ విమర్శ చేసికోవాలి.

పట్టు విడువని భల్లూకంలా సేఠ్ మళ్ళీ 'మీరు చదువుకున్నవారు మీ మంచిచెడుల గురించి యోచింమకోగల ఆలోచనాశక్తి కలిగినవారు. నేనాఫర్ చేస్తున్న ఉద్యోగమే కావాలో, లేక దేశంపట్లగల అభిమానమో మీరే నిర్ణయించుకోండి, రేపటివరకు గడువిస్తున్నాను. నిదానంగా ఆలోచించుకొని రేపు సాయంతంలోగా మీ నిర్ణయాన్ని నాకు తెలియజేయండి' అన్నాడు సేఠ్ శ్రేయోభిలాషిలా!

'క్షమించండి! ఎంతో విలువైన మీ సమయాన్ని వృథా చేసాననుకుంటా! పాలు తాగి రొమ్ముగుద్దే కృతఘ్నుడిలా ఉద్యోగం కోసం తప్పుడు లెక్కలు వ్రాసి మాత్ర

దేశాన్ని మోసగించలేను. కాని నన్ను అందుకు వసేమిరా ఒప్పుకోదు ఇక సెలవు. అంటూ సౌజన్యారావు కుర్చీనుండి లేచాడు.

'మళ్ళీ కలుద్దాం అనండి: అది మన సాంప్రదాయం.'

'మనవి విభిన్న స్వభావాలు. భిన్న మార్గాలు'

'భిన్నధ్రువాలు కలుస్తాయని సైన్స్ అంటుంది గదా!'

'నీతికి ప్రిఫరెన్స్ యివ్వబడుతుందని యిక్కడికి వచ్చాను. వ్యక్తి నీతికి, యిక్కడి మీ రీతికి పొత్తు కుదరనప్పుడు మళ్ళీ కలుద్దాం అని ఎలాఅనగలను, అది 'నాన్సెన్స్' అవుతుందేమో! ఇక నా నిర్ణయానికి తిరుగులేదని మిల్లునుండి బయటపడ్డాడు ప్రయోగించిన శరంలా. కర్మాగారంనుండి బయటకువచ్చాక జైలునుండి విడుదల పొందిన వానిలా ఫీలయాడు. కాని ఆలోచనలు కందిరీగల్లా ముసురుతూనే ఉన్నాయి. శ్రామికుల రక్తమాంసాల్ని పీల్చి పిప్పి చేస్తున్న యీ ధనికవర్గంతో నీతినిజాయితీ ఉంటుందనుకోవడం నేతిబీరకాయలో నెయ్యి ఉంటుందనుకోవడంలాంటిదే. దేశంలో 'మొరాలిటీ' లుప్తమైపోతున్నదేమోనని పించింది, గతంలో తను అటెండ్ అయిన రెండు ఇంటర్వ్యూలు జ్ఞప్తికివచ్చి.

# స్వయంవరం

ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజి ఆఫీసులో తన పేరు నమోదుచేయించుకున్న ఆరు నెలలకు ఫలానరోజున ఉదయం 11—30 గంటలకు ఆఫీసుకువస్తే కాల్ యిస్తామని తెలియజేసారు..ఆఫీసులో అడుగుపెట్టగానే కొట్టవచ్చినట్టు కనబడే వాక్యం— అందరిని సమానదృష్టితో చూస్తామని. అక్కడ జరిగే తంతు దానికి విరుద్ధం. ఖాతలకు చేతలకు ఎక్కడా పొత్తు కుదరదు.

ఇంటర్వ్యూకు వెళ్ళేందుకు ఆర్డరిస్తారా అని వినయంగా అడిగిన యువకులను కసిరికొట్టిన ఆఫీసరు మహాశయుడు, అబలయనియో లేక విజాతిధ్రువాలు ఆకర్షించుకుంటాయనే సత్యాన్ని మరోమారు ఋజువుపరచుటకో, బాబ్డ్ హేర్ తో స్టైహీల్సును టకటకలాడిస్తూ వచ్చిన ఒక నవనాగరికురాలిని చూచి ఐస్ అయిపోయి ఆవిడకు కూర్చునేందుకు ఆసనమిచ్చి, నిమిషాలమీద ఆర్డర్ యిప్పించాడు.

మొత్తంమీద ఎలాగో అలాగా అధికారికి కృపకలిగి మధ్యాహ్నము రెండింటికి డి. ఎఫ్. వో. (డిస్ట్రిక్టు ఫారెస్టు ఆఫీసర్) కార్యాలయములో ఉన్న ఒక వేకెన్సీకి యింటర్వ్యూకెళ్ళండంటూ ఆర్డర్ చేతికిచ్చాడు.

లోకల్ బస్‌లో పడి హడావిడిగా నడచి డి ఎఫ్ వో ఆఫీసుకు వెళ్ళి రెండు గంటలు పడిగాపులు కాచినా అతాపతా కనుగొనే నాథుడే లేకపోయాడు. ఎంత సేపని అలా నిరీక్షించేది. సూపరింటెండెంట్ వద్దకు వెళ్ళి 'కాల్' చూపించగా పదిరోజుల క్రితం అలాంటి 'అడ్వర్టైజ్మెంట్' చేసిన విషయం యదార్థమేనని —ఈ ఆఫీస్‌లో అటెండర్‌గా పనిచేస్తున్న డి. ఎఫ్. వో. గారి దూరపు బంధువును ఆ 'వేకెన్సీ'లోకి నిన్ననే ప్రమోట్ చేయడం జరిగిందని చావుకబురు చల్లగా చెప్పారు. ఖాళీ ఉందని ప్రకటించడ మెందుకు? నిరుద్యోగుల్లో ఆశల్ని రేపడమెందుకు? బహుశా ఫార్మాలిటీస్ సేక్ కోసమేమో! ఆశ్రిత పక్షపాతం, బంధుప్రీతి ఎప్పుడు రూపు మాసిపోతాయో? అలాంటి సూచనలు కనుచూపు మేరలో ఎక్కడా కనిపించడంలేదు.

మరో మూడుమాసాలకు జిల్లా పరిషత్‌లో సీడ్‌స్టోర్‌కీపర్ పోస్టుకు కాల్ వస్తే ఇంటర్వ్యూకి వెళ్ళాడు తను. అభ్యర్థులకు రిటెన్‌టెస్ట్ పెట్టారు. బాగా మంచిగానే రాసాడు. మూడురోజుల తర్వాత వస్తే రిటెన్ టెస్టులో నెగ్గినవారికి ఓరల్ టెస్ట్ పెడ్తామని చెప్పారు. మూడురోజుల తర్వాత వెళ్తే నోటీస్‌బోర్డుపై ప్రకటించిన ఫలితాల్లో తనపేరు చివర్న ఉంది. చెయిర్మన్‌గారే స్వయంగా ఓరల్ టెస్టు తీసికొంటారని తెలిసింది. ఏ మినిస్టర్‌గారి సిఫార్సువున్నవాళ్ళు పోస్టును గద్దలా తన్నుకపోతారోనని సామాన్యుడైన తనకు భయమేసింది. రిటెన్ టెస్టులో పాల్గొన్న నలుబదిమందిలో, కేవలం తనితో పాటు నలుగురే సెలక్టయారు. అర్ధగంట తర్వాత తన వంతు వచ్చింది. లోనికి వెళ్ళాడు తను.

'నమస్కారం సార్' అన్నాడు తను.

(ప్రతి నమస్కారం చేస్తే (నోటి ముత్యాలు రాలిపోతాయేమోనని) చైర్మన్ తల అలవోకగా ఊపాడు.

'క్వాలిఫికేషన్?' కించిత్ అహం ధ్వనించిన స్వరంలో.

తను చెప్పాడు—నమ్రతగా.

నీ ఆన్సర్ స్క్రిప్ట్స్ చూసాము. రైటింగ్ చాలా చక్కగా ఉంది



'థాంక్స్ సార్!' అన్నాడు వినమ్రతతో.

చెయిర్మెన్‌గారు బెల్లు నొక్కగానే లోనికి వచ్చిన ఫ్యూన్నుద్దేశించి 'విషయం తెలియజెయ్' అని హుకుం జారీ చేసారు.

'రండి సార్' అన్న ఫ్యూన్ను అనుసరించాను. కార్యాలయానికి వెనక ఖాళీగా నున్న ప్రదేశానికి తీసికపోయి తనమాటలు ఎవరూ వినేవారు లేరని రూఢి చేసుకున్న తర్వాత 'మీకీ ఉద్యోగం కావాలాండీ?'

'అదే కదా వచ్చింది!'

'అనుకోగానే సరా బాబు మినిష్టర్ల రికమెండేషన్లున్న వారున్నారు మరి?' ఇల్లలకగానే పండుగ కాదన్న నానుడి ధ్వనింపెట్టు.

'ఐతే ఏం చేయాలో నీవే చెప్పు?'

'మీకామాత్రం తెలీదా బాబూ' అంతా సత్తెకాలపు సత్తెయ్యలాగున్నారు మీరే మాత్రం యివ్వగలరు'' స్వరం మరీ తగ్గించి 'ఐదువందలకంటె పైసా తక్కువైతే బేరం కుదరదు'

'ఐదువందలే!'

సిద్ధాన్నాన్ని పాడుచేసుకోకండి తంటాలుపడి అయినా తేండి 'ఇతర్లు యింతకంటె ఎక్కువే యిచ్చేందుకు సిద్ధంగా ఉన్నారు మీరు బాగా రాసారు కాబట్టి మీకీమాత్రమైనా కన్సెషను తర్వాత మీ యిష్టం' పోకను పగులకొట్టినట్లు చెప్పాడు

తనవద్ద ఐదువందల రూకలే ఉంటె, లేక ఎవరివద్దో తెగ్గితె యీ ఆఫీసుల చుట్టు తిరిగే ఖర్మేం పట్టేది. ఏ కిళ్లీ కొట్టో పెట్టుకొని బ్రతుకును సాగించుకోను లను (స్వగతం)

'వారిదేం ఎక్కువైందని?' (పకాశంగా) 'డబ్బు ఎవరికి చేదు బాబు వారికి తక్కువై కాదు జిల్లా పరిషత్‌కు అధ్యక్షులై కేవలం యీ జిల్లావరకే సేవచేయగల్గున్నారు వచ్చే ఎలక్షన్లో పార్టీ టికెటు దొరుకుతుంది ఎలెక్షన్లో గెలవాలంటె బోల్డు డబ్బుకావాలిగదా? రాబున్న జనరల్ ఎలెక్షన్లలో నెగ్గితె, వారు సీనియర్ మెంబర్ కాబట్టి మంత్రిపదవి తప్పకుండా వస్తుంది అలా మొత్తం రాష్ట్రానికే సేవ చేయాలని ఎంతో ఉబలాటపడుతున్నారు.'

ఈ చెయిర్మెన్‌గారి సంగతి తనకు తెలీంది కాదు. పంచాయతీ ఎన్నికల్లో వార్డు మెంబరుగానైనా గెలువలేని యీ ప్రబుద్ధుడు దొడ్డిదారిగుండా (కో ఆప్టెడ్ మెంబరుగావచ్చి) జిల్లాపరిషత్‌కు అధ్యక్షుడై కూర్చున్నాడు. డబ్బును వెరజిమ్మి, రెండులక్షల రూకల వ్యయంతో నిర్మించబడ్డ జిల్లాపరిషత్ బిల్డింగ్‌తోపాటు కంట్రాక్టరు యిచ్చిన పర్సెంట్‌తో.. ఉద్యోగుల నియామకాలకు తీసికున్న లంచాలతో స్వంతబిల్డింగును లేపిన మహానుభావుడు. చేసినసేవ—(కాదు – షేవ్)తో తృప్తిపడక రాష్ట్రానికి పోతాడట ఆ వెనుక అంతెక్కడ? అటుతర్వాత కేంద్రానికి పోతానని అనకుండా ఉంటాడా? ప్రజాధనాన్ని, అధికారాన్ని దుర్వినియోగం చేస్తున్న ఈ పయోముఖ విషకుంభాలకు వోటర్లు గట్టిగా బుద్ధిచెప్పే దెప్పుడో? వోటు విలువ పచ్చనోటో—సారా బాటిలో అనుకొంటున్న వోటరు మహాశయులు ఈ విషమ పరిస్థితుల్ని మార్చగలరా? కేవలం దక్షిణ యివ్వలేనందుకు ఆ ఉద్యోగం దొరకలేదు కాళ్ళీడ్చుకుంటూ రూంకి వచ్చిన సౌజన్యారావు తిన బుద్ధికాక అలాగే పక్కమీద ఒరిగాడు. తలలో అనేకానేక ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి నిద్ర రావడంలేదు తన భవిష్యత్తులా. ఆకాశంలో చుక్కలొక్కొక్కటే మాయమౌతున్నాయి తన ఆశల్లా. క్షణక్షణానికి చీకటి చిక్కనవుతున్నది తనలోని నిరాశలా!

* * *

పోస్ట్ అన్న కేకతోపాటు కవరొకటి రూంలోకి వచ్చింది కవరుచించి ఉత్తరం విప్పాడు సౌజన్యారావు.

ప్రియమైన సౌజన్యారావుకు — శుభాశీస్సులు

ఉదరపోషణార్థం నమ్మిన సిద్ధాంతాలకు తిలాంజలి యివ్వనందుకు నిన్ను నిండుమనస్సుతో అభినందిస్తున్నాను. మా కర్మాగారంలోని మేనేజరుపదవి నిన్ను వరించిందని తెలియజేయడాని కెంతో సంత

స్వయంవరం

సిస్తున్నాను. నిన్ను అనేక ప్రశ్నలతో విసిగించినందుకు మరేమీ అనుకోవను కుంటా. అది నా కర్తవ్యం. ఆ పరీక్షలో నీవు నెగ్గావు. ఇక నేను నిశ్చింతగా ఉండ వచ్చు. ఇదంతా మా చిరంజీవి చేసుకున్న పూర్వజన్మ సుకృతమనుకుంటా నీలాంటి నిజాయితీపరులు దొరకడం. ఇక ప్రస్తుతాంశానికి వద్దాం. మా దంపతులకు శ్రీ వేంకటేశ్వరస్వామి కటాక్షంతో అనపత్య దోషం తప్పి ఒక కులదీపకుడు కలిగాడు. వాడిప్పుడు పది సంవత్సరాలవాడు. నాకీ మధ్యనే క్యాన్సర్ అటాక్ ఐంది. ఇక నేనెంతోకాలము బతకలేను. ఇంటర్వ్యూలో నేనన్నట్లుగా షేర్‌హోల్డర్లెవరులేరు. ఇక ఎంతోకాలం బ్రతకనని నాకు తెలుసు. వెళ్ళేముందు చేయవలసిన పనులు పూర్తిగా చేయాలి. మిల్లు వ్యవహారాల్ని చూచుటకు చిరంజీవి పెరిగి పెద్దవాడయ్యేంతవరకు లావాదేవీలు చూచుటకు ఒక ట్రస్టీ అవసరం గదా? అందుకే యింటర్వ్యూలో అభ్యర్థుల్ని అలా అడగవలసి వచ్చింది—నిజాయితీపరులను ఎన్నుకొనుటకు. మిగతా అభ్యర్థుల్ని నిజాయితీపరులు కారని నేననను. వారు పరిస్థితులకు బానిసలు. త్వరగా వచ్చి ఈ బాధ్యతల్ని స్వీకరించు.

ఇట్లు నీ శ్రేయోభిలాషి,
సేఠ్ జ్ఞాన్‌చంద్'

అన్న ఉత్తరం దానితోపాటు అపాయింట్మెంట్ ఆర్డరును చూచి—సమాగత రాజకుమారులకు కాక తన తండ్రి అవమానించాలని ద్వారంవద్ద నిలబెట్టిన విగ్రహం మెడలో మాలను వేయగానే ప్రచ్ఛన్న రూపంలో నున్న పృథ్వీరాజ్ సంయుక్తను గుర్రంపై కూర్చుండబెట్టుకొని తన రాజధానికి వెళ్ళినట్లు సౌజన్యారావు మేనేజరు పదవిని చేబట్టుటకు మిల్లుకు బయలుదేరాడు. ●

## లిట్‌క్విజ్ నెం. 92 అధికార ఎంట్రీ ఫారము

మొత్తము బహుమతి రు 1,15,000/- ఆఖరు ముగింపు తేది 9—2—72 గురువారం

ADDRESS: LITQUIZ No 92 ALANKAR BALARAM STREET BOMBAY-7.

గమనిక: — 1. ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి. 2. ఒక కూపను మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టివేయండి. 3. ఎంట్రీ రుసుము M. O. ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండి పొందిన M. O. రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను. M. O. రసీదు లేని ఎంట్రీలు నిరాకరింపబడును. 4. I. P. O. క్రాస్ చేయవచ్చు. అది లిట్‌క్విజ్ నెం. 92, బొంబాయి—7 వారికి చెల్లించునట్లు ఉండవలెను.

| MAIN | Re. 1 | 1 | Re. 1 | 2 | Re. 1 | 3 | Re. 1 | 4 |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ABOUT | AGAINST | ABOUT | AGAINST | ABOUT | AGAINST | ABOUT | AGAINST |
| 2 | ART | THOUGHT | ART | THOUGHT | ART | THOUGHT | ART | THOUGHT |
| 3 | ARTISTIC | SCIENTIFIC | ARTISTIC | SCIENTIFIC | ARTISTIC | SCIENTIFIC | ARTISTIC | SCIENTIFIC |
| 4 | ARTISTS | HUMORISTS | ARTISTS | HUMORISTS | ARTISTS | HUMORISTS | ARTISTS | HUMORISTS |
| 5 | AUTHORITY | EQUALITY | AUTHORITY | EQUALITY | AUTHORITY | EQUALITY | AUTHORITY | EQUALITY |
| 6 | CODE | CUSTOM | CODE | CUSTOM | CODE | CUSTOM | CODE | CUSTOM |
| 7 | COINS | CRAFTS | COINS | CRAFTS | COINS | CRAFTS | COINS | CRAFTS |
| 8 | DEVOTION | REFLECTION | DEVOTION | REFLECTION | DEVOTION | REFLECTION | DEVOTION | REFLECTION |
| 9 | DISBELIEVED | DISOBEYED | DISBELIEVED | DISOBEYED | DISBELIEVED | DISOBEYED | DISBELIEVED | DISOBEYED |
| 10 | EQUALITY | SECURITY | EQUALITY | SECURITY | EQUALITY | SECURITY | EQUALITY | SECURITY |
| 11 | EVENTS | TALENTS | EVENTS | TALENTS | EVENTS | TALENTS | EVENTS | TALENTS |
| 12 | IGNORANCE | VENGEANCE | IGNORANCE | VENGEANCE | IGNORANCE | VENGEANCE | IGNORANCE | VENGEANCE |

## BIGQUIZ

*ONE COUPON FREE WITH EACH MAIN COUPON*

| 92 | FREE | 1 | FREE | 2 | FREE | 3 | FREE | 4 |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ABOUT | AGAINST | ABOUT | AGAINST | ABOUT | AGAINST | ABOUT | AGAINST |
| 2 | ART | THOUGHT | ART | THOUGHT | ART | THOUGHT | ART | THOUGHT |
| 3 | ARTISTIC | SCIENTIFIC | ARTISTIC | SCIENTIFIC | ARTISTIC | SCIENTIFIC | ARTISTIC | SCIENTIFIC |
| 4 | ARTISTS | HUMORISTS | ARTISTS | HUMORISTS | ARTISTS | HUMORISTS | ARTISTS | HUMORISTS |
| 5 | AUTHORITY | EQUALITY | AUTHORITY | EQUALITY | AUTHORITY | EQUALITY | AUTHORITY | EQUALITY |
| 6 | CODE | CUSTOM | CODE | CUSTOM | CODE | CUSTOM | CODE | CUSTOM |
| 7 | COINS | CRAFTS | COINS | CRAFTS | COINS | CRAFTS | COINS | CRAFTS |
| 8 | DEVOTION | REFLECTION | DEVOTION | REFLECTION | DEVOTION | REFLECTION | DEVOTION | REFLECTION |
| 9 | DISBELIEVED | DISOBEYED | DISBELIEVED | DISOBEYED | DISBELIEVED | DISOBEYED | DISBELIEVED | DISOBEYED |
| 10 | EQUALITY | SECURITY | EQUALITY | SECURITY | EQUALITY | SECURITY | EQUALITY | SECURITY |
| 11 | EVENTS | TALENTS | EVENTS | TALENTS | EVENTS | TALENTS | EVENTS | TALENTS |
| 12 | IGNORANCE | VENGEANCE | IGNORANCE | VENGEANCE | IGNORANCE | VENGEANCE | IGNORANCE | VENGEANCE |
| 13 | LABOURING | LIVING | LABOURING | LIVING | LABOURING | LIVING | LABOURING | LIVING |
| 14 | LIVE | LOVE | LIVE | LOVE | LIVE | LOVE | LIVE | LOVE |
| 15 | MIND | MONEY | MIND | MONEY | MIND | MONEY | MIND | MONEY |
| 16 | SENSES | SOIL | SENSES | SOIL | SENSES | SOIL | SENSES | SOIL |

## MINIQUIZ

*FREE AFTER 4 MAIN (& 4 BIGQUIZ) COUPONS*

| | | | |
|---|---|---|---|
| DEVOTION | REFLECTION | LABOURING | LIVING |
| DISBELIEVED | DISOBEYED | LIVE | LOVE |
| EQUALITY | SECURITY | MIND | MONEY |
| EVENTS | TALENTS | SENSES | SOIL |
| IGNORANCE | VENGEANCE | | |

ఈ క్విజ్ ప్రవేశమునకు చెందిన నిబంధనలను, షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను. మరియు కాంపిటీషన్ ఎడిటరుగారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/— ఈ పూర్తి ఎంట్రీ ఫారము (4 కూపనులకు) ఫీజు రు. 4/— M. O. రసీదు / I. P. O. / లిట్‌క్విజ్ క్యాష్ రశీదు / ప్రైజు కార్డు జతపరుస్తున్నాను.

వాటి నెం. ......................

నెం. 93 ఫారములు పొందుటకై దీనిని పూర్తి చేయండి. ఇంగ్లీషులో పెద్ద అక్షరాలలో వ్రాయండి

FULL NAME ......................................

ADDRESS ......................................

POST ................ DIST. ...............

92 (ASVP)

FULL NAME ......................................

ADDRESS ......................................

POST ................ DIST. ...............

ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను

## ఉచిత పెద్ద & చిన్న సమస్యలు

### గమనిక

ఇవి కొటేషనులు. రచయితల పదములే యిందుకు సరియైన సొల్యూషనులు. రచయితల పేర్లు, పుస్తకములు, పేజి నెంబర్లు తేది 13—2—72 గల లిట్ క్విజ్ వీక్లీలో ప్రచురింపబడును. ఇందుకు సంబంధించిన అధికార పూర్వక మైన సొల్యూషన్ కూడా తేది 13—2—72 గల ఆంధ్రప్రభ మరియు సండే స్టాండర్డునందు ప్రచురింప బడును. బహుమతి పట్టీ లిట్ క్విజ్ వీక్లీలో ప్రచురింపబడును. అడ్వాన్సు 20—2—72, స్పైసర్ 27—2—72, సంగ్రహం— సండే స్టాండర్డ్ 27—2—72. ఇందుకై 10 పైసలు, స్వంత అడ్రసు గల పోస్టు కార్డు మీ ఎంట్రీలతో పంపిన ప్రకటింపబడిన వెంటనే సొల్యూషన్ మీకు పంపబడును.

ప్రస్తుతపు లిట్‌క్విజ్ నీక్లీ కాపీ అడిగి, ఉచితంగా పొందండి

**ఏజంట్లు.** క్యాష్ రసీదులు, ఎంట్రీ ఫారములు లిట్‌క్విజ్ వీక్లీ ఈ ఏజంట్ల వద్ద లభిస్తున్నవి:

**మద్రాసు:** స్టార్ న్యూస్ ఏజన్సీ, 186, బ్రాడ్వే కార్నర్

**విజయవాడ** శ్రీనివాస్ ఏజన్సీస్, ఏలూరు రోడ్డు, గవర్నరుపేట.

**హైదరాబాద్:** సెవెన్ సీస్, (ఫోన్ నెం. 48180) 25, బహదూర్ పుర రోడ్డు.

## ఫిలిప్స్ మర్ఫీ ట్రాన్సిస్టర్

# ఒక వారం విపరీతం
## ఫాలాక్షుడు

### రోగాలొస్తున్నాయి జాగ్రత్త

బ్రిస్ బెన్‌లో మెంటల్ ఆసుపత్రిలో అతి భద్రంగా దాచిన భయంకర రోగ క్రిములను ఎవరో ఎత్తుకుపోయారట ఆ క్రిములను దాచిన ప్రదేశాన్ని కరెంటుతో కాపాడినా ఎవరెత్తుకుపోయారో, ఎలా ఎత్తుకుపోయారో తమకు తెలియలేదని ఆసుపత్రి అధికారులన్నారట ఆ క్రిముల ద్వారా అనేక భయంకర వ్యాధులు జనులకు వ్యాపించవచ్చునని, జాగ్రత్తగా వుండవలెననీ పోలీసు, శాఖ ప్రజలకు తమ హెచ్చరిక ప్రచారం చేసిందట

### కొడుకా? కూతురా?

మైసూరు స్టేటు నామగుండ్లు అనే వూరుకు చెందిన జయరాం అనే ఓ యువకుడు సెక్సు ఆపరేషను ద్వారా స్త్రీత్వం పొందాడట




అతను పూనాలో పనిచేస్తున్నాడట అయి దేళ్ళ క్రితం ఈ ఆపరేషను చేయించుకున్నాడట ఈ అయిదేళ్ళుగా స్వగ్రామానికి ఎప్పుడూ వెళ్ళకుండా తన క్షేమ సమాచారాలను వుత్తరాల ద్వారా తెలియపరుస్తూ వచ్చాడట. చివరికి తండ్రి కోరగా పూనావదిలి శలవుమీద వచ్చేసరికి వచ్చేసిన వ్యక్తినిచూసి ఆతండ్రి అట్టే వుండిపోయాడట తన కొడుకును పోలిన స్త్రీని చూసి ఆశ్చర్యంలోంచి తేరుకునేలోగా, నేనే జయరాంను జయలక్ష్మినయిపోయాను' అని విజ్ఞప్తి చేశాడట పురుషుడైన ఆ జయరామ్ చిన్నజడతో, చీరా, రవికతో తనవాళ్ళకందరికి దర్శనమిచ్చి 'నాకిక వరుణ్ణి వెతకండి పెళ్ళిచేసుకోవాలి' అని కూడా అన్నాడట— లేక, అన్నదట బాబోయ్ పొరుగూర్లో చదువుకుంటున్న పిల్లలను తలిదండ్రులప్పుడప్పుడు చూసుకోపోతే వచర, విభక్తులేగాక స్వతంత్రించి లింగాలు కూడా మారితే!!!

* * *

### కల్పతరువు రోహిణి

డయబిటిస్ వ్యాధిగ్రస్తులకు 'రోహిణి' అనే ధాన్యం కల్పతరువు వంటిదని డాక్టర్ గోపాలకృష్ణన్ అన్నారట పాలఘాట్‌కు చెందిన పట్టాంబిలో 'బియ్యం పరిశోధన కేంద్రం'లో ఈవిషయం పరిశోధన మూలకంగా తేల్చారట మిగతా ధాన్యాలలో 6 నుంచి 8 శాతం ప్రొటీనులుంటే రోహిణిలో 14 శాతంవున్నాయనీ కనుక ఆ వ్యాధి కలవారికి రోహిణి అన్నివిధాలా మంచి ధాన్యమనీ అన్నారట— మరికనేం,, ఎర్రిబ్రదర్!

### నక్సలైట్ రాసిన పుస్తకానికి అవార్డు

కేరళ 'కిలిమానూరు' హత్యకేసులో అరెస్టయిన కె వేణు అనే నక్సలైటు వ్రాసిన 'ప్రపంచమా— మనుష్యుడా' అనే పుస్తకానికి కేరళ శాస్త్రసాహితీ పరిషత్తు యీయేడు బహుమతి నివ్వదలచినట్టు ప్రకటించిందట— బట్ ది అథరిటీజిన్ జెయిల్— వాటీఫ్

### లంచాల పంచాంగం

భారతదేశ వెన్నెముక ఢిల్లీ పట్టణంలో సుమారు ఎనిమిది వేలమంది చలికి కొంకర్లుపోతూ, రోడ్డు పక్కన జీవనం చేస్తున్నారట ఢిల్లీ జనాభాలో 70 శాతం మురికి ప్రదేశాలలో గాని, అంతకేమాత్రం తీసిపోని యిళ్ళలో గాని నివసిస్తున్నారట పున్న 40 లక్షల జనాభాలో 12 లక్షల మంది కనీసపు సౌకర్యాలు లేని 'ఇళ్ళు' అని చెప్పబడే గుహలలో తలదాచుకుంటున్నారని, ఈ దరిద్రం తీరాలంటే ఏటా 40 వేల యిళ్ళు చొప్పున కట్టాలనీ అంచనాలు తెల్చారట తత్సంబంధమైన శాఖవారు జనాభాలో 60 శాతం నెలసరి సంపాదన వందకు లోపేనట వారిలో సుమారు ఆరువేలమంది ముష్టెత్తి గాని, జేబులకొట్టిగానీ జీవనం చేస్తున్నారట— ఇదిలా వుండగా —బేగాలాభాగ్‌కు చెందిన రామ్‌లాల్ అనే ఓ వ్యాపారితో ఎక్సయిజు విషయంలో రాజీపడి, 130 రూపాయలు లంచం తీసుకున్నారన్న నేరం మీద సర్దార్ బజార్‌కు చెందిన అసిస్టెంటు ఇనస్పెక్టర్ ఆఫ్ పోలీసు మిస్టర్ హరిసింగ్‌నూ, జయదేవ్ అనే కాన్స్టేబుల్నీ అవినీతి నిర్మూలనశాఖ పట్టుకున్నదట— అదీ విషయం

* *

### అపరపరశురాముడు

తన తండ్రి తనను కూలికి వెళ్ళమని తిట్టిపోశాడన్న ఆవేశంలో వేడపాడు గ్రామంలో 20 ఏళ్ళ లంకా భాస్కరరావు అనే పరశురాముడు 50 ఏళ్ళ తన తండ్రి అప్పారావు నిద్రపోతుండగా కత్తితో ఆయన మెడ నరికి చంపేశాడట

### అశుభాకాంక్ష!

రోమ్‌లో మొన్న నూతన సంవత్సర శుభోదయ సందర్భంలో 34 సంవత్సరాల ఒకామె తన ఇద్దరు పిల్లలనూ తీసుకొని ఓ భవనం ఆరో అంతస్తునుంచి దూకిందట ఫలితంగా మొత్తం ముగ్గురూ చనిపోయారట ఈ క్రియకి కారణం చెప్పేవారెవ్వరూ దొరకనేలేదట—ఏమయ్యుండును,

### రక్తపు మడుగులో శవం

ఎవరో భయంకర నరరూప రాక్షసులు ఓ నడివయస్సు స్త్రీని చంపి లాల్‌బాగ్ నదిఒడ్డున పడేసి పోయారట ఆ శవాన్ని పోలిసు చూసిందట తలమీద రాయితో బాది తల పగులగొట్టి ఎవరో చంపి వుండాలని నిర్ణయించిందట శవం రక్తపు మడుగులో వికారంగాపడివుందట రక్తంతో తడిసిన బండరాయికూడా పక్కనే వున్నదట,

### చింపాంజి చిత్రలేఖనం

తూర్పు జర్మనీ కుటూస్ ఎంతు ప్రదర్శకశాలలో ఒకచోట కూర్చుని ఓ చిత్రకారుడు తన పని తాను చేసుకుంటుండగా ఆపక్క బోనులోంచి ఓ చింపాంజి తప్పించుకుని వచ్చి ఆ చిత్రకారుణ్ణి ఓ తోపుతోసి, బ్రష్షు తీసుకొని అతని కాళ్ళమీద చిత్రలేఖనం అంటే ఏమిటో చూపించి హాయిగా వెళ్ళిపోయిందట—



## వాచిహ్మాస్యాస్ :

రాజషాహి విశ్వవిద్యాలయం హోహా నుండ నంలో 16 నుంచి 40 సంవత్సరాల వయస్సు గల 200 మంది స్త్రీల శవాలు దొరికాయని అవామీలీగ్ నాయకుడు అబ్దుల్ రహ్మాన్ అన్నారట

పాకిస్తాన్ దళానికి చెందిన లెఫ్టినెంట్ హుమాయూన్ రజా అనే బెంగాలియుడు పశ్చిమ పాకిస్తాన్ వైమానికి విమానాశ్రయంలో మేజర్ ఖాసిం అనే ఆయనతో షికారుగా విమానం ఎక్కి ఆకాశంలోకి ఎగిరాడట విమానం ఆకాశంలో స్థిమిత పడ్డాక 'విమానాన్ని ఇండియాకు మళ్ళించు' అని రజా ఖాసింను కోరారట మొదట ఆ ముక్క జోకేమోనని అనుకున్న ఖాసిం జోకు కాదని నిర్ధారణ చేసుకున్నాక రజా కోరిక మన్నించ లేదట దాంతో రజా పిస్తలుతో, బెదిరించబోయే సరికి ఖాసిం, కలబడ పోయారట చివరికి రజా మేజర్ ఖాసింను కాల్చి చంపి తానే విమానాన్ని నడుపు




కుంటూ ఇండియా వచ్చి హోషియార్‌పూరుకు 18 మైళ్ళలో వున్న మైలై అనే వూళ్ళో దిగాడట దిగీదిగగానే దగ్గరలో వున్న యింటికి వెళ్ళి 'ఇది హిందూ దేశమా' అని అడిగి అవునని తెల్సుకుని ఆ తరువాత తాను అక్కడి అధికారులకు లొంగిపోయాడట 'పాకిస్తాన్ యుద్ధదళంలో ఏ బెంగాలీ ఆఫీసరును మర్యాదగా చూడడం మానేశారని, అక్కడున్న ప్రతి బెంగాలీ ఆఫీసరూ పారిపోవడానికి చూస్తున్నా'రని కూడా ఆయన అన్నారట

### అగ్నిహోత్రుడి ఆకలి

వాషింగ్టనయినా వాలాజీపేటయినా అగ్నిహోత్రుడికి తేడా లేదు వాషింగ్టన్‌లో ఓ హోటలుకు నిప్పంటుకుని పదిమంది కాలి, చనిపోయారట ఆ పది శవాలూ దొరికేయట హోటలులో వుండాల్సిన వారి జాబితా ప్రకారం ఇంకో 36 మంది కనబడట లేదట— అంటే వారి సమావంలో కాలి మసైపోయారా.ఏమో. హూ నోస్!!




మా రాజేశ్వర పాఠకుడు

...............

పేరా చిరునామా యివ్వకపోతే— నూటిలో ఒక్కటికీ బదులు రాదు— గ్రహించండి!

**ఎమ్. ఎన్. సి. ఆలూరు**

మామూలుగా విరాళాలు యిచ్చేటప్పుడు నూటపదహారు అర్ధనూరు పదహార్లు అలా యిస్తారే దాని ఔచిత్యం?

చివర 'సున్న' అంత శుభప్రదంగా తోచక అంతే!

'షాపి విరాయువు' అని తెలుగులో సామెతవుంది కదా, మరి ఎవరినైనా దీవించేటప్పుడు దీర్ఘాయుష్మాన్ భవ' అంటూంటారు వారి ఉద్దేశ్యం?

పాపాలు చేసుకుంటూ కలకాలం బ్రకతకమని మటుకు కాదు వారి ఉద్దేశ్యం! నమస్కరిస్తే 'చావు' అనరు కదా— చిరంజీవిగా వుండమంటారు గాని ఇలాంటివి ఏక సందర్భంలో ఒక్కపొజిషన్‌లో పెట్టి చూడకూడదు— సందర్భాన్ని పట్టి వాడా లంతే

**కె. ఎస్. ఆర్, బెక్కెం**

రచయిత్రులసభ విఫలమైనదని విన్నాను అందులో మీరులేరని కూడా విన్నాను నిజమేనా?

కాని, నేను లేనందువల్ల విఫలమవలేదని తెలియ చేస్తున్నాను సరేనా?

**కె ఎమ్. పి కాకినాడ**

మాతా పిక్చర్సువారి సినిమా ఎక్కడి దాకా వచ్చింది?

పికుదాకా! నాకూ వారికీ గత సంవత్సరంన్నర నుంచి ఏ సంబంధంలేదని తెలియ చేయడానికి సంతోషిస్తున్నాను!!

**కె ఎన్. వి, బొబ్బిలి**

తపస్సంపన్నుడైన భక్తుడు దేవునికి దాసుడా? లేక దేవుడేభక్తునికి దాసుడా?

ఒకరికి ఒకరు బందీసులు

**ఆర్. ఆర్ డి. పాలెం**

మనిషి దేనిని కోరుకుంటాడు?

సుఖజీవితాన్ని

**వి కె ఆర్, శ్రీ కూర్మం**

. ఆపరలోక ప్రాప్తిగురించి ధనం వెచ్చిస్తూ యున్నారు మూఢ నమ్మకాల వలన ఆ డబ్బుతో యిక్కడే స్వర్గం పొందవచ్చని నా అభిప్రాయం

చిత్తం కాని ఆ స్వర్గం శాశ్వతం అని నమ్ముతారు మూడనమ్మకాలతో పరలోకం కోరేవాళ్ళు.

**ఎమ్. ఎమ్. పి, విశాఖపట్నం**

ఈ రోజుల్లో సినిమాలు ఎక్కువగా చూడడంచేత విద్యార్థులు సరిగా చదువుకోవటంలేదని చాలామంది అంటూంటారు. నేను దానికి ఒప్పుకోను .

సినిమాలు చూడ్డంవల్ల కాదు— సినిమాల్లో లాగా ఉండాలన్న తాపత్రయంతో చదువు పాడు చేసుకుంటున్నారు కుర్రాళ్ళు

**బి. ఆర్, హైదరాబాదు**

శ్రీశ్రీకి మహాకవి అన్న బిరుదు ఎవ రిచ్చారు?

కమ్యూనిస్టులే యిచ్చారు పుచ్చుకున్నారు కూడా!

**ఆర్ అమలాపురం**

కలకానిది విలువైనది ఏమిటి?

జీవితం

**ఎం. సిహెచ్. ఆర్, జమ్మలమడుగు**

మీ భర్తగారంటే నాకు చాలా యిష్టం కాని మీరు అంటేనే అసహ్యం ఎందుకో?

కారణాలు వెతకడానికి కష్టపడకండి అలా యిద్దర్నీ వేరువేరుగా చూడ్డం అలవాటు చేసుకోండి

**ఆర్. డి, బరంపురం**

కార్యసాధనకు మానవకృషి ముఖ్యమా? దైవసంకల్పం ముఖ్యమా ?

మానవ కృషి ముఖ్యం అది లేకుండా దైవం మీద ఎంత భారం వేసినా ప్రయోజనం ఉండదు

**ఎస్. కె. ఆర్, న్యూఢిల్లీ**

మీ పేరు మా అమ్మ పేరు—మా అత్తగారి పేరు మా అమ్మాయిపేరు అంతా ఒకటే—

బాగుంది— నా పేరు— మా అమ్మమ్మ పేరు— మా అత్తయ్య పేరూ— ఒకటే!!

**జె. ఆర్, ఢిల్లీ**

బుద్ధిహీనుడెవరు?

బలవంతంగా ఆడదాన్ని మార్చుకలనుకునేవాడే

విద్య నేర్పడం అంటే?

ప్రజలకి తెలియనిది నేర్పడం కాదు ఎలా ప్రవర్తించాలో కూడా నేర్పడం

**సారధి, శ్రీకాకుళం**

చివరన శ్రీ వచ్చే పేర్లు మీకు యిష్టమా? వాటిని మీరు ప్రచురిస్తారు.

ఇష్టం కాదు కాని అసలే కలంపేరు పెట్టుకున్న వాళ్ళ కలంపేరు సహితం పొట్టి చేయడం ఎందుకని ప్రచురిస్తాను (అంతమాత్రంచేత వారి అసలు పేర్లు రాయరని అనుకోకండి పేరు చిరునామా లేని ఉత్తరాలు చూడను)

**కళ్యాణశ్రీ, కోవెలకుంట్ల**

భగవంతునిపై భారంవేసి మానవ ప్రయత్నంచేసిన ఏ కార్యమైనా జయం అవుతుందా ?

ఆ. తప్పక భగవంతుడంటే ఎవరనుకుంటున్నారు? మీలో నమ్మకమే

**జి. పి. ఆర్, విశాఖపట్నం**

స్త్రీని వేయిపట్టక స్వర్గం లభ్యం కాదా ?

కాదు ఆడా మగా కలిసే స్వర్గంలో అడుగు పెట్టాలి వారలాగే దాన్ని వదిలారు అలాగే ఒడ్డు చేరుకోవాలి

**ఎమ్ ఎస్, అనంతపురం**

ప్రేమంటె ఏమిటి? ఈ ప్రశ్న చాలా మందినే అడిగాను సరైన సంతృప్తికరమైన జవాబురాలేదు ఎన్నో నవలలు చదివాను. ఏదీ నచ్చిన నిర్వచనం దొరకలేదు . నేను మరీ చిన్నపిల్లను కాను. నాలుగేళ్ళ నుంచి ఉద్యోగంలో ఉన్నదాన్ని.

నిజంగా యిన్నాళ్ళకి నన్ను ఆశ్చర్యపరిచే ఉత్తరం ఒకటి వచ్చింది! ఇంతకీ మీకు ప్రేమ నిర్వచనం కావాలో, ప్రేమ కావాలో ఎప్పుడైనా ప్రశ్నించుకున్నారా? నిజంగా ప్రేమ చిగురించి నప్పుడే నిర్వచనం కోసం మీరు అన్వేషణ మానేస్తారు దానంతట అదే తెలుస్తుంది— 'ఇదీ ప్రేమ' అని పిచ్చి ఆలోచనలతో బుర్ర పాడు చేసుకోక పిల్లలకి పాఠాలు బాగా చెప్పండి

**కె. వి. ఆర్, కాంబ్రావులపల్లి**

ఆడవారి నోటిలో మాట దాగదంటారు. మరి మీకూ అంతేనా ?

నేను మాటలు చెవితో వింటానంతే నోటితో కాదు!!

**జి. బి. ఎస్, ప్రొసంగులపాడు**

స్త్రీలంటే పురుషులు ఎక్కువగా చిన్న చూపు చూస్తూంటారు హేళన కనుపరుస్తారు ఎందుచేత ?

ఇప్పుడు కూడానా! యూ పాకిస్తాన్ యుద్ధం చూశాక 'వీక్ సెక్స్' అంటూ ఎవరంటీ అనేరా?!

# నలుగురు రాష్ట్రపతులు

ఆగస్టు 15, జనవరి 26, మనదేశ చరిత్రలో రెండు పర్వదినాలు ఒకనాడు స్వాతంత్ర్య భానోదయమైంది మరోనాడు సర్వాధికార సంపన్న ప్రజాస్వామ్య భారతం వెలకొల్పింది 1950 జనవరి 26వ తేదీన వైస్రాయి భవనం రాష్ట్రపతి భవనంగా రూపొందింది

నేటికి రెండు దశాబ్దాల పూర్వం లాహోరులోని రావీనదీ ఒడ్డున అర్ధరాత్రి సమయాన నేటి భారత ప్రధాని, నాటి అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షుడు జవహర్లాల్ నెహ్రూ ఆధ్వర్యాన భారతజాతి చేసిన సంకల్పం నెరవేరింది మన కలలు నిజమైనాయి ఇక నుంచి మన భవితవ్యాన్ని మనం నిరాటంకంగా తీర్చిదిద్దుకోగలం అంటూ భారత ప్రథమరాష్ట్రపతి రాజేంద్రబాబు తన పదవిని స్వీకరించారు

## డా రాజేంద్రప్రసాద్

డా రాజేంద్రప్రసాద్ బహుముఖ ప్రజ్ఞాశాలి అచంచల దేశభక్తి సేవాసురక్తి నిర్మాణ కార్యక్రమ దీక్షాతత్పరత గాంధేయ సిద్ధాంతాలలో వారికున్న అచంచల విశ్వాసం వారి ప్రగాఢ స్వదేశాభిమానం, భాషాప్రేమ నిరపవాదమైనటువంటివి జీవిత పర్యంతం, రాజకీయాలలో నిలువునా మునిగినా వారికెవరూ శత్రువులు లేరు, అందరూ వారికి మిత్రులే వారు నిజంగా అజాతశత్రువు

రాజేంద్రబాబు జీవితగాధను వ్యక్తిత్వ మహిమను గురించి వ్రాసేందుకు తెలుగులోకే బంగారు కలం కావాలని భారత కోకిల సరోజినీ నాయుడుగారన్నారు విద్యార్థి జీవితంలో రాజేంద్రప్రసాద్ ఎప్పుడూ సర్వప్రథములే శ్యామప్రసాద్ ముఖర్జీ తండ్రి అశుతోష్‌ముఖర్జీ ఎమ్ ఎల్ లో రాజేంద్రప్రసాద్ సహపాఠి రాజేంద్రప్రసాద్ ఎమ్ ఎల్ పరీక్షకు కూర్చున్న సంవత్సరం అశుతోష్ పరీక్ష నుంచి విరమించుకొన్నారు ఎందుకని మిత్రుడు రాజేంద్రబాబు ప్రశ్నించగా నీవు పరీక్షకు కూర్చుంటే ప్రథమస్థానం నీదే అన్నారట అశుతోష్ తరువాత కలకత్తా న్యాయస్థానానికి ముఖ్యన్యాయాధిపతి అయ్యారు

స్వరాజ్యసంగ్రామం జోరుగా సాగుతున్న రోజులవి స్వరాజ్యం వచ్చే సూచనలు కానరావడంలేదు నిరాశా పూరితుడై రాజేంద్రప్రసాద్ మోతీలాల్ నెహ్రూగారితో ఒకసారి మనం బ్రతికివుండగా స్వరాజ్యం చూస్తామో లేదో అని తమ సంకోచాన్ని వెలిబుచ్చారు ఆయన నిరాశా నిస్పృహలను చూచి, ఆశావాది మోతీలాల్ మరుక్షణంలో ఉవ్వెత్తున లేచి "చూడు నీవింకా నాకన్నా చిన్నవాడవు ఎందుకు దిగులు పడతావు నా జీవిత కాలంలోనే స్వరాజ్యాన్ని చూస్తాను అంతేకాదు, స్వతంత్ర భారతదేశానికి ప్రథమ రాష్ట్రపతివి కూడా అవుతావు' అని వక్కాణించారు. మరొకటి తలచింది మోతీలాల్‌జీ భవిష్యవాణి తారుమారైంది ప్రథమ రాష్ట్రపతి అయ్యే అపూర్వ గౌరవం రాజేంద్రబాబుకు లభించింది

రాజేంద్రప్రసాద్ అహింసావాది శాకాహారి రాష్ట్రపతి భవనంలోని రాజకీయవిందులలో వడ్డించే మాంసాహారాన్ని తిరస్కరించుకొని ఒక విదేశపత్రికా



డా|| రాజేంద్రప్రసాద్

విలేఖరి ఆయనను ఇలా ప్రశ్నించారు. 'మీరు శాకాహారులు గదా, మరి మీ విందులలో ఈ మాంసాహారమేమిటి?' 'నేను మాత్రం శాకాహారిని, నా గవర్నమెంటు కాదుగదా 'అని' ఆయన నవ్వుతూ బదులు చెప్పారు.

1950 నుంచి 1962 వరకు, రాజేంద్రబాబు రాష్ట్రపతిగానున్న 12 ఏండ్ల కాలం మనదేశ చరిత్రలో నిస్సందేహంగా రాజేంద్రశకంగా పిలువ బడుతుంది ఒక్కమాటలో చెప్పాలంటే, మన ప్రథమ రాష్ట్రపతి రాజేంద్రబాబులో జనకుని సాధుత్వం, బుద్ధుని నిర్లిప్తత, గాంధీజీ త్యాగం మూర్తీభవించాయి.

## డా రాధాకృష్ణన్

రెండవ రాష్ట్రపతి డా రాధాకృష్ణన్ ప్రపంచ మేధావులలో నొకరు ప్రఖ్యాత తత్వవేత్తగా ప్రాక్పశ్చిమ దేశాలలో మిక్కిలి ప్రసిద్ధి కెక్కిన మహాపురుషులు 1962 మే 13వ తేదీన రాష్ట్రపతి పదవిని అలంకరించారు ప్రపంచ చరిత్రలో ఇదొక అపూర్వ సంఘటన శతాబ్దాల పూర్వం వేదాంతులు —రాజులు కావాలన్న ప్లేటో కోరిక ఫలించింది

డా రాధాకృష్ణన్ రష్యాలో భారతరాయబారిగా, నున్న రోజులలో నాటి రష్యా నియంత స్టాలిన్ రాధాకృష్ణన్ గార్ల మధ్య జరిగిన సంభాషణ చరిత్రాత్మకమైనటువంటిది

ప్రథమ సంభాషణలోనే అయిన స్టాలిన్‌తో [illegible] మహా చక్రవర్తులలో ఒకడు రక్తరంజిత యుద్ధాలలో ఘనవిజయం సాధించిన తరువాత, యుద్ధాలనే త్యజించి, సన్యసించిన చక్రవర్తిగా చరిత్రలో ప్రసిద్ధి కెక్కారు మీరు కూడా సైనికబలంతో అధికారానికి వచ్చారు భవిష్యత్తులో మీకు ఏమి జరగుతుందో ఎవరికెరుక అన్నారు స్టాలిన్ నవ్వుతూ 'అవును నిజమే అప్పుడప్పుడు అనేక అద్భుతాలు జరుగుతుంటాయి నేనూ ఒకప్పుడు క్రైస్తవ ధర్మశాస్త్ర పఠనమందిరంలో 5 సంవత్సరాలు గడిపాను ఏది ఎలా అయినా, స్టాలిన్ లాటి వ్యక్తితో ఇంత చనువుగా మాట్లాడే అవకాశం రాధాకృష్ణన్ పండితునకే దక్కింది

రాష్ట్రపతిగా వైట్ హౌస్ ప్రాంగణంలో అడుగు పెట్టినప్పుడు చినుకులు పడ్డాయి గొడుగులు తీయవలసి వచ్చింది నాటి అమెరికా అధ్యక్షుడు కెనెడీ మన రాష్ట్రపతికి స్వాగతమిచ్చిందికి ఏవాన్ని వెలిబుచ్చారు సంఘటనలు అన్ని వేళలో మానవుని అదుపులో ఉండవు కాని సంఘటనల పట్ల మన వైఖరినిమాత్రం మనం ఎల్లవేళల అదుపులో నుంచుకునేందుకు ప్రయత్నించ వచ్చు' అంటూ రాధాకృష్ణన్‌గారు వేదాంత సారాన్ని బోధించారు

సాక్రటీస్ ప్లేటో, హెగెల్ క్యాంట్ పేర్లను మాత్రం మనం విన్నాం కాని ఆధునికయుగంలో ప్రపంచ తత్వవేత్తలలో అగ్రగణ్యులైన రాధాకృష్ణన్‌ను కళ్ళారా చూచి వారి దివ్యవాణిని వినేటి భాగ్యం మానవాళికి కలిగింది ఈ రాష్ట్రపతి విదేశవేగినా, ఎందుకాలిడినా ఏపీఠమెక్కినా తన వెంట శాంతియుత వాతావరణాన్ని తీసుకు వెడుతారని వారి పలుకులు అమృతాన్ని చిందిస్తుంటాయని పండిత్ జవహర్‌లాల్ నెహ్రూగారు ఒకసారి వక్కాణించారు.

(ముగింపు వైపేజీలో)



డా|| రాధాకృష్ణన్



# ఎర్ర గులాబీ

'జెమిని'

సూర్నారాయణ నిద్రలేచాడు.

రోజూలాగానే పక్షులు కిలకిలారావాలు చేసాయ్.

చల్లని పిల్లగాలి కిటికీలోంచి దూసు కొచ్చింది.

సూర్యుడు సప్తాశ్వాల్ని అధిరోహించాడు ఆకాశం రాగరంజితమ్మైంది.

ఇంటిముందు మల్లెతీగ రెండు బొండు మల్లెల్ని పూచింది.

కిటికీలోంచి చూస్తే కళకళ లాడుతూ ఈనాడొచ్చిన పెళ్లికూతుర్లా ఉందంతా—

వవవవలాడుతూ తెల్లటి గులాబీలా విచ్చుకుంది ఊరంతా—

ఒక కిటికీ రెక్కని మూసేశాడు సూర్నారాయణ.

ఇంకా వెలుగు పిక్కువవుతూ కళ్ళు ముందుకు తోసుకొ వస్తూంది రెండో రెక్కని మూసేశాడు.

ఇంక వెలుగు చొచ్చుకొచ్చే సాహసం చెయ్యలేకపోయింది.

కంతల్లోంచి, అద్దాల్లోంచి కపిపించ నంతగా వొచ్చి ఆలుక్కుపోయింది.

'హమ్మ! కాస్త ప్రాణంకి హాయిగా ఉంది'

...'చీకటి గదిలో పక్కమీద ముడుచుకు పడుకుంటే కొంచెం తేలిగ్గా వుంది' అను కున్నాడు సూర్నారాయణ.

ఉన్నట్టుండి కాళ్ళు రెండూ దగ్గరపా చేసి చాచాడు.

దుప్పటీతీసి మోకాలుదాకా లాక్కు న్నాడు.

తిరిగి దుప్పటిని పాదాలదాకా లాక్కుని పక్కకి ఒత్తిగిల్లి చూశాడు. మంచం ప్రక్కన స్టూలు అలానే ఉంది. టేబుల్ గడియారం ఆల్మెయిరా అద్దంలోంచి మూలుగుతోనేవుంది రాజా స్నో పవుడర్' వాడు కొట్టించిన కాలెండర్‌లోని ఆడదాని బొమ్మ నవ్వుతోనేవుంది ...

వీధిలో రిక్షాలు, అందులో మనుషులు తిరిగే సవ్వడి వినిపిస్తూంది. చూస్తుండ గానే బారెడు పొద్దెక్కుతుంది. కిటికీ తెరుస్తే సూర్యుడు ఒంటిని వెళ్ మనిపిం చొచ్చు. తెరవకపోతే కళ్ళు మూసుకు ఇంకో అరగంట నిద్ర 'సుఖాన్ని అన్వే షించొచ్చు.

కానీ నిద్రపట్టదు చలనంలేని, జీవం లేని వస్తువుల్లో తనుకూడా ఒక నమూనా ఏమో అనిపిస్తోంది.

నిద్రలేచిన సూర్యనారాయణ చుట్టూరా కందిరీగల్లా ఆలోచనలు చుట్టుముడు తున్నాయ్.

తప్పించుకోవటానికా అన్నట్టుగా విసు రుగా దుప్పట్ని లాగేశాడు. లేచి మంచం మీద కూర్చున్నాడు ఆలోచనల స్థానే రాత్రి వొచ్చిన కల మస్తిష్కంలో దృశ్య మయింది.

విషాదంగానూ వుంది చిరాకుగానూ వుంది కలలోకి వొచ్చిన సుందరి అసూర్యం పశ్య అయిన రాజకుమార్తె కాదు కనీసం ప్రాణం లేని అజంతా శిలాసుందరి అయినా బాగుండి పోయేది

తను ఎప్పుడూ కన్నెత్తి చూసిన పాపాన పోలేదు ఆమె ఎప్పుడూ (తనతో) పంటితో కాని, పెదవితోకాని మాట్లాడలేదు

ఆర్నెల్లకోసారి భయపడుతూ వొచ్చి, కళ్ళతో ఇదేమిటి అన్నట్టు చూసేది తను మాట్లాడకుండా అర్థంకాని చోట అక్షరాల్ని గుండంగా చెక్కేవాడు డ్రాఫ్ట్ పెట్టుకుపోయి టైప్‌మిషన్‌లోకి మొహాన్ని దించుకునేది

టక్ టక టక. టక్ టక టక

సూర్నారాయణ నింపాదిగా పోయి తలుపు తీశాడు

అశ్రుధారలు చెంపల్ని తడిపేశాయ్

వింపిరిజుత్తు నుదుటిని కప్పేస్తోంది

బయట హోరుమని వర్షం ఆకాశం చీకటిలో పెనిమిటి చనిపోయినట్టుగా ఏడుస్తోంది .

జిగేల్ మని మెరుపు .. ధడీల్‌మని మూసుకున్న తలుపు

'ఏమిటేమిటి? అసలేమిటి జరిగింది?'

* * *

'ఆమె మాట్లాట్టంలేదు

పెదవులు వొణుకుతున్నాయ్.

ఆపాదమస్తకం కంపిస్తోంది.

సూర్నారాయణ లైటువేశాడు. తెల్లకాయితంలో గబగబా రాసేడు

'ఏమిటిది?—అసలేమిటి జరిగింది?'

ఆమె ఏడ్వటం మొదలు పెట్టింది సన్నగా మొదలయిన ఏడుపు నక్కకూసినట్టుగా పదిగొంతుకలతో, ముప్పయ్ మూడు బాకాల్ని ఒక్కసారి ఊదినట్టుగా మారుమోగి పోయింది

'ఏయ్ నాగరత్నం' అని బిగ్గరగా అరిచాడు

పిలుపు ప్రతిధ్వని శతఘ్నిలా పేలింది. దెబ్బతిన్న పక్షిలా తటపట కొట్టుకుని కాళ్ళమీద పడిపోయింది నాగరత్నం

మోకాళ్ళకి నుదురు ఆనించి వెక్కి వెక్కి ఏడుస్తోంది

కోటికోర్కెలు గుండెల్లో అణిచేసుకున్న నిస్సహాయత్వం దీనంగా పెనవేసుకుపోయింది.

ఆమె వెచ్చటి కన్నీళ్ళు పాదాల్ని తడిపి, మెలితిరిగిన నరాల్ని సాగదీసి అతడ్ని ఊర్ధ్వముఖంగా పెంచేస్తోంది

ఆమె కళ్ళల్లో కలువరేకులు లేవు. కన్నీళ్ళ చెలమలు నిండిఉన్నాయ్. ఆశల నక్షత్రాల కంటిపాపలు ఆ తడిలో మెరుస్తున్నాయ్

కాళ్ళను పెనవేసుకుపోయిన చేతులు వొంకర తిరిగి నాగుపాముల్లా బుసకొడుతున్నాయ్

సూర్నారాయణ శరీరం ఆ వికృతాన్ని చూసి గజగజా వొణికింది అవమానంతో శరీరంలోంచి సెగలు, పొగలు రేగాయి పురుగుని విదిలించినట్టుగా విదిలించేశాడు

ఆమె కళ్ళు మాట్లాడ్డం అతనికి తెలుసు

'దిగులుతో గుండెల్నిచెరువుగా చేసుకోకు నీకు నేను తోడుగా వున్నాను ఈ ఒంటరి జీవితాన్ని, వెచ్చటి యవ్వనపు పొంగుని ఇక భరించలేను నేను పోగొట్టుకున్నది నీలో చూసుకోనీ — అగ్నికీలల్లో, అవమాన భారంతో దహించుకుపోతున్న నీ శరీరానికి నా ప్రేమతో అమృతపుజల్లు కురిపించి చల్లబరుస్తాను '

'యూ! డెవిల్! గెటౌట్' అని గొంతుక పగిలేలా అరిచిన సూర్యనారాయణ కలలోంచి తేరుకుని లేచి మంచినీళ్ళు తాగి తిరిగి పడుకున్నాడు.

నిద్రలేచాక, ఉదయిస్తున్న భానుడు గాని, స్పృశించిన సమీరంగాని, వికసించిన పుష్పంగాని మనస్సును ఆహ్లాదపర్చలేదు.

కళ్ళల్లోకి దూసుకవొచ్చిన వెలుగు హృదయంలో నాటుకున్న ములుకులా బాధించింది

రాత్రివొచ్చిన అర్థంలేని కలతో పుండుకి కారం చల్లినట్టుగా అయింది

దరిద్రుడికి నోట్లో శని—వెధవది, సబ్‌కాన్షస్ మైండ్‌లో దాక్కున్న భావాలు ఈ దరిద్రపు కలలుగా మారి దెయ్యంలా పీక్కుతింటాయ్ కాబోలు

సూర్నారాయణమనసు ఛిద్రం అయింది

లేచి కాలకృత్యాలు తీర్చుకున్నాడు తల దువ్వుకుంటోంటే అద్దం చేతిలోంచి జారి పడి ముక్కలయింది.

హోటల్ మెట్లు దిగుతోంటే కాలు జారి ముందుకి తూలిపడబోయాడు మడమ దగ్గర గీసుకుపోయి చర్మం చిట్లి నెత్తురు కారినా చూసుకోలేదు. చుట్టు చూశాడు. ఎవ్వరూ అతన్ని గమనించటంలేదు. కళ్లల్లో నీళ్లు తిరగబోయి ఆగిపోయాయ్.

రిక్షాని కేకేసి అందులోంచి ఏకాఏకిన ఆఫీసు గుమ్మం ముందు దిగాడు, ఆఫీసు గుమ్మం ముందు ఒక్క నిమిషం తటపటాయించాడు. గుమ్మంనించి తన సీటుకు వెళ్లి కూచోవాలంటే నాగరత్నాన్ని దాటుక వెళ్లాలి మరో పదిమంది గుమస్తాల చూపుల తట్టుకొని నెట్టుకుంటూ వెళ్లాలి.

సూర్నాయణ, ఆ ఆఫీసులో సీనియర్ క్లార్క్ ఆఫీసరుకి సూర్యనారాయణ అంటే ఎందుకో అభిమానం

ఆ అభిమానం వెనుక ఏదో మూల 'సింపతీ' లాంటిది ఉందని సూర్యనారాయణకి కోపం,

ఇటీవల అతనింటికి వెళ్లినప్పుడు ఈర్ష్య లాంటిది కూడా 'భగ్' మంది

సూర్యనారాయణలాంటి వాళ్ళు ఆఫీసర్ మీద జాలిపడాలి ఆఫీసర్‌కంటే ఒకటో అరో ఎక్కువ క్వాలిఫికేషనేవుంది సూర్యనారాయణకున్న ఉంగరాల నొక్కులజుత్తు ఆఫీసర్‌కి లేదు ఆఫీసర్ కాల్చే సిగరెట్ కంటే సూర్నారాయణది కాస్ట్లీ బ్రాండ్. సూర్యనారాయణ రాసిన వ్యాసాలు ఆంగ్లదినపత్రికల్లోనూ, కథలు తెలుగు వారపత్రికల్లోనూ ప్రచురితమయ్యాయి

రెండు మూడేళ్ళుపోతే సూర్నారాయణ ఆఫీసర్ సీట్లో కూర్చుని, స్టెనోకి డిక్టేషన్ ఇవ్వగలడు

కాని ఆఫీసర్‌కి సూర్యనారాయణ అంటే అభిమానం అభిమానం చూపించే ఆఫీసరంటే సూర్నారాయణకి కోపం ఆఫీసు గుమ్మంనించి సీట్లోకి వెళ్లి కూచునేసరికి యోజనాలు నడిచాడు సూర్యనారాయణ.

నాగరత్నం కనిపించగానే రాత్రి కల గుర్తుకొచ్చింది సీట్లోకి పోయాక నాగరత్నాన్ని చూడాలనిపించింది

నాగరత్నాన్ని ఒక్కసారి చూస్తే రెండోసారి చూడాలనిపించదు వయసు తెచ్చిన వొంపులు తప్పించి, స్త్రీత్వం ప్రసాదించిన సౌష్ఠమార్యం చాలా తక్కువ.

నాగరత్నం తలంటుకుని ఎర్రగులాబీ జడలో పెట్టుకుంది.

ఆమె పట్టుకున్న తెల్లటి కాయితంలో ఆమె ఒంటి నలుపుని వేలితోగిచ్చి అద్దితే వేలిముద్ర స్పష్టంగా అపుపిస్తుంది.

ఒక్క పన్నుకూడా వరుసలో ఉన్నట్టు అనిపించదు. చిన్ననుదుటిని, దట్టమైన కనుబొమ్మలు వికారంగా ఆవరించాయి.

ఆమెను మొదటిసారిగా చూసినట్లని పించింది సూర్యనారాయణకి.

ఒళ్ళంతా చెమటపట్టింది. రాస్తోంటే చెయ్యిఒణికింది కాయితాల్లో ఏడుస్తోన్న నాగరత్నం అతని చేతినిపట్టి లాగుతోంది.

అతనికాళ్ళకేసి చూసి విరగబడి నవ్వు తోంది...

నాగరత్నం నిజంగానే నవ్వుతోంది.

మందపాటి పెదవులతో చిరు మంద హాసం ఒలికిస్తోంది.

ఎందుకా నవ్వు?

ఏం చూసుకుని ఆ సుందరాంగికి ఆ నవ్వు?

'మిస్ నాగరత్నం!' సూర్యనారాయణ పిల్చాడు.

'నాబొంద ఇది మిసెస్ అయ్యేదెప్పుడు?' అని మనస్సులో అనుకున్నాడు.

పిలుపుకి నివ్వెరపోయింది నాగరత్నం. నింపాదిగా నడుచుకొచ్చింది.

హిందీ సినిమాల్లో హీరోలా ఉండే సూర్నారాయణమొహం వాడిపోయింది.

'దీనికి చెప్పేయాలి' అనుకున్నాడు సూర్నారాయణ.

'ఆ అందమైన గులాబీ తల్లోంచి తీసి పారేయ్' అని అందామను కున్నాడు.

అతడు వెలుగునూ, చీకటినీ పక్క పక్కన చూడలేడు.

చంద్రుడి అందాన్ని చిన్నపుచ్చేమచ్చని భరించలేడు.

సౌందర్యానికి హద్దులు ఏర్పరచటం, తాజుమహల్ ముందు దిష్టిబొమ్మ నుంచ టం ఇష్టంలేదు.

జీవిత నందనవనంలో అన్నీ పారిజాతాలే కావాలి.

రెక్కలు విప్పుకున్న కోరికలు అనంతా కాశంలో అలిసిపోకుండా విహరించాలి.

తన కిష్టమైంది ఎర్రని గులాబీ పుష్పం.

# ఎర్ర గులాబి

ఆ గులాబీని తల్లో పెట్టుకునేందుకు కొన్ని అర్హతలు కావాలి.

ఆ పరిమళం గుబాళింపు గుండెల్లో నింపుకునే జాతకం ఉండాలి.

అందుకే.

'ఆ అందమైన గులాబీ తల్లోంచి తీసి పారేయ్' అందామనుకున్నాడు.

నాగరత్నం వచ్చి 'ఎందుకో' ప్రశ్నించ కుండానే నిల్చుంది.

'ఇంత అందమైన పువ్వు నీకు బాగా లేదు అంటే,

'ఇంత అందమైన మొహం మీ కనవ సరం' అని తప్పకుండా అంటుంది.

పాపం ఆ అమ్మాయి వొచ్చి చాలా సేపయింది.

అందరూ ఆశ్చర్యంగా తనని చూస్తు న్నారు. ఏదోచెప్పి పంపించెయ్యాలి అను కున్నాడు సూర్నారాయణ.

## ఎవరి కోసం?

ఉదయించే సూర్యదేవుని<br>
కిరణం భువి సాగెను,<br>
ఊగాడే అంతరంగం<br>
ఇటునటు పడసాగెను,<br>
ఎచట ఆగునో!<br>
ఎటుల పోవునో!

చిగురులలో పూవులున్నవి,<br>
చింతనలో ఆశలున్నవి,<br>
విధివనం పిచేవరకు<br>
వేచియుంటె మార్గమ్మున,<br>
ఎపుడు పూయునో!<br>
ఎచట నవ్వునో!

తెలియని లోకాల నెంచి<br>
తెలిసి శాంతి పొందుగూడి,<br>
తెలిపొందుబె ఆశయం,<br>
తెలినవ్వుల ఆలయం,<br>
పయనించే దెక్కడికో!<br>
కనుపించే దెన్నటికో!

తీరమ్మును కౌగిలింప<br>
తేలివచ్చు చిన్నియలలు,<br>
లోకమ్మును వృష్టింపగ<br>
లోలోపల మురియు మొగ్గ,<br>
చేరుట యవి ఎప్పుడో!<br>
విరియుట యది యెన్నడో!

—అకొండ గౌరీదేవి

'చూడండీ! ఇంకో రెండుకాపీలు టైపు చేసి తీసుకురండి'

చేతికిదొరికిన మేటర్ని ఇచ్చి పంపే శాడు.

ఆమెను పంపెయ్యగానే ప్యూన్ రంగయ్య రెండుకవర్లు తెచ్చి ఇచ్చాడు.

తండ్రిరాసిన ఉత్తరంలో ఏముంటుందో చదవకుండానే తెలుసు. అతనికి అలవాటు ఉత్తరాన్ని చదివించింది.

చినబాబూ,

ఎందుకు మమ్మల్నిలా దూరంగా ఉంచి బాధ పెడతావ్? ఈ ఇంటికీ మాకళ్ళకీ దీపం నువ్వొకడవే! ఇటీవల ఒక సంబంధం వొచ్చింది. నిగురించిరాసి, ఫోటో పంపేను. అమ్మాయి నిన్ను చూసి మురిసిపోతోందట. వెంటనే రా!

ఉత్తరం చదివిన సూర్నారాయణ మొహంలో ఒక్కక్షణం నవ్వు వెలిగింది.

రెండో వుత్తరంతో వసుంధర రెండే ముక్కలు రాసింది.

బావా,

నా పెళ్ళయ్యాక, వసుంధర బతికుందో లేదోకూడా నీకు గుర్తులేదు. శనివారం మెయిల్లో ఆయనతో బొంబాయి వెళ్తు న్నాను. స్టేషన్లో నిన్ను రెండుక్షణాలు చూసినా చూసినట్టుంటుందని నా ఆశ—

నా పిచ్చిగాని నువ్వెందుకు వొస్తావు?

ఆత్మీయత పెనుగులాట్టం మూలాన ఈ ఉత్తరం—

ఉంటాను.

వసూ.

ఉత్తరం చదివేక సూర్నారాయణ కళ్ళల్లో వసుంధర కదలాడింది. కాస్త వొళ్ళుచేసివుంటుందేమో అనుకున్నాడు.

గులాబీలాంటి సౌందర్యం వసుంధరది. ఎర్రని ఛాయతో కలువరేకుల్లాంటి కళ్ళతో కట్టిపడేసే అందం ఆమెది.

వెతికి వెతికి మొగలి పువ్వులాంటి మొగుణ్ణి తీసుకొచ్చేడు.

'అతడు ఎంత జోరుగా బంతి విసర గలడో, అంత జోరుగా పరిగెత్తగలడు. ఇంటర్ యూనివర్సిటీ మాచ్లో స్కిప్పర్గా రిప్రెజెంట్ చేశాడు...'

తను గాలించి తెచ్చిన క్వాలిఫికేషన్సు ఏ కరువుపెడుతోంటే వసుంధర ఒక్క మాట మాట్లాడలేదు

సూర్యనారాయణ ఆమె మొహంకేసి చూశాడు

ఆమె కళ్లల్లో కన్నీళ్లు తిరుగుతున్నాయ్

'నీకు తెలీదు వసూ! నీకు క్రికెట్ మాచెస్ అంటే ఇష్టం అందుకని ....' సూర్యనారాయణ గొంతుకలోంచి మాట పెగల్లేదు

సూర్యనారాయణ కళ్ళల్లోకి చూసి అతని చేతుల్లో మొహం దాచుకొని వసుంధర గట్టిగా ఏడ్చేసింది

పెళ్లి తంతు అంతా తనే దగ్గరుండి జరిపించాడు సూర్యనారాయణ

ఎర్రగులాబీలు రెండు బుట్టలనిండా తెప్పించాడు ఎలక్ట్రిక్ దీపాల్తో అలంకరించిన పల్లకీలాంటి రథంలో 'గులాబీ రాకుమారి' ఊరేగినప్పుడు 'సంపంగి మొగుడు' చిరనవ్వు నవ్వినప్పుడు పక్కగా నడుస్తున్న సూర్యనారాయణ మాటులో కనిపించనంతగా కుంచించుకుపోయాడు

ప్రపంచమంతా కళ్ళు చేసుకుని తననే చూస్తున్నట్టుగా అనిపించి అసలు నడవలేకపోయాడు.

ఆ సంరంభంలో తను వెనగ్గా అడుగులేసి నడుస్తున్నప్పుడు గుండెల్లో దేవినట్టనిపించింది' అవమానంతో తలకొట్టేసినట్టయి రాత్రికిరాత్రే బయల్దేరి వచ్చేసి లీవ్ కాన్సిల్ చేసుకున్నాడు

గతమంతా కళ్ళకి కట్టినట్లుంది సూర్యనారాయణకి భవిష్యత్ అంతా అంధకారంగా కనుపిస్తోంది

ఫైళ్ళు వొస్తున్నాయ్ విలా డిస్పోజు ఆఫ్ చేస్తున్నాడో అతనికే తెలీదు జూనియర్స్ ఏవో అడుగుతున్నారు మెకానికల్‌గా జవాబుచెప్పి పంపించేస్తున్నాడు

డైరీ తెరిచాడు ఆవేళ తేదీలో ఏ వారమో చూశాడు రోజుకి రోజుకి తేడా తెలియకుండా చాలా రోజులయింది యంత్రం! . మరమనిషి! ...

సూర్యనారాయణ కళ్ళు చిత్రంగా వెలిగాయ్

ఆవేళ శనివారం — వసుంధర అదే రోజు వస్తుంది రాత్రి మెయిలు తొమ్మిదిన్నరకి

బొంబాయిలో ఏదో మేచ్ ఉండి ఉంటుంది అతనికి వసుంధర మేచ్ చూడటానికి అతడితో వెళుతోంది.

సూర్యనారాయణ ఫైళ్ళన్నీ మూసేసి ప్యూన్ని పిలవటానికి తలఎత్తాడు నాగరత్నం అతనికేసే చూస్తోంది ఆ రోజంతా నాలుగైదుసార్లు ఏదో పని వున్నట్టుగా తన వేపే చూడటం సూర్యనారాయణ గమనించాడు. రాత్రి కలలోని నాగరత్నంలా చిందరవందరగా జుత్తు నుదుటిమీద పడుతోంది.

ఎందుకలా చూస్తోంది?

మనసులో ఏం దాచుకుంది?

ఏడవరే! కలలోకివొచ్చిన ఊర్వసి కన్నేస్తోందిలా వుంది

ఆమె చూస్తోంటే తేళ్ళూ జెర్రులూ పాకుతోంది సూర్యనారాయణకి ఇతని చిరాకును గమనించినట్టుగా ఆమె మొహం తిప్పేసుకుంది

'అయ్యగారు పిలుస్తున్నారు'

ప్యూన్ రంగయ్య కబురు.

ఆఫీసర్ గారి హుకూం!

'చూడండీ! మీరు ఎక్సెస్‌పేమెంట్ టూథవజండ్ చేసేశారు హెడ్‌ఆఫీసుకి వెళ్ళిఉంటే వార్నింగ్ వొచ్చేది .'

ఆఫీసర్ ఎంతో ఆప్యాయంగా తప్పును విప్పి చెబుతున్నాడు ఎక్స్‌ప్లనేషన్ ఇవ్వమని ఎందుకడగడూ?

సూర్యనారాయణ మొహం ఎర్రనైంది పిడికిలి బిగుసుకుంది

'మీకు ఒంట్లో బాగులేదులా వుంది పర్మిషన్ తీసుకోలేక పోయారా?'

ఇంక అక్కడ నిలబడకుండా, మాట్లాడకుండా అతని చేతిలోని కాయితాన్ని తీసుకొచ్చి సీట్లోకివొచ్చి కూచున్నాడు సూర్యనారాయణ.

నాగరత్నం నిలబడివుంది.

'ఏంకావాలి?' చాలా విసురుగా అడిగేడు.

'ఇవాళ నా బర్త్‌డే అండీ! అదీకాకుండా ఇంకో అకేషన్ కలిసింది. మీరు తప్పకుండా 'టీ'కి మా ఇంటికి రావాలి.'

నాగమదేవికి జోడీ ఎవరూ దొరకలేదులా వుంది సూర్యనారాయణ జవాబు చెప్పేలోగానే గ్రహించినట్టుగా అంది

'ఎంతోసేపు ఉండనక్కరలేదు మీ కిష్టం లేకపోతే వొచ్చిన వెంటనే వెళ్ళిపోవచ్చు మెయిన్‌రోడ్ 'జంక్షన్ దాటి రెండో టర్నింగ్‌లో మొదటి ఇల్లేమాది.

ఆరున్నరకి తీసుకురండి వొస్తారు.'

పోర్షన్ అప్పచెప్పినట్టుగా గబగబా చెప్పేసి వెళ్ళిపోయింది.

సూర్నారాయణ వాచీ చూశాడు. అయిదున్నర అయింది. అందరూ అప్పుడే వెళ్ళిపోయారు. అవును మరి, వాళ్ళు తనలా వొంటరి వాళ్ళుకాదు.

ఇంటికి వెళ్ళగానే అందంగా అలంకరించుకున్న భార్యలు చిరునవ్వులు చిందిస్తూ కాఫీని అందిస్తారు.

సాయంత్రం ఏ బీచ్‌కో, సినిమాకో పోయి, ఊసులాడుకుంటూ, ఒకళ్ళ నొకళ్ళు రాసుకుంటూ, కళ్ళల్లోకి చూసుకుంటూ, ఆనందంగా గడిపేస్తారు.

వాళ్ళ జీవితంలో అపశ్రుతులు లేవు. ఏ నెలాఖరుకో ప్రియురాలు ప్రణయకోపం చూపిస్తుంది.

తనని జీవితం అడుగడుక్కీ పరిహసిస్తుంది. ఒంటరితనం అణువణువూ కాల్చేస్తోంది.

ఎంతకాలం ఈ వేదన?

ఎవరికోసం ఈ నిరీక్షణ?

నాగరత్నం తనకోసం వేచివుంది.

...రిక్షాని పిల్చాడు. హోటల్‌లో దిగి కాఫీ తాగాడు. సిగరెట్ వెలిగించుకున్నాడు.

'పాపం నాగరత్నం పూర్‌గర్ల్. ఆమెకి మాత్రం కోరికలుండవూ? ఎంత అన్‌సివిలైజ్డ్‌గా బిహేవ్ చేస్తున్నాడు ఆమె పట్ల? —తన ప్రవర్తన ఆమెలో ఎంతటి కలవరం కలిగించిందో? హృదయంలో ఎన్ని ఆశల్ని, ఆవేదనని నింపుకుందో?'

జాలితో సూర్నారాయణ మనస్సు ద్రవించుకు పోయింది పార్టీకి వెళ్ళటానికి నిర్ణయించుకున్నాడు. ప్రెజెంటేషన్‌కి ఖరీదయిన పెన్నొకటి కొన్నాడు

రిక్షా దిగిన సూర్నారాయణకి ఎదురెళ్ళి ఆహ్వానించింది నాగరత్నం.

లోపలికి అడుగెడుతోంటే 'ఓకో ప్లెజెంట్ సర్‌ప్రయిజు' అంది.

లోపల రామ్మూర్తి కూర్చున్నాడు. పంజాబీ లాల్చీ, షరాయి వేసుకుని జంబుకానామీద కూచుని, హార్మోని శృతి చూస్తున్నాడు.

కాలేజీ రోజుల్లో అమ్మాయిల కళ్ళన్నీ రామ్మూర్తి మీదే ఉండేవి. రామ్మూర్తి కళ్ళల్లో వడ్డు జడ్జిగారి అమ్మాయికి

# ఎర్రగులాబి

నాల్రోజులకొకసారి హిష్టీరియా వొచ్చేది. హీరో వేషానికి కాల్పవొచ్చిన రామ్మూర్తి ఐదు సంవత్సరాల తర్వాత అదే కనుపించటం.

'సూరీ! మూడుపదులు నిండకుండానే అన్ని అనుభవాలూ అయిపోయినయ్‌రా' అన్నాడు.

సూర్నారాయణ మాట్లాడకుండా రామ్మూర్తికీ నాగరత్నానికీ ఉన్న సంబంధం ఆలోచిస్తున్నాడు

'సినిమాకిపోయి, డ్రామా కంపెనీలో చేరేను. కార్లలో తిరిగాను. క్లబ్బులో దూరేను. ఆగ్రా, ఎల్లోరా, కోణార్క్ చూశాను...'

రామ్మూర్తి చెబుతున్న సంగతులేవీ చెవికెక్కటం లేదు సూర్నారాయణకి.

జీవితాన్ని కాచి వడబోసి తెలుసుకున్న అనుభవం మాత్రం విశాలమైన నుదురు పైన ప్రతిఫలించి రామ్మూర్తి ఒక కొత్త మనిషిగా కనిపిస్తున్నాడు.

నాగరత్నం నలుపుకి మాచ్ అయ్యేలా తెల్లటి చీరను తెల్లటి రవికనూ కట్టుకుంది. జడలో గులాబీ లేదు. మల్లెలమాల వేలాడుతోంది.

'ఇంత పొగరుగా, నిరసనగా నాగరత్నాన్ని వొదిలేసి వెళ్ళిపోయినా ఆశతో నాకోసం ఎదురుచూస్తూనే వుంది. నాగరత్నం ఎవరో అనుకోగలవ్. స్వయానా మేనత్త కూతురు... నాగరత్నం అందరికీ అందంగా కనిపించక పోవచ్చు... ఈ కోకిలకి లతలా పాడటం వొచ్చు తెలుసా?...నాగరత్నంది నీమల్లే మల్లె పూవులాంటి హృదయం... బంగారు కొండని వొదిలేసి ఇన్నాళ్ళూ రాళ్ళనీ రప్పల్నీ ఏరుకుంటూ కూచున్నాను. డబ్బుతో, అందంతో కొనుక్కునే వస్తువులు వేరు హృదయంతో కొనగలిగిన వస్తువులు జీవితంలో వేరు. నాగురించి నిజంగా బాధపడగలిగే మనస్సు కావాలి నా సుఖ సంతోషాలకోసం అనునిత్యం తపించే సమ భాగిని కంటే అందమైన వస్తువు ఈ ప్రపంచంలో ఎక్కడుంది చూపించు?...' రామ్మూర్తి ఉత్సాహంగా చెప్పుకుపోతున్నాడు.

'నాగరత్నంకి భగవంతుడు అందం ఇవ్వకపోవొచ్చు: కోకిలలాంటి కంఠస్వరం ఇచ్చాడు...ఆమె అనాకారితనం గుర్తుకు తెచ్చుకుని బాధపడుతూ పాడటం కూడా మానేసింది. భగవంతుడు మనిషికి అన్నీ వరాలూ ప్రసాదించి వొదిలిపెడితే మానవుడు పరిపూర్ణుడు కాలేడు. లేనిదానికోసం విచారిస్తూ కూచుంటే చాలా విలువైన జీవితం మోడువారిపోతుంది. ఈ ప్రపంచం మనకోసం ఆగదు ప్రకృతి సృష్టిలో గులాబీతోపాటు గడ్డి పువ్వులు కూడా ఉన్నాయి. దేని అందం దానికుంది. దేని ప్రత్యేకత దానికుంది. ముళ్ళపొదల్ని, లతానికుంజాల్ని ఒరుసుకు ప్రవహించే నదీ జలంలా జీవితం ఉరకలు వేసుకుంటూ పోయి చైతన్య సాగరంలో అంతమవ్వాలి...'

రామ్మూర్తి వాక్ప్రవాహం అంతం లేకుండా పోతోంది.

సూర్నారాయణకి అంతరాంతరాల్లోంచి పశ్చాత్తాపం లాంటిది కెరటంలా లేచింది.

పెళ్ళికి ముందురోజు వసుంధర మాటలు అతనికి గుర్తుకొస్తున్నాయ్.

'నీకింతటి భావుకత్వం తగదు బావా! నేను సుఖపడతానని అపోహపడి గుండెల్లో కార్చిచ్చును రగుల్చుకుంటున్నావ్. నువ్వు.. నువ్వు ఎంత మంచివాడివో అంత కసాయి వాడివి...'

'గులాబీ, నీకు తెలీదు...నేను దుర్బల హృదయుణ్ణి... శాపగ్రస్తుణ్ణి... దేవతలు, నాలాంటి మామూలు మనుష్యులతోపాటు ఏడవకూడదు. తప్పు...'

వసుంధర సూర్నారాయణ మనస్సులోని మాటలు చదవలేదు. తునాతునకలయిపోయిన హృదయాన్ని తిరిగి అతికించలేదు.

రామ్మూర్తి ప్రోత్సాహంతో నాగరత్నం త్యాగయ్య పాటను పాడింది. నాగరత్నం కంఠంలో దాగిన మూగబాధ తేనెవాకగా మారి మృదుమధురంగా వినిపించింది.

సూర్నారాయణ ఇక వెళ్ళటానికన్నట్టుగా లేచాడు.

'నువ్వే మా పెళ్ళిపెద్దవి. వొచ్చే శుక్రవారంనాడే పెళ్ళి...' హెచ్చరిస్తూ, రామ్మూర్తి సాగనంపాడు.

నాగరత్నంకేసి క్షమించమని వేడుకుంటున్నట్టుగా తీసుకొచ్చిన పెన్ ప్రెజెంట్ చేశాడు సూర్నారాయణ.

వెనక్కి తిరగబోతూన్న సూర్నారాయణకి

కృతజ్ఞతతో చూస్తూ విలబడిపోయిన నాగ రత్నం మొహం అందంగా కనిపించింది.

తను అసహ్యంగా అల్లుకున్న కలలు, ఆలోచనలు ఈటెల్లా పొడిచాయ్. నాగ రత్నంకి ఏం తక్కువని? రామ్మూర్తి కంటే తను ఎందులో గొప్ప?

సూర్నారాయణ టైమ్ చూశాడు.

మెయిల్ రావటానికి యింకా అరగంట టైముంది.

ఈలోగా మార్కెట్టుకెళ్ళి పువ్వులు కొనుక్కొని వెళ్ళొచ్చు...రకరకాల పువ్వులు గులాబీలు, సంపెంగలూ, మల్లెలు, విర జాజులూ—

వాడిపోయిన దవనంకూడా పూలమాలలో చోటు చేసుకుంది.

ఏంచి, ఎర్రని పెద్ద గులాబీని కొన్నాడు. రిక్షానిపిల్చి స్టేషన్‌కి పోనీమన్నాడు...

మెయిల్ రాక్షసిలా నిప్పును చిమ్ముతూ ప్లాట్‌ఫారం కేసి ఆగింది.

సెకండ్‌క్లాస్ కంపార్ట్‌మెంట్ లోంచి వసుంధర ఆత్రుతగా గేటుదగ్గర నిలబడి సూర్నారాయణని గాలిస్తోంది.

వసుంధర మొగుడు గబగబా సూట్ కేస్ తెరిచి రెండు పెగ్గులు రమ్‌బాటిల్ లోంచి గొంతులో వేసుకున్నాడు.

వసుంధర కనుమరుగు ఐనప్పుడల్లా రెండు చుక్కలు వేసుకుంటూనే ఉన్నాడు. వొద్దని వ రించినప్పుడల్లా బుగ్గలు కందేలా రెండు దెబ్బలు వేస్తూనే వున్నాడు.

వసుంధర తనతో వొస్తానని పీడించక పోతే స్నేహితులో టాక్సీలోపోయి, అడ్డూ అవూ లేకుండా 'తాజ' లో ఏ సొగసుకత్తె ప్రక్కనో కూచుని 'స్కాచ్'ని సేవించేవాడు.

అనవసరంగా ఈ పెళ్ళాం లంపటం తగి లించుకుని తన సుఖాల్ని, సరదాల్ని చంపు కున్నాడు.

తొమ్మిది అవున్సులకి పైగా వేసుకున్న మందు గట్టి కిక్ ఇచ్చింది. కణతలు బద్దలయి, కడుపులో తిప్పేసింది.

భళ్ళున వాంతి చేసుకుని కుప్పలా పడి పోయాడు. సీసా విరిగి పెద్ద చప్పుడు చేసింది.

భర్త పడిపోవటం చూసిన వసుంధర కంపార్ట్‌మెంట్ ద్వారం దగ్గర్నించి వెనక్కి వొచ్చేసింది...

గబగబా [illegible]

[illegible]

కంపార్ట్‌మెంటులో వెతికేస్తున్నాడు.

చూపరులకి ఆ వడక వినోదంగాఉంది... సూర్నారాయణ ఎవర్నీ లక్ష్యపెట్టటంలేదు.

ఎదురొచ్చేవాళ్ళని పక్కకి తోసేసి దారి చేసుకుంటూ వెడుతున్నాడు.

చెమటతో వొళ్ళంతా తడిసిపోతోంది. అయినా చేతిలోని పువ్వును నలగనివ్వలేదు.

పెట్టెలు, బుట్టలు తగిలి కండ పూడొచ్చేట్టు గీసుకుపోయినా నొప్పి తెలీటం లేదు.

ఒకటే లక్ష్యం...ఒకటే ఏకాగ్రత.

అంతవరకూ నొక్కి పెట్టి వుంచిన మమకారం తుఫానులా విజృంభిస్తోంది.

ఆపేక్ష గుండెలను పెళ్ళగించివేస్తోంది. వసుంధరని ఒక్కసారి చూస్తే చాలు.

మూడు లోకాలు ఒంటికాలిమీద ప్రద క్షిణం చేసెయ్యగలడు.

జీవితంతో రాజీపడ్డాను వసుంధరా అని చెప్పాలి. రామ్మూర్తి తన కళ్ళను తెరిపించిన వృత్తాంతం ఆమెకి వినిపించాలి.

పిచ్చిపిల్ల పాపం! ఎంత బాధపడుతూ వుత్తరం రాసిందని!

కాని కాని వసుంధర ఎక్కడా కని పించదే? కంపార్ట్‌మెంట్ అంతకంతకూ పొడుగైపోతోంది.

గార్డు విజిల్‌వేశాడు. జెండా ఊగింది. సూర్నారాయణకి గుండెల్లో సీరనం చోటు చేసుకుంది. ట్రెయిన్ కదిలింది.

సూర్నారాయణ 'వసుంధరా' అని కేకే శాడు. ట్రెయిన్‌కూత ఆ పిలుపుని మింగే సింది.

సూర్నారాయణ జీవితంలో మొదటి సారిగా పరిగెత్తాడు.

ట్రయిన్ వేగాన్ని పుంజుకుంది.

వొంకరకాలు సూర్నారాయణను రైలుతో పరిగెత్తించ లేదు.

చేతిలోని పువ్వుని బలంగా రైల్లోకి విసిరాడు. కిటికీలోంచి దూసుకుపోయిన పువ్వు కంపార్ట్‌మెంట్‌లో పడింది.

రైలు వొయ్యారాలు పోయి వొంపు తిరిగే దాకా సూర్నారాయణ చూస్తూనే ఉన్నాడు.

వసుంధరతోపాటు పువ్వుకూడా వెంట వెడుతోంది.

కనీసం ఆమెని చూడలేకపోయినా తన మమకారం పువ్వుగా ఆమె వెంటనంటే ఉంది.

తన వొంకర కాలుకేసి చూశాడు సూర్నారాయణ. అది ఇక వికారంగా కని పించటం మానేసింది.

రాజీ!

జీవితం రాజీ పడటంలోనే ఉంది.

వసుంధరను తను మళ్ళీ చూస్తాడు.

జంటగా వెళ్ళి ఆమెకు గులబీమాలను బహూకరిస్తాడు. నిరంతర జీవనవాహిని మలుపులు తిరుగుతూ వెళుతోంది. అనుభ వాలను జీర్ణించుకుని సొగసులు దిద్దు కుంటోంది.

ట్రెయిన్‌లో వసుంధర సూర్నారాయణని గురించే ఆలోచిస్తోంది.

'వసుంధరాజీ!' అంటున్న మొగుడు తాగనని ప్రమాణం చేస్తున్నాడు మత్తులో.

వసుంధర కన్నీళ్ళు ఒత్తుకుంది. ●



సీరియల్

# గూడు చేరిన పక్షులు





యర్రం చంద్రశేఖరం

### జరిగిన కథ

లక్షాధికారి గారాల ముద్దుబిడ్డ శశిరేఖ. తండ్రి ఆదరంతో తనతోపాటే మెడిసిన్ చదువుతున్న ప్రసాదును ప్రేమిస్తుంది. యుద్ధరంగంలో సైనికుల చికిత్సకోసం ప్రసాదు వెళ్ళాడు. విరహంతో తల్లడిల్లుతున్న శశిరేఖను స్నేహితురాలు వాణి అనునయిస్తుంది. వాణికి శశిరేఖ రహస్యమంతా తెలుసు. అందుకే ఆమెని ఎగతాళి పట్టించింది. రేఖ గురించి ఆలోచించుకుంటూంటే ఆమె పెళ్ళిచూపుల తతంగం జ్ఞాపకం వచ్చింది. తలుచుకుని బాధపడ్డాడు ప్రసాద్. రేఖతో తన పెళ్ళి నిశ్చయమై పోయిందని తలచుకుని మురిసిపోయాడు. సూర్యం ప్రసాద్ తమ్ముడే. అతను జబ్బుతో తీసుకుంటూ ఆ హాస్పిటల్‌లో జాయినయాడు.

## 7

ఇప్పుడు టైమెంత అయిఉంటుందో...? ఆస్పత్రి వదిలాను. తెగిన గాలిపటంలా తిరుగుతున్నాను...గమ్యంలేదు... ఆస్పత్రిలో ఉండగా వేళకింత తినడానికి దొరుకుతూ ఉండేది... ఇప్పుడదీ లేదు... రెండురోజులు ఏమీ తిననందున కళ్ళు తిరుగుతున్నాయి... చివరకు నేను ఏమైపోతానో ... ఏమో ? ఏమిటీజనం...? ఇంత రద్దీగా ఉందేం...? బహుశా సినిమా వదిలినట్లున్నారు. నెట్టివేస్తున్నారు...అయ్యో ... కాళ్ళు తడబడుతున్నాయి. ఆఁ ... ఎదురుగా కారువస్తూ ఉంది...! పక్కగా వెళ్ళాలి...పడిపోయాను... ఏమీ తెలియడంలేదు ... తలకు దెబ్బ తగిలినట్లుగా ఉంది...తడిమి చూసుకున్నాను... తడి... జిగట... రక్తం కారుతూ ఉంది. భయంతో వణికిపోయాను. కళ్ళుమూతలు పడ్డాయి. అంతే! ఆ తర్వాత ఏం జరిగిందో నాకు తెలియదు.

స్పృహవచ్చేసరికి ఒక ఆస్పత్రిలో ఉన్నాను ... ఆశ్చర్యం కలిగింది నాకు. ఆస్పత్రి వదిలి వెళ్ళిన నేను మళ్ళీ ఆస్పత్రికి చేరడం ... కాని యిది ఒదిలి వెళ్ళిన ఆస్పత్రికాదు...మరొకటి! జరిగిన సంగతులన్నీ క్రమంగా స్ఫురణకు రాసాగాయి ... అవును. గాయపడి రోడ్డుమీద నిస్సహాయ స్థితిలో ఉన్న నన్ను ఎవరో మళ్ళీ ఈ ఆస్పత్రిలో చేర్చారు ... ఈసారైనా నర్సులతో ... డాక్టర్లతో పేచీ పడకూడదు. తలమీది గాయం బాగా మంటపుడుతూ ఉంది. తలకు కట్టు కట్టారు చేతికి తగిలిన గాయాలకు మూడునాలుగుచోట్ల టింక్చరు అయొడిన్‌లో తడిపిన దూది అతికించారు. పాత... క్రొత్త ... మళ్ళీ హింసకు గురికాసాగాను. ప్రక్క మంచాలపై ఉన్న రోగులు మాట్లాడుకుంటున్న మాటలు నా చెవిన పడసాగయి.

'ఎవరో పాపం...!'

'మన పెద డాక్టరు బాబుగారి కారు వెడుతూ ఉండగా కళ్ళు తిరిగి దాని ముందు పడిపోయాడట!'

'ఆస్పత్రికి తీసుకువచ్చి చాలా రాత్రి వరకు అవస్థ పడ్డారు డాక్టరమ్మగారు, పెద్ద డాక్టరుగారు.'

'వేషం చూస్తే బికారి...ముఖవర్చస్సు చూస్తే మాత్రం మంచి కుటుంబానికి చెందినవాడిలా కనుపిస్తున్నాడు—'

'ఎంతైనా మన డాక్టరుబాబుగారు ధర్మప్రభువులు...ఆ గుణంలో వారమ్మాయిగారు వారిని మించిపోయారు.'

'ఇటువంటి వారినెందరినో ఒక దరికి చేర్చారు.'

నాగురించి మాట్లాడుకుంటున్నారన్న సంగతి వెంటనే అర్థమైంది ... ఇప్పుడు నేనున్నది ప్రైవేటు నర్సింగ్‌హోం అని తెలుసుకున్నాను. పైగా డాక్టగారు ... వారమ్మాయి యిద్దరూ మంచివారనే విషయాన్ని వీరి మాటలు రుజువు పరుస్తున్నాయి...వారిని ప్రబతిమాలుకొని ఎలాగైనా నా జబ్బు పూర్తిగా నయమయ్యేంత వరకు యిక్కడే గడపాలి.

'ఇప్పుడు మీకెలా ఉంది...?'

నా ఆలోచలనకు అంతరాయం కలిగింది. నా చూపులు ఆ మాటల ననుసరించాయి. తెల్లటి దుస్తులలో చిరునవ్వు చిందిస్తూ కనుపించిందొక నర్సు. వయసు సుమారుగా యిరవై దాటే ఉంటుంది ... ముఖంలో ఆప్యాయత ... ఆదరణ ... ప్రసన్నత కనుపిస్తున్నాయి.

'గాయం చాలా బాధ పెడుతూ ఉంది...

డాక్టరుగారెప్పుడొస్తారు?'

'టైమైంది...పది లేక పదిహేను నిముషాలలో రావచ్చు' సమాధానం చెప్పిందా నర్సు.

'ఉమా...! ఎక్కడున్నావ్? ఏం చేస్తున్నావ్?' హడావుడిగా నా గది లోపలికి ప్రవేశించింది; మరొక నర్సు.

'ఉమా...! అమ్మాయిగారొచ్చారు... నీవెళ్ళు యిక్కడి పని నే చూసుకుంటాను.'

నాబెడ్‌కు ఒక ప్రక్క తగిలించి ఉన్న చార్టును చేతిలోకి తీసుకొని నావైపు చూస్తూ ప్రశ్నలు ప్రారంభించింది.

'మీపేరు?'

'...........'

'మిమ్మల్నే...'

ఏం చెప్పాలో అర్ధంకాదు ... గత జీవితంలో నన్ను మార్యం— హరి అని పిలిచేవాళ్ళు. ఆపేరు చెప్పడం నాకు యిష్టం లేక పోయింది. ఆ పిలుపు నాకే అనహ్యాన్ని కలిగిస్తూ ఉంది. ఆ పేరు చెప్ప తలచుకోలేదు. పేరు చెప్పడం ఆలస్యమైనందువల్ల మరీ దగ్గరగా వచ్చింది నర్సు. నా ముఖంలోకి పరిశీలనగా చూస్తూ 'ఏమాలోచిస్తున్నారండీ...? దయచేసి మీ పేరు చెప్పండి...!' ఆశ్చర్యంతో ప్రశ్నించింది.

'నన్ను శివం అంటారు...'

'వయస్సు...?'

'ఇరవై అయిదు సంవత్సరాలు'

ఇక ప్రశ్నించకుండా ఆ చార్టును వివరాలతో నింపి యధాస్థానంలో ఉంచింది. ధర్మామీటరు నానోటిలో ఉంచి తన చేతి గడియారాన్ని చూసుకోసాగింది. ధర్మామీటరును నానోటి కందించినప్పుడు ఆమెను అతిదగ్గరగా చూశాను...నిర్ఘాంత పోయాను కళ్ళు బైర్లుకమ్మాయి ... భయంవల్ల... ఆందోళనవల్ల ముఖమంతా చెమటలు పట్టింది...ఎవరీనర్సు ? అవే పోలికలు... కాదనడానికి వీలులేదు. చివరకు తన వారికి దూరమై తన జీవితాన్ని యిలా సాగిస్తూ ఉందా ? దురదృష్టవంతుణ్ణి ... అహంభావంతో మణిని కాలదన్ని మసిబొగ్గుకు ఆశ్రయమిచ్చాను.

'రాధా...! ఇతనికెలా ఉంది ?'

'టెంపరేచరు బాగానేఉంది. నీరసంగా మూలుగుతున్నాడు. ఏదో పరధ్యానంగా కూడా ఉన్నాడు. రెండు...మూడుసార్లు ప్రశ్నించిగాని అతనిపేరు చార్టు మీద



వ్రాయలేకపోయాను.

'అమ్మా రాధా...! ఎలా ఉన్నాడు ?'

ఆ వచ్చినవారెవరో మా చాయగా ఊహించగలిగాను. వారు ఈ నర్సింగ్ హోం యజమానులు. రాధ...అవును... సందేహంలేదు. ఆమే...నా అన్యాయానికి బలియై; ఈ విధంగా అజ్ఞాతవాసం చేస్తూ ఉంది. పైగా నాకన్న ధైర్యవంతురాలు. నన్ను నిరుత్సాహం...నిస్సత్తువ ఆవహించాయి. కాని రాధ జీవితాన్ని ధైర్యంగ ఎదుర్కొంది. ఇతరులకు సేవజేస్తూ తన జీవితాన్ని సార్థకం చేసుకుంటూ ఉంది. ఆమె తల్లిదండ్రులు ఎంతగా కుమిలి పోతున్నారో...? నన్ను తమపాలిటి యమునిగా దూషించారు ..ఒక్కగా నొక్క కుమార్తెకు ద్రోహంచేశానని...నేనీస్థితికి దిగజారినప్పుడు వారి హృదయం చల్లబడి ఉండవచ్చు. గ్రామంలో మా వంశానికి మాయనిమచ్చగా తయారయ్యాను—

'త్వరగానే కోలుకోవచ్చు ... అయినా యితనికి అంతకుముందే వేరేకంప్లైంట్సు ఉన్నట్లు అనుమానంగా ఉందండీ నాన్నారూ' చార్టుమ జాగ్రత్తగా పరిశీలిస్తూ అన్నారు డాక్టరమ్మగారు.

'అవునమ్మా...చక్కగా ఊహించావు. సిఫిలిసు ఫస్టుస్టేజిలో ఉంది—జాగ్రత్తగా చూస్తే త్వరగానే కోలుకుంటాడు. ఇతడు రోగంతోటే కాకుండా మనోవ్యాధితో కూడా బాధపడుతున్నాడు. అమ్మా...రాధా! ఇతనికి మనమిచ్చే మందులకంటే మనసుకు కలిగించే ఊరట రోగాన్ని త్వరగా వయం చేస్తుంది. ఆ చార్టు యిలాయివ్వు ట్రీటుమెంటు వ్రాస్తాను...' చార్టు తీసుకొని వ్రాయడ మారంభించారు. పూర్తిచేసి రాధచేతికిస్తూ,

'రాధా...! నే చెప్పింది గుర్తుంచుకో... ఇతనికి మనఃస్థిమితంలేదు...కాస్త జాగ్రత్తగా ఉండాలి.' డాక్టరుగారు ... ఆయన కుమార్తె ఆ గదినుండి వెళ్ళిపోయారు. నాకెంతో ఆశ్చర్యం కలిగింది. ఆ ప్రభుత్వ ఆస్పత్రికి, ఈ ఆస్పత్రికి ఎంత తేడా ఉంది? అక్కడి ఆ వాతావరణం చూసిన నాకు డాక్టర్లు ... నర్సులమీద ఉండే సదభిప్రాయం దురభిప్రాయంగా మారింది. కాని మళ్ళీ నా అభిప్రాయాన్ని మార్చుకోక తప్పదు వ్యక్తి యొక్క ప్రవర్తన ఆ పరిసర ప్రాంతాల వాతావరణంమీద ఆధారపడి ఉంటుంది... కాదనలేను ... అందుకు తార్కాణం ... లోగా నేను విడిచివచ్చిన ఆస్పత్రి. మంచైనా చెడుఐనా అక్కడ కలకాలం ఉండేవారెవ్వరు? రోగాలు వయమైనా కాకున్నా వారి జీతాలు ఆగవు... బాధ్యతా రహితం... నిర్లక్ష్యం... కాని అదెలా అన్వయిస్తుందిక్కడ... ? అన్వయించదు... పేరు...ప్రతిష్ట...మంచి ... వెడూ ఎల్లకాలం కావలసిందీ ... వచ్చేదీ యిక్కడే...! ఏమైనా నాది అని చేసేపనికి ... నాకేం? అని చేసే పనికి ఎంతో తేడా ఉంటుంది. ఆ తేడాయే యిప్పటి ఈ రెండు ఆస్పత్రుల మధ్య ఉంది... ఆలోచనలు నన్ను యింకా బలహీనపరుస్తున్నాయి. ఇక ఆలోచించ కూడదనుకుంటూనే ఏదో ఒకటి ంలో చిస్తున్నాను.

రాధ వారితో వెళ్ళి మళ్ళీ తిరిగి వచ్చింది. 'డాక్టరుగారు చెప్పిన మాటలు విన్నారుగా! మీకేం భయంలేదు. పూర్తిగా ఆరోగ్యవంతులౌతారు త్వరలోనే...! మీరు ఏ ఆలోచనలూ పెంచుకోకుండా మీ ఆరోగ్య బాధ్యతలు మామీదవేసి నిశ్చింతగా ఉండండి. ఏం...? ఏమంటారు ?'

'అలాగే! మీ అందరిమాటలు నాకు జీవితంపై కొత్త ఆశలను రేకెత్తిస్తున్నాయి. ఇక నిశ్చింతగా ఉంటాను.' సాధ్యమైనంతవరకు నా గొంతు మారుస్తూ అన్నాను.

నా కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి. ఎంత ఆదరణ...? ఎంత ఆప్యాయత...? రాధ చూడకుండా కళ్ళు తుడుచుకున్నాను. ఏమిటీ విధి వైపరీత్యం ? ఈమెకు జీవితంలో విషపాత్ర నందించినవాణ్ణి నేనే! ఆమెనుండి అమృతాన్ని ఆశిస్తున్నవాడను నేనే! సిగ్గుతో నా శరీరం కుంచించుకుపోయింది. ఆమెకు విషపాత్రను అందించిన వాడను నేనే నని తెలుసుకున్నప్పుడు నన్నెంతగా అసహ్యించుకుంటుందో ...? అవును ... ఈ సందేహం నా కిప్పుడిప్పుడే కలుగుతూ ఉంది. నన్ను గుర్తుపట్టలేదు గద...? లేదు...గుర్తుపట్టే స్థితిలో లేను నేను. హమ్మయ్య ... మనసుకు కొంత శాంతి. వచ్చినప్పటినుండీ గమనిస్తూనే ఉన్నాను ... ఆ చిరునవ్వు ... ముఖంలో తేజస్సు ... నిర్మలమైన ముఖకవళికలు ... గతాన్ని జ్ఞప్తికి తెచ్చాయి ... అమృత ఘడియలు ఒక విషబిందు ప్రవేశంతో ఛిన్నాభిన్నమైపోయాయి. ఇక వోపికలేదు. గతం ఊహించలేనంత భయంకరమైనది. ఆ తలంపులతో నా మెదడుకు అలసట పెంచుకోతలచలేదు. విశ్రాంతిగా మంచం మీద వెనుకకు వాలాను. కొంత ప్రశాంతత ... జీవితంమీది ఆశ ... ఆ ఆశ నా రోగాన్ని కొన్ని క్షణాలు అణిచిపెట్ట గలిగింది.

ఒకవారం రోజులు గడిచాయి. నా జబ్బు యొక్క ఉద్రేక పరిస్థితి చాలవరకు తగ్గింది. ఇప్పుడు నరాలు అంతగా బాధ పెట్టడంలేదు. కళ్ళల్లో...ముఖంలో కొద్ది మార్పు వచ్చింది. ఈ విషయమే ఉమ—రాధ వీరిద్దరూ అనుకుంటూ ఉండగా విన్నాను. అద్దంలో ముఖం చూసుకున్నప్పుడు గుర్తించ గలిగాను కూడా! గడ్డం పెరుగుతూ ఉంది. అదీ ఒకందుకు మంచిదే! రాధ గుర్తుపట్టకుండా ఉంటుంది. ఆ విధంగా రెండువారాలు గడిచాయి, శరీరంలో పూర్తి ఆరోగ్యం చేకూరింది.

ఒకరోజు ఉదయం సుమారు ఎనిమిది గంటలకు నా గదిలోపలికి వచ్చింది రాధ.

'శివంగారూ! మీరు పూర్తిగా ఆరోగ్యవంతులయ్యారని మీరిక యింటికి వెళ్ళిపోవచ్చని డాక్టరుగారు మీతో చెప్పమన్నారు ... రేపు మీరు మీ యింటికి వెళ్ళిపోవచ్చు.'

'చూడండి రాధాదేవిగారూ ... డాక్టరుగారితో వంటరిగా మాట్లాడాలి ... ఎప్పుడు వీలౌతుంది?'

'ఇక్కడ వీలుపడదు...వారు వచ్చినప్పటి నుండీ వెళ్ళిపోయేంతవరకూ వారిని ఒక్క క్షణం విశ్రాంతిగా ఉండనివ్వరు రోగులు... యింటి దగ్గర మాట్లాడండి అడ్రసు చెబుతాను.'

అడ్రసును ఒకటి రెండు సార్లు జాగ్రత్తగా మనసులో మననం చేసుకున్నాను. మధ్యాహ్నం సుమారు మూడు గంటలకు వారి యింటికి బయలుదేరాను.

అప్పుడే నిద్రలేచి బాత్‌రూంకు వెళ్ళారని చెప్పాడు నౌకరు. వారు తిరిగి హాలు లోపలికి వచ్చేంతవరకు బయట గుమ్మంలో

బ్రిటానియా గ్లూకోస్

మిల్క్ బిస్కట్లు

ఎంతో రుచిగావుండే పుష్టికర ఆహారము



వారికోసం ఎదురు చూశాను. తిరిగి వచ్చి టీ త్రాగుతూ పత్రికేదో చదువుతున్నారని నౌకరు చెప్పాడు. ఒక్క పదునిముషాలు ఆగి లోపలికి వెళ్ళాను. వారు టీ త్రాగడం పూర్తి చేశారు.

ప్రశ్నార్ధకంగా నావైపు చూస్తూ నన్ను కూర్చోవలసిందిగా సంజ్ఞ చేశారు. కూర్చున్నాను. మెల్లిగా సంభాషణ ప్రారంభించాను, 'డాక్టరుగారూ...! మీ ఋణం ఎన్ని జన్మలకైనా తీర్చుకోలేను ... మీ ఔదార్యానికి హద్దులులేవు ఎవరినో అనామకుణ్ణైన నన్ను రోడ్డుపై స్పృహ తప్పి పడి ఉన్న సమయంలో, దయతో మీరు మీ ఆస్పత్రికి తీసుక వచ్చారు. శ్రద్ధగా మందులిస్తూ నాకు పూర్తి ఆరోగ్యాన్ని ప్రసాదించారు ... నేను జీవితంలో ఏకాకిని. నన్ను రేపు వెళ్ళిపోవలసిందిగా ఆదేశించారట!'

'అవును'... ఇక నీవు యింటికి వెళ్ళవచ్చు పూర్తిగా ఆరోగ్యవంతుడవయ్యావు. రెండు నెలల తర్వాత ఒక్కసారి వచ్చి చూపించుకొని వెళ్ళు'

'మీరు నాకు తండ్రితో సమానులు. మీతో కొన్ని విషయాలు మాట్లాడాలని వచ్చాను దయచేసి వినవలసిందిగా చేతులు జోడించి ప్రార్థిస్తూ ఉన్నాను. వంటరిగా ఆ విషయాలు మీతో మనవి చేసుకోవాలని ఉంది'

'అలాగా...! నా రూముకు వెడదాం పద!'

డాక్టరుగారిని అనుసరించాను. వారి గదిలో క్రింద కూర్చోబోయాను...నన్ను వారిస్తూ తమకు ఎదురుగా ఉన్న కుర్చీ చూపించారు. ఆ కుర్చీలో కూర్చొని వారి ముఖంలోకి చూసే ధైర్యం లేక నేలచూపులు చూస్తూ ఎలా ప్రారంభించాలో తెలియక తికమక పడసాగాను—

'అధైర్యపడకు...చెప్పతలచుకున్న దేదో భయపడకుండా చెప్పు'

'చెబుతాను నా హృదయభారం తగ్గించుకుంటాను...' అని ప్రారంభించాను.

* * *

మా గ్రామం యిక్కడికి పదిహేను మైళ్లుంటుంది. అవి నన్ను క్రొత్తగా బడిలో వేసినరోజులు. మా అన్నయ్య అంతకుముందే బడికి వెడుతున్నాడు. నేను అన్నయ్యతో కలిసి బడికి వెడుతూ ఉండే

# గూడుచేరిన పక్షులు

వాడిని. అన్నయ్య నన్ను ఎంతో ప్రేమతో చూసేవాడు నన్ను ఒక్కక్షణం కూడా వదిలిపెట్టి ఉండేవాడు కాదు. ఆవిధంగా రెండు సంవత్సరాలు గడిచాయి. అన్నయ్య నాకన్న ఐదారు సంవత్సరాలు పెద్ద. అమ్మ మాత్రం అన్నయ్యను ఎప్పుడూ ద్వేషిస్తూ ఉండేది. అమ్మ ఎంత ద్వేషిస్తూ ఉన్నా అన్నయ్యమాత్రం నన్ను అమ్మను ఎంతో ప్రేమతో చూసేవాడు అన్నయ్యను అమ్మ ఎందుకు ద్వేషంతో చూసేదో ఆ తర్వాత తెలిసింది నాకు; అన్నయ్య అమ్మకు సవితికొడుకని. నేను అన్నయ్య కలిసి తిరగడం, ఒకే కంచంలో తినడం, ఒకదగ్గరే పడుకోవడం, ఒకే దగ్గర కూర్చుని చదువుకోవడం యివన్నీ సహించేది కాదు. మెల్లిగా మా యిద్దరి మధ్య ఏవేవో కలహాలు రేపుతూ విడ తీయడానికి ప్రయత్నించేది. కాని ఆమె ప్రయత్నం చాలాకాలంవరకు కొనసాగలేదు మమ్మల్ని విడతీసేందుకు చేసిన అమ్మ ప్రయత్నం చివరకు ఫలించింది అన్నయ్య మంచివాడు కాదని, అన్నీ దొంగబుద్ధులున్నాయనీ వాడిస్నేహం చేస్తే నీవు కూడా చెడిపోతావని ఊరికే నా చెవిలో ఊదర పెడుతూండేది. చిన్నవయసులో ఉన్న నేను చెబుతున్నది అమ్మకదా అనే భావంతో నమ్మాను. ఆవిధంగా మా యిద్దరినీ ఎంతో ప్రయత్నంమీద విడదీయగలిగింది.

ఆనాడు చిన్నవయసులో ఏర్పడిన ఆ భేదభావం నాతోపాటే పెరిగి పెద్దదై వ్రేళ్ళు నాటుకొని అన్నయ్యనుగాని, అతని స్నేహితులనుగాని ఓర్వలేని పరిస్థితికి తీసుకువచ్చింది. అమ్మ, నేను యిద్దరమూ కలసి అన్నయ్యకు యింట్లో మనశ్శాంతి లేకుండా చేసేవాళ్లం. రాను, రాను అన్నయ్య ఉనికే మాకు ఎంతో కష్టాన్ని కలిగించ నారంభించింది. ఆ విధంగా రోజులు గడిచిపోసాగాయి. అన్నయ్య మల్టీ పర్పస్ హైస్కూలులో 12 వ తరగతి పరీక్ష వ్రాశాడు. మా ఊరిలో హైస్కూలు లేక అక్కడికి దగ్గరలో ఉన్న చిన్న బస్తీకి రోజూ వెళ్లి వస్తూ ఉండేవాడు నేనుమాత్రం ఊరిలో ఉన్న బడికే వెడుతూ ఉండేవాడిని. నేను అన్నయ్యలాగా చదువులో చురుకుగా ఉండే వాణ్ణి కాదు. అందరూ అన్నయ్యని మెచ్చుకుంటూ ఉండేవాళ్ళు. నాన్నగారు కూడా...! అమ్మ, నేను అన్నయ్యను ఎంతగా ద్వేషించేవాళ్లమో అంతగా నాన్నగారు అన్నయ్యను తల్లిలేని పిల్లవాడని ప్రేమిస్తూ ఉండేవారు. నాన్నగారు అంతగా అన్నయ్యను ప్రేమతో ఆదరిస్తూ ఉండడం మాకు ఎంతో ఈర్ష్యను కలిగించేది అందుకు అమ్మ ఏవేవో కుయుక్తులుపన్ని నాన్నగారు కూడా అన్నయ్యను ద్వేషించే విధంగా చేయగలిగింది. నాచేత చిన్నచిన్ని దొంగతనాలు చేయించుతూ, ఆ దొంగతనాలను అన్నయ్యకు అంటగడుతూ అన్నయ్యకు నాన్నగారితో తిట్లు దెబ్బలు తినిపిస్తూ ఉండేది. అసలు విషయం చెప్పి యింట్లో కలతలు రేపడం యిష్టంలేక అన్నయ్య ఆ తిట్లను దెబ్బలను సహనంతో సహిస్తూ ఉండేవాడు. అన్నయ్య మంచితనాన్ని గుర్తించలేని అమ్మ అతనిని చాతకానివాడ్కింద జమ కట్టి మరింత రెచ్చిపోతూ ఎలాగైనా అన్నయ్యపీడ విరగడ చేసుకోవాలనే ఉద్దేశంతో సమయంకోసం ఎదురుచూడ సాగింది. ఒకరోజు నాన్నగారు బీరువాలో వందరూపాయల నోటొకటి ఉంచి పనిమీద ఏదోఊరు వెళ్లారు, అమ్మ ఆవిషయం పసికట్టి ఆ నోటుతీసి దాచేసింది. అన్నయ్య వాళ్ల స్నేహితులు హైదరాబాదుకు ఎక్స్‌కర్షన్‌గా వెడుతున్నారని తెలిసి, లేని ప్రేమ నటిస్తూ పదిరూపాయలు యిచ్చిపంపింది. శత్రువులను కూడా స్నేహభావంతో చూసే అన్నయ్య అమ్మమోసాన్ని గ్రహించలేక పోయాడు. ఆక్షణంలో నాకుకూడా అమ్మ దురాలోచనకు ఆశ్చర్యం కలిగింది. అన్నయ్య హైదరాబాదు వెళ్లిన మరునాడు నాన్నగారు ఊరినుండి వచ్చారు డబ్బుపోయిన విషయం గుర్తించారు. ఇల్లు ఎగిరి పోయేటట్లు కేకలువేశారు ? ఆ కోపంలో... వళ్ళుతెలియని ఆవేశంలో...నన్ను పిలిచి రెండు దెబ్బలు వేశారు. అమ్మను తిట్టడం ప్రారంభించారు. అమ్మేం తక్కువ...? రెచ్చిపోయింది. ఇద్దరూ బాగా ఘర్షణపడ్డారు. ఆ కోపంలో బయటికి వెళ్ళిపోయారు నాన్నగారు నాన్నగారు వెళ్ళిపోయిన తర్వాత అమ్మ తన ఎత్తుగడ ప్రకారం మా కుటుంబానికి పరిచితమైన వ్యక్తితో అన్నయ్య ఆవ్యక్తికి హైదరాబాదులో కనుపించినట్లు, చూప

కూడా చూడనట్లు, గుర్తించనట్లు నటించినట్లు, జల్సాగా ఖర్చుచేస్తున్నాడనీ ...యితర దుర్వ్యసనాలకు కూడా లోనయ్యాడనీ చెప్పించింది; నడివీధిలో నలుగురి ముందు ఈ విషయం విన్న నాన్నగారు నిజానిజాలు తెలుసుకోవాలనే ఆలోచన లేకుండా తొక్కతొక్కిన త్రాచులా విజృంభించారు బుసలుకొడుతూ. ఇంటికివచ్చి అమ్మను కేకలేశారు. ఎందుకు వెళ్ళనిచ్చావని? నాకు అసలు ఆ సంగతే తెలియదని అమ్మ తప్పకుంది. నాకు ఎంతో ఆశ్చర్యం కలిగింది అయినా మనసులోనే ఆ విషయాన్ని దిగ్రమింగాను. నా క్షేమంకోరి, ఆస్తినంతా నాకు కట్టబెట్టాలనే ఉద్దేశ్యంతో అమ్మ యిటువంటి కానిపనులు చేస్తున్నదని చూచాయగా గ్రహించాను నన్నుకూడా పిలిచారు. 'అన్నయ్య సంగతి నీకు తెలుసా?' అని నిప్పులు చెరుగుతున్న కళ్లతో ప్రశ్నించారు. భయంవల్ల వణికిపోయాను. నాకు ఏం చెప్పాలో తోచలేదు. నాన్నగారి వెనుక నిలబడి అమ్మ సైగచేసింది అమ్మ ఆసరాతో నాకేమీ తెలియదని చెప్పాను. అమ్మకూడా నన్ను సమర్థించింది. పసివాడు. వాడికేం తెలుసని? వీధిలో విన్నమాటలనుబట్టి నాన్నగారు విషయాన్ని అర్థం చేసుకున్నారు. అన్నయ్యే ఆ వందరూపాయలు దొంగిలించి హైదరాబాదు వెళ్ళాడని ఊహించారు వచ్చాక భరతం పడతానంటూ అన్నయ్యమీద మండిపడ్డారు. అమ్మ సంతోషపడింది. ఆమె సంతోషం నాకూ సంతోషాన్ని కలిగించింది. ఎక్స్‌కర్షను పూర్తవగానే అన్నయ్య సంతోషంతో యింటికి తిరిగివచ్చాడు. అమ్మ యిచ్చిన పది రూపాయలలోనే నాకు ఒక మంచి పెన్ను, అమ్మకు పూలు తీసుకవచ్చాడు. నేను పెన్నుచూసి సంతోషంతో గంతులు వేశాను. ఆక్షణంలో నాకు అన్నయ్యమీద వింతోజాలి, ప్రేమ కలిగాయి. అమ్మకూడా తనకు పూలు తెచ్చినందుకు కృతజ్ఞతను సంతోషాన్ని ప్రకటించింది అంతలో నాన్నగారు వచ్చారు...అన్నయ్యను చూశారు... అగ్గిబుగ్గైపోయారు, 'ఒరేయ్...ఇలారా...' అంటూ తన గదిలోపలికి తీసుకువెళ్ళారు; చిలక్కొయ్యకు ఉన్న చండ్రకోలను తీసుకొన్నారు. జరగబోయే విషయం ఊహించాను నాన్నగారు కొట్టబోతున్నది నన్నే అన్నట్లుగా భయపడ్డాను, అనుకున్నదాని కన్న ఎక్కువే జరిగింది. అన్నయ్యను చావచితకకొట్టి 'ఇక జన్మలో నాకు నీ ముఖం చూపించకు' అంటూ యింటినుండి వెళ్లగొట్టారు. అన్నయ్య మామూలుగానే మౌనం వహించాడు. అన్నయ్య మౌనం నాన్నగారి ఆగ్రహాన్ని మరీ రెచ్చగొట్టింది అనుమానాన్ని పెంచింది. ఆ పరిస్థితిలో నాన్నగారు తను ఏది చెప్పినా వినిపించుకోడనే ఉద్దేశంతో బిక్క ముఖం వేసుకొని బయటికి వెళ్లిపోయాడు నాన్నగారు అమ్మతో, నాతో అన్నయ్యను ఇంటికి రానివ్వద్దని ఖచ్చితంగా చెప్పారు. మేమిద్దరమూ తలూపాము అమ్మ ఎంతగానో ఆనందపడింది. అన్నయ్య ఆ రాత్రి పెద్దపాలేరు రామయ్య ఇంట్లో గడిపినట్లు ఆ తర్వాత తెలిసింది. మరునాడు రామయ్య నాన్నగారితో చాలాసేపు మాట్లాడాడు. రామయ్య ఎంత బతిమాలినా అన్నయ్యను యింటికి తీసుకురావడానికి ఒప్పుకోలేదు నాన్నగారు. 'రత్నంలాంటి కొడుకుని చేజేతులాదూరం చేసుకుంటున్నావు, అందుకు అనుభవిస్తావులే!' అని నిష్ఠూరపడుతూ వెళ్లిపోయాడు రామయ్య. నాన్నగారు స్వతహాగా మంచివారే! కాని అమ్మ దీక్షతో చేసిన ప్రయత్నంవల్ల అన్నయ్యపై ఎక్కడలేని ద్వేషాన్ని పెంచుకున్నారు. నాన్నగారిది అదొకరకమైన మనస్తత్వం...! ఏ విషయాన్నీ అంతగా పట్టించుకోరు. మనసుకు పట్టిందంటే వెనుక, ముందు ఆలోచించకుండా ప్రవర్తిస్తారు. అమ్మ మొదటినుండీ తీసుకున్న జాగ్రత్తవల్ల ప్లాను ఆమె అంచనాల ప్రకారం విజయవంతమైంది. అన్నయ్య నాన్న కొట్టిన దెబ్బలకు వారం రోజులు జ్వరానపడ్డాడు. అన్నయ్య యిక యింటిచాయలకుకూడా రాలేదు. ఏమాలోచించుకున్నాడో ఏమో...? పరీక్ష డిస్టింక్షన్‌లో ప్యాసయ్యాడు. పరీక్ష ఫలితాలు తెలిసిన తర్వాత వారం రోజులలో హైదరాబాదుకు వెళ్ళినట్లు తెలిసింది. ఆ సంగతి అమ్మకు ఎంతో హాయిని కలిగించింది. నేనుమాత్రం మనసులో దిగులుపడ్డాను. కాని అమ్మ కోప్పడుతుందనే భయంతో సంతోషాన్ని నటించాను. ఆరు మాసాలలో అమ్మ, నేను అన్నయ్యను పూర్తిగా మరిచిపోయాం. నాన్నగారు మాత్రం అప్పుడప్పుడు ఏదో ఆలోచనలతో బాధపడుతూ ఉండేవారు ఆ విషయాన్ని గమనించినప్పుడల్లా అమ్మనాన్నగారి మనస్సును ఉల్లాసపరిచే ప్రయత్నం చేస్తూ ఉండేది. అమ్మ ఎంతగా ప్రయత్నిస్తూ ఉన్నప్పటికీ నాన్నగారి విచారం మాత్రం ఎక్కడో కొద్దిగా వారి చర్యలవల్ల తెలుస్తూ ఉండేది. మరొక ఆరు మాసాలు గడిచిపోయాయి అన్నయ్య సంగతి మా కుటుంబంలోనే గాక మా గ్రామవాసులందరూ మరిచి పోయారు.

నాకుమాత్రం రోజులు ఎంతో ఉల్లాసంగా నడవనారంభించాయి. ఒక్కడినే కావడంవల్ల అమ్మ, నాన్న నన్ను గారాబం చేశారు. ఆ గారాబం ఫలితమే యిప్పటి నా ఈ పరిస్థితి అన్నయ్య ఉన్నంత కాలం నన్ను ఎటువంటి చెడుపనిని చేయనివ్వలేదు వద్దని వారించేవాడు, మెల్లిగా నచ్చ జెప్పేవాడు...అలిగితే బుజ్జగించేవాడు. అన్నయ్యలేడు...నన్నడ్డుకొనేవారూ ఎవ్వరూ లేక పోయారు. ఆ చిన్న వయసులో కాలుజారాను. ఆ విధంగా కాలుజారిన నేను యిప్పటికి నిలదొక్కుకోలేక పోతున్నాను.

(ఇంకా ఉంది)



శ్రీ వెంకటేశ్వరస్వామి
(టైపుచిత్రం, బి. వెంకటేశ్వర్లు)

# ఏడవనీయండి. ఒంటికి మంచిది!



కె. రామలక్ష్మి.

ఏ రోగం లేకుండా ఏ బాధా లేకుండా హాయిగా తిరిగే వో స్నేహితురాలు—'రాత్రిళ్లు నిద్రపట్టదు రామలక్ష్మీ. అంచేత యీ మాత్రలు రెగ్యులర్‌గా వాడతాను' అంటే ఆశ్చర్యపడిపోయాను. 'ఏ సమస్యలూ యిబ్బందులూ లేని నీకివెందుకు?' అంటే 'లేకుంటే నిద్ర పట్టదు. ఏదో చెప్పలేని బాధ' అంటూ వివరించింది.

'ఈ కాలంలో కొందరాడవారి కేం జబ్బో తెలుసులే — ఏడవకపోవడం!' అంటుంది—తెలుగు బాగారాని డాక్టర్ అంబుజ. 'అదేమిటి డాక్టర్, మరీ అలా అంటారేమిటీ?' అంటే 'అంతేనే. మనసులోని భావాలని బిగబట్టుకుని ఆలోచనలని అటూ యిటూ పోనివ్వకుండా గుండెల్లో గూడుకట్టుకు కూర్చుంటారు. తమ పిరికితనాలు, భయాలు, ఆశలు, కోర్కెలు ఏక్కడ తెలుస్తాయోనని భయపడిపోతూ ఉంటారు. అంతకంటే మన అమ్మమ్మల్లాగా హాయిగా వో పేచీ పెట్టుకుని, నోటి కసితీరా అరిచి, వో గంట ఏడ్చేస్తే ...యీ మాత్రలూ మందులూ అక్కర లేదు. నిజం' అంటుంది డాక్టర్.

ఏడుపులోని వైద్య గుణాలు నేను ఏప్పుడో కనిపెట్టాను. ఎవరూ చూడని వో మూల కూర్చుని మనస్సులో ఉన్న బాధలు భయాలూ అన్నీ కడుక్కుపోయేలా వో మాంచి ఏడుపు ఏడ్చేస్తే—మనస్సు తేలిక పడిపోతుంది. ప్రపంచం అంతా, చుట్టూ ఉన్న అయినవారినంతా కొత్త కళ్లతో చూస్తున్నట్టు ఉంటుంది!... ఏడుపెందుకు? మనమీద మనకే జాలివల్ల. ఎవరూ యింతకుపూర్వం యింతింత బాధలు పడలేదు కనుక ఎవరూ ఎవరినీ ఇంత యిదిగా చూసి వుండరు గనుక. ఎవరితోటీ పోల్చుకో లేనంత దురదృష్టం మన మొఖానే రాసి ఉంది కనుక. ఆహాః స్వీయ సానుభూతి మహాసముద్రంలాగా ఉప్పొంగిపోతుంది—దాల్లో హాయిగా మునిగి తేలవచ్చు.

వయస్సు ముదరనప్పుడు — ప్రపంచం అంతా (అంటే తల్లీ తండ్రీ వాళ్లూ!) మనమీద జులుమ్ చలాయిస్తున్నప్పుడు... ఒక్క ఏడుపు ఏడ్చి యిలాంటి బ్రతుకు శత్రువుకి కూడా వద్దు అని నిశ్చయించు కొంటాం. కాని యీ పరిస్థితి అనుకో నంత త్వరగానే మారిపోతుంది. మళ్లా మన ఆత్మని కన్నీటితో ప్రక్షాళితం చేసే సుఘడియ రానే వస్తుంది. కాని కొంచెం వయస్సు పెరిగింది కనుక, 'ఁహా ఏడ్చు తరవాత నాకు హాయిగా వుంటుంది' అన్నది ఏడుపు సగంలోనే జ్ఞాపకం వచ్చేస్తుంది! విషాదాన్ని గూడు కట్టించి ఉంచేకంటే ఏడ్చి దాన్ని తరిమేయడమే నయం అని తెలుసుకుంటాం. నేనెప్పుడూ మగాళ్ళని చూసి చాలా జాలి పడుతూ ఉంటాను. చిన్నతనంనుంచికూడా వాళ్ళని 'ఏడవకూడదు మగాడివి' అంటూ నూరిపోస్తారు. నిజానికి తన ఊహాపోహలను నిర్భయంగా చెప్పకల్గిన మగవాడు మనసు కరిగితే ఏడ్చేరకమే అయివుండాలంటాను; చర్చిలంతటివాడు కంట తడిపెట్టడానికి వెనకాడేవాడుకాదట! కాని చెట్టంత మగాడు ఎదురుగా నిలబడి ఏడుస్తూంటే చూసే వాళ్ళ కేంచేయాలో తెలియదు. అయితేనేం గాక? ఏడుపు ఆడదాన్ని ఎంత తేలిక పరుస్తుందో మగవాడినీ అంతగానూ తేట పరుస్తుంది.

ఏడ్చేవాళ్ళని వోదార్చే ప్రయత్నాలు చెయ్యడం వృథా. ఏడ్చి ఏడ్చి వాళ్లే ఊరు కుంటారు. అలసిపోతారు. నాకు తెలిసిన ఒకావిడ ఉన్నారు. ఒక్కగా నొక్క కొడుకూ అమెరికాలో సెటిల్ అయిపోతానని వెళ్ళ డానికి తయారయ్యాడు. విమానాశ్రయం దాకా వచ్చిగూడా ఆ తల్లి కంట తడి పెట్టలేదు. నాకు చాలా ఆశ్చర్యంవేసింది. కాని యింటికి తిరిగివచ్చాక యింకావిడ దుఃఖానికి కట్టలు తెగయి. వో అయిదారు గంటలు ఏడ్చి ఉంటుంది. తెల్లారితే కొత్త రోజు, ఆమె కొడుకుని మరిచిపోలేకపోవచ్చు కాని బాధపడుతూ కూర్చోదింక అనిపించింది ఇలాంటి దుఃఖం మనం అర్థం చేసుకోవచ్చు. కాని యింకో రకం ఏడ్చే వాళ్ళుంటారు. వారి ఏడుపు భరించడం నా తరంకాదు. కష్టపడి కళ్ళు చిట్లించుకుని నన్ను చూసి జాలిపడండి' అంటూ దుఃఖించే రకం వీళ్ళు. యింకో రకం వుంటారు. ఎవరేనా 'ఎందుకని?' అడిగే దాకా ముక్కు ఎగబీలుస్తూ కళ్ళు ఒత్తు కుంటూ ఉంటారు. అలాంటి వాళ్ళని చూస్తే బాగా జలుబుచేసినట్టుందే!' అన బుద్ధి నాకు.

అంతేకాదు మగవారిని తమ కొంగున కట్టుకొందుకు కొందరు కన్నీరు ఆయుధంగా వుపయోగిస్తారు. వీరికి కుండ నెత్తిన ఉంటుంది. 'ఎందుకు?' అని ప్రశ్న వచ్చేలోగా ఏడ్చేస్తారు. వీరిదెంత మోసమో బయటపెట్టాలే కాని భరించ కూడదు. ఆ కన్నీరు ఆయుధంగా ఉప యోగించడం మొదలుపెట్టి అలవాటై పోయి హాయిగా ఎదుటివారిని మానసికంగా బ్లాక్‌మెయిల్ చేయడానికి కూడా వెనుక తీయరు.

___ కొన్నిరకాల కన్నీటికి ఎవరూ సిగ్గుపడ

క్కరలేదు. అవి ఆనందభాష్పాలు. గర్వకారణాలు, సంతోషచిహ్నాలు, మనస్సులో ఉప్పొంగే ఉత్సాహానికి బహిరంగ చిహ్నాలు. ఏరోచిత వార్తలు, మనస్సుని ఎక్కడెక్కడికో తీసుకుపోయే సంగీతం, దూరంగా వెళ్లిన ఆత్మీయులు మన వెతికే కళ్ళకి హఠాత్తుగా కన్పించినప్పుడు... కన్నీరు చిప్పిలుతుంది. మనస్సు ఉప్పొంగుతుంది. నన్నెప్పుడూ అడుగుతూ ఉంటారు మూడోది కూడా ఆడపిల్లే పుడితే ఏడిచావా?' అని. ఏడిచాను. కాని ఆడపిల్లని కాదు కళ్ళూ, కాళ్ళూ చేతులూ సవ్యంగా ఉండి పాప చక్కగా ఉన్నందుకు!...' అదీ అసలు ఏడుపు అర్థం అంది పక్కనే ఉన్న డాక్టర్. ●




ఇందిర ఉత్తరం రాసింది. ఉత్తరం కాదు, పిడుగు అంటే నబబేమో!— చింత ఆశ్చర్యకరమైన విషయాన్ని మోసుకొచ్చిందది!! — రాసినది మూడుముక్కలే. చాలుగో వాక్యం 'ఇంతే సంగతులు-' అని!

చాలదూ—గంగిగోవుపాలు గరిటెడైనను చాలు!!

ఉత్తరంలో ఉన్నది రెండు ముక్కలైతేనేం, విశేషమనే దొకటుంటే చాలు!

ఇందిర రాసిందిది— 'ఇన్నాళ్లకైనా ఒక మంచిపని చేశాననే సంతృప్తి నాలో ఈవేళే మిగిలింది. ఉద్యోగానికి రాజీనామా చేసేసి ఈ పల్లెటూర్లో ప్రశాంతంగ నిట్టూర్పు విడుస్తోంటే ఎంత తృప్తిగ ఉందో తెలుసా? నువ్వు ఈ వూరికొస్తే నీకూ తెలుస్తుంది, రాజీనామా చేసికాదు, సెలవు పెట్టిరా! ఇంతే సంగతులు — నీ ఇందు.'

ఆశ్చర్యపోయినమాట నిజం! ఇందిర రాజీనామా చేసేసింది!! ఎంత ధైర్యం దీనికి!!!

బి. ఏ. లు పాసయి రోడ్లమీద తిరుగుతున్న లక్షలమంది కథ ఇందుకి తెలియనిది గాదు. తనకు రావాల్సిన ఉద్యోగం కన్నా చాల తక్కువ ఉద్యోగంచేసి, చేస్తూ, ఆత్మవిశ్వాసం కోల్పోయిన 'అండర్ ఎంప్లాయిడ్'ల కథా ఇందుకు తెలుసు — అయినా రాజీనామా!!

ఉత్త ఆవేశం. అంతే, ఆవేశం మించి మరేమీకాదు. ఆవేశంలో ఈవేళ రాజీనామా చేసినా, రేపు గురించి ఆలోచన ఎంత భయంకరంగ ఉంటుందో ఇందుకు తెలుసు.

అయినా— 'ఈ పల్లెటూళ్లో ప్రశాంతంగా గాలి పీల్చుకొంటూంటే ఎంతో సంతృప్తిగ ఉంద'ట—ఇదంతా ఆత్మవంచన. ఒకరోజు సెలవు పెట్టమంటే ఏడ్చిపోయే ఇందు ఉద్యోగం వదులుకొని ఆత్మ సంతృప్తిని అనుభవిస్తోందిట — నాన్సెన్స్ అండ్ నథింగ్ బట్ నాన్సెన్స్!!

అయినా ఆ పల్లెటూరి గురించి నాకు చెబుతోంది ఇందిర! నిజమే, అది ఇందిర పుట్టిన ఊరు. అలాగని నాది కాదనికాదు.

ఇద్దరం అక్కడే పుట్టి పెరిగాము. అక్కడితో కథ ఆగిపోలేదు. ఇద్దరం కలిసి నగరం వచ్చి కాలేజీలో చేరాము— ఇంత జరిగినా, అది ఆ పల్లెటూరి గురించి అక్కడ నిటూర్పు విడవటంలో గల తృప్తి గురించి చెబుతోంటే నవ్వొస్తోంది?

అయినా ఒకసారి వెళ్లొస్తే బాగుంటుంది— అమ్మను, నాన్నను, బుజ్జిని, వాణిని చూసి చాలకాలమే అయింది. ఒకసారి వెళ్తే, వీళ్ళందర్నీ చూసినట్లూ ఉంటుంది. ఇందిర కింత పొగరెలా వచ్చిందో అదీ తెలుస్తుంది. ఔను, వెళ్ళాలి!!

మా ఊరెళ్ళాలనే నిర్ణయం ఒకసారి చేసుకొంటే, అది క్షణక్షణానికీ ధృఢమవుతూనే వస్తుంది కానీ ఆ కోరిక చావదు. పుట్టిపిల్లన్నా, పుట్టిన ఊరన్నా ఈ జీవుడికింత ఆపేక్ష, ఆప్యాయత ఎందుకో? —

ఏమో, కొన్ని ప్రశ్నలే ఉంటాయి. వాటికి జవాబులుండవు.

మర్నాడు పొద్దున్నే సెలవు కోసం అప్లికేషన్ ఇస్తోంటే సూపరిండెంట్ నాకేసి అదోలా చూసి నవ్వాడు — 'ఏమిటండీ, ఏమిటి సంగతి?...ఏమైనా...?...'

ఆ ఏమైనా అంటే ఆయన ఊహలో పెళ్లి చూపులు.

'ఉహూ, అలాటివేం లేవండి —' నవ్వుతూ అన్నాను నేను.

'ఆడవాళ్లకు సిగ్గందం కావచ్చు కానీ అబద్ధాలు మాత్రం కావండీ—'

'అవునండీ, అబద్ధాలు చెబితే ఆడపిల్లలు పుడతారంటారు గానీ అబద్ధాలు ఆడపిల్లలకు అందం అని మాత్రం అనరండీ! — కదూ సీతాజీ! —' రాజారాం నవ్వుతూ అన్నాడు.

'సీతాజీ ఏమిటండీ, నేతాజీలాగ! సీతా అనండి చాల్లేదు. లేకపోతే సీతగారూ అన్నైనా...'

'సీతగారు ఏమిటండీ పీతగారులాగ...' అన్నాడు రాజారాం. నాకు ఆపుకోలేనంత నవ్వొచ్చింది. పకపకా నవ్వాను.

'ఇనంతా ఆబాపతు' లాగానే ఉందే...' రాజారాం గట్టిగనే అన్నాడు.

నా వెంతో సిగ్గనిపించింది — ఆ ఊహ మనసులో మెదలగనే ఎందుకో ఒళ్లంతా సిగ్గుతో కుంచించుకు పోతోంది నాకు తెలుసు, నేను ఆడదాన్నని. ఒకరోజు కాకపోతే ఒకరోజు గృహిణిగ మారి; నా కుటుంబాన్ని...ఛ — అపుడే అన్నీ మొదలు, పిల్లలు, ఇల్లు...

ఇందు ఇందుకే రాజీనామా ఇచ్చిందేమో? ఏమో—ఆ మొద్దు నాకు తెలీకుండానే..ఎంతకైనా తగును!!

పెళ్లి సెటిలయిపోయింది కాబోలు, ఉద్యోగానికి రాజీనామా చేసేసింది. ఇంకేముందీ, ఇంతటితో ఇందిర కథ సమాప్తం కాబోలు—రాస్కెల్!!

ఆవేళ సాయంత్రం బయలుదేరిన నేను ఇల్లు చేరేసరికి తెల్లగ తెల్లవారిపోయింది నేను ముందు ఇందిర ఇంటికే వెళ్లాను. ఇంకాలేవలేదది. ఆ తర్వాత ఇంటికెళ్లాను' ఇంటికి అకస్మాత్తుగ వెళ్లేసరికి, అమ్మా నాన్న ఆశ్చర్యపోయారు. బుజ్జీ, వాణి సంతోషించారు.

ఇందిరొచ్చింది కొంతసేపటికి. పలకరించాను—'అదికాదే, కాకితోనైనా కబురంపక ఏమిటే ఈ రాక? —' అడిగింది ఇందిర.

'పట్నంలో ఆ గాలిపడటం లేదే! పల్లెటూర్లో ప్రశాంతంగా గాలి పీల్చుకొంటూ ఆత్మసంతృప్తితో కాలం గడుపుదామని! అంతే!—'

'నీకు ఒళ్ళు పొగరే సీతా!—'

'నాకా? ఛ! ఏదే? నీకున్నదాంట్లో సగమేగా నాకున్నది! నువ్వు రిజైన్‌చేసి వచ్చావు, నేనైతే సెలవుపెట్టి వచ్చా!—'

అమ్మ ఆశ్చర్యపోయి అడిగింది—'అదేమిటమ్మా, నువ్వు రిజైన్ చేశావా?'

'అవునండీ, అమ్మ మీకు చెప్పలేదా?'

'నువ్వే చెప్పలేదుగానీ అమ్మ చెప్పలేదా అని అడుగుతావేం?' నిష్టూరంగ అంది అమ్మ.

'ఏంలేదులెండి — ఈమధ్య ఇంటికెన రొచ్చినా ఇదే సోది—'

'ఔనుగానీ, ఎందుకూ రిజైన్ చేసింది? —' నేను అడుగుదా మనుకున్న ప్రశ్న ఇది. అమ్మ అడిగింది.

'ఉద్యోగం అంటే విసుగొచ్చిందనుకోండి, వెధవ ఉద్యోగం...'

ఈ జవాబు అమ్మకోసం. నాకయితే ఇంకో జవాబు వచ్చి ఉండేది. నాకా నమ్మకం ఉంది తెలుసుకోవాలి — ఎందుకు తొందరపడిందో? — బహుశా...

'ఇందూ, పెళ్ళెద్దైవా సెటిలయిందేమిటి? —'

'నీకా? నాకా?—'

అమ్మ నవ్వింది ఇందిర ఇచ్చిన జవాబుకు—' 'ఏ మాటా నిజమే తల్లీ దీనికి చెయ్యాలి—'

'ఇంతకీ నీ సంగతి చెప్పవేం?'

'పెళ్లిలేదు, పెటాకులూ లేదు—'

'పెళ్లి లేదు? అయితే మరింకేమిటి?'

ఇందు తొందరపడింది నిజం!!

పెళ్లి కాక, ఉన్న ఉద్యోగానికి నీళ్లొదులుకొని ఇందిర ఏం చేస్తుంది? ఏమిటి దీని ఉద్దేశం? ఇక్కడ ఉండదలుచుకొన్న నాలుగు రోజులలోగా ఈ విషయం తేల్చుకొని వెళ్లాలి. నా పిచ్చిగానీ ఇంకో గంటకు ఇందిరే చెప్పేస్తుంది!!

కాఫీ తాగి ఇందిర వాళ్ల ఇంటికి బయలుదేరాము. ఇంట్లో కెళ్లేసరికి ఇందిర వాళ్లమ్మగారు పిలిచారు నన్ను— 'సీతమ్మ తల్లీ—మాట! నువ్వు ఇందిరకు పంచప్రాణాలు కదూ! కొంచెం దానికే మొచ్చిందో కనుక్కో మాయరోగం! ఒక్కముక్క అంటే ఒక్కముక్క చెప్పి చేసుండకూడదూ ఆపనేదో?—'

విసురుగ అంది ఇందిర— 'ఇదిగో అమ్మా, ఆఖరిసారిగ చెబుతున్నా—మాయరోగం, పెద్దరోగం నాకే వచ్చాయి అని చెప్పాగా! ఇంకా అందరితోటే ఎందుకే ప్రస్తావన?—'

'నీకు సీత 'అందరూ'లో?—'

'కాదు—నాకు అందరూ సీతే! నీ ఘోష అంతా సీతతోటే చెప్పుకో. అంతేగానీ ఇంకెవరితోనైనా అన్నావంటే మాట దక్కదు—' ఎంత విసురుగ అందో, అంత విసురుగనే వెళ్లిపోయింది ఇందిర.

నేను, ఇందిర వాళ్ళమ్మగారు ఇంకా ఆ షాక్ నుంచి తేరుకోకుండానే, మళ్లీ వచ్చింది ఇందిర— 'ఇదిగో సీతా! మాట. ఒక గంటో రెండుగంటలో రామాయణమంతా వినిరా! నేను మీ ఇంట్లోనే ఉంటాను, సరేనా?—'

వెళ్లిపోయింది ఇందిర.

నా మనసెందుకో గాయపడింది. ఇక ఇందిర వాళ్ళమ్మసంగతి...

'విన్నావా సీతా! ఆ విసురూ, ఆ పొగరూ...'

రసపదార్థాలూ - గుణాలూ :

# పసుపు

చారు, పులుసు, కూరలు, పప్పులు మొదలగు వానిలో చిటికెడు పసుపుగుండ వేస్తాం టారు. చంటిపిల్లలకు మనవాళ్ళు ఉగ్గులో కొంచెం పసుపుగుండ వేసి పడుతూంటారు. అంతేకాక భారతనారికి పసుపు పరమ పవిత్రమైనది.

పసుపు వేడి చేసి ఆర్పుతుంది. శ్లేష్మాన్ని, మేహాన్ని హరిస్తుంది రక్తాన్ని శుభ్ర పరుస్తుంది. జఠరదీప్తి నిస్తుంది. జీర్ణ శక్తిని పెంపొందిస్తుంది

క్రిమిరోగం, దగ్గు, జ్వరం, కుష్టు, దురద, మేహ వ్రణములు కఫరోగాలు,మూత్రం వెంట సుద్దపడే మేహరోగం, ఉబ్బు, పాండువు కామెర్లు గలవారికి మేలు చేస్తుంది. గుండెకు పొట్టకు బలాన్ని యిస్తుంది. నీళ్ళ విరేచనాలు కడతాయి. కళ్ళకు కాంతినిస్తుంది. లివర్‌లో పుండయే రోగాన్ని మాన్పుతుంది. లివర్‌ని శుభ్రపరుస్తుంది

పసుపు కొమ్ము నిప్పుల మీద కొద్దిగా కాల్చి పసుపీల్చినట్లయితే పళ్ళనొప్పులు తగ్గుతాయి. అంతేకాక ఒగర్పుగల దగ్గు తగ్గుతుంది

పసుపుగుండ పరిశుభ్రమైన నీళ్ళలో కలిపి గడ్డల పైనగాని వ్రణాల పైనగాని వేసి కట్టుకడితే అవి తగ్గుతాయి.

కొంచెం పసుపు నల్లమందు, పటిక కలిపి— కళ్ళకు పట్టువేస్తే కళ్ళ ఎరుపులు పోటు తగ్గుతాయి. పసుపు కషాయంతో కళ్ళు కడిగి— తడి పసుపు గుడ్డతో కళ్ళు ఒత్తుకుంటూ వుంటే కళ్ళ కలక తగ్గుతుంది

పసుపు పుప్పుల రసాన్ని శోభిమచ్చల పైన కొన్నాళ్ళు పాటు పూస్తే శోభిమచ్చలు, పోతాయి. శరీరానికి కాంతి వస్తుంది. ఎవరికైనా తేలు కుట్టినట్లయితే— పసుపుగుండను నిప్పుల మీద చల్లి ఆ పొగను పీల్పించండి కొంతవరకూ బాధ ఉపశమిస్తుంది.

పచ్చిపసుపు నూరి తలకు పట్టించినట్లయితే తలదిమ్ము, తల త్రిప్పు తగ్గుతాయి

పసుపుగుండ పొగను గానీ, పసుపుగుండ చల్లిన వేడినీళ్ళ ఆవిరిని గాని పీల్చినట్లయితే దగ్గు, జలుబు శిరోభారం తగ్గుతాయి.

చెవుల లోంచి రసి, చీము కారుతూ ఉన్నట్లయితే— ఒక వంతు పసుపు ఇరవై వంతులు పటిక రెండూ కలిపి— బాగా చూర్ణించి— ఆ చూర్ణాన్ని దూది పుల్లతో చెవిలోకి చొప్పునట్లు నాలుగైదు రోజులపాటు చెయ్యండి. రసి, చీము కారడం కడుతుంది

నీళ్ళతో పసుపు, సున్నం కలిపి కట్టు కడితే— గోరుచుట్టు, పుండుమశకాలు, పణుపు మాద మొదలగునవి తగ్గుతాయి. ఈ కట్టు అప్పుడప్పుడు పసుపు నీళ్ళతో తడుపుతూండాలి.

పసుపు నీళ్ళు యాంటిసెప్టిక్ లోషన్ లాగ పని చేస్తాయి.

కంటి రెప్పల మీది వెంట్రుకలు రాలి పోతున్నట్లయితే:— పచ్చి పసుపు దుంపను తెచ్చి దానిని నీడలో ఆరబెట్టి కొన్ని ఆరిన తరువాత ఒకమంచి నిమ్మకాయకు రంధ్రం వేసి— అందులో మూడు దినాల పాటు ఊరనిచ్చి నాల్గవ నాడు ఆ పసుపు కొమ్మును, అందులోంచి తీసివేసి ఒకరోజు ఎండ బెట్టండి. మళ్ళీ ఆమర్నాడు దానిని మరొక నిమ్మకాయలో పెట్టి ఊరనివ్వండి. మూడు రోజుల పాటు అందులో ఊరేక నాల్గవ రోజున బయటకు తీసి, ఒక రోజంతా ఎండబెట్టండి. ఇదే విధంగా ఏడు సార్లు చెయ్యండి. ఆ తరువాత రో ఉమ్మితో (లాలాజలంతో) ఆ పసుపు కొమ్ముకు అరగదీసి ఆ గంధాన్ని కళ్ళకు కాటుక వలె కొన్నాళ్ళ పాటు పెట్టండి అప్పుడు మరి కంటి రెప్పల మీది వెంట్రుకలు రాలిపోవు. రాలిపోయిన వెంట్రుకలు మళ్ళీ మొలుస్తాయి.

బొల్లిమచ్చలు గాని, తెల్లపొడలు గాని ఉన్నట్లయితే పచ్చిపసుపు కొమ్ము తెచ్చి— బ్రహ్మ చెముడు చెట్టు ప్రమానులో రంధ్రం చేసి— అందులో ఆ పసుపు కొమ్ము ఉంచి, రంధ్రాన్ని దాని మాని కర్రతోనే పూడ్చి— వారం రోజుల పాటు అందులో ఉండనిచ్చి— ఎనిమిదవనాడు ఆ పసుపు కొమ్మును బయటకు తీసి ఆరబెట్టి— రెండుమూడు మాసాల పాటు ఆ పసుపు కొమ్ము యొక్క గంధాన్ని ఆ మచ్చలపై పూస్తూ ఉండండి. మచ్చలు పోతాయి శరీరానికి కాంతి వస్తుంది.

కొంచెం పసుపుగుండ పాలతో కలిపి, అందులో కొంచెం మిరియాల పొడి కలిపి రోజూ రెండు పూటలా యిస్తే జ్వరంతో కూడి ఉన్న దగ్గు, జలుబు తగ్గుతాయి. పట్టి పసుపు గుండ నీళ్ళలో కలిపి యిస్తే జలుబు, దగ్గు నిమ్మళిస్తాయి.

వయస్సుని బట్టి దేహదారఢ్యాన్ని బట్టి పసుపు లోపలికివ్వ మోతాదు 10 మొదలు 30 గోధుమ గింజల ఎత్తు వరకు యివ్వ వచ్చును.

పసుపు అధికంగా లోనికి పుచ్చుకుంటే గుండెకు,ఇంద్రియానికి నష్టం వాటిల్లుతుంది

దీని యొకరా దుర్గుణాలకు విరుగుళ్ళు.—
1. నిమ్మపండు, 2. పంపరపనాస పండు,
3. నారింజపండు.

సేకరణ: ఆకుండి నారాయణమూర్తి

# నాకో తోడు కావాలి

'లేదులెండి. ఇందిర అలాటిది కాదు—'

'లేదులే, ఇందిర మారిపోయింది. నీకా సంగతి తెలీకపోదులే!—'

క్షణం ఆగి అన్నాను—'ఇంతకీ ఎందుకండీ ఆ విసుర్లూ, పొగరు...'

'ఇదేమిటి? దీని పొగరులో ఇది వందో వంతైనా లేదమకో! అయినా చూడు సీతా, కన్నవాళ్ళంగదా, ఉద్యోగానికి రాజీనామా చేయదల్చుకొన్నది ఒక్క ముక్క మాతో చెప్పి ఉండకూడదూ? ఊహూ— ఇంటికొచ్చేంతవరకూ మాకూ తెలీదనుకో! ఎన్నాళ్ళు పెట్టావే సెలవు అంటే సెలవేమిటే, ఉద్యోగం వదలి వచ్చేశానంది ఆ గుండెలు తీసిన బంటు. అయినా ఎందుకో నీకు తెలుసా?'

ఆశ్చర్యపోయాను— ఏమిటి కారణం? తల్లికీ, తండ్రికీ కూడ చెప్పకుండా...

'నాకేం తెలీదండీ...'

'పోనీ, గొడవేదైనా జరిగిందా అనికూడ అడిగాను. అలాటివేం లేవే అంది. గొడవా లేక, బాధాలేక ఎందుకొచ్చిన మాయరోగం ఇది—'

నిజమే — ఏదైనా గొడవ జరిగిందేమో !—

ఏదైనా గొడవ అన్నా— అదేగా !— బహుశా ఏ ప్రేమవలలో నైనా చిక్కుకొని పోయిందేమో ! బయటకు రాలేక, బాధ భరించలేక—ఏమో—ఒకవేళ అదే కారణమయితే, రాజీనామా మాత్రం సమాధానం కాదు — అది సమస్యనుంచి పారిపోయే తత్వం—

'నేను కనుక్కుంటాలెండి ఏమైతే జరిగిందో ?' అన్నాను ఆవిడను ఓదార్చే ప్రయత్నంలో. కానీ అది మిస్‌ఫైర్ అవుతుందని నాకేం తెలుసు ? ఇందిర వాళ్ళమ్మగారన్నది నాకు షాక్‌లా తగిలింది —'ఏమైనా జరిగే ఉంటుందంటావా ?'

ఏమో, ఏం చెప్పగలం ?— అందామనుకున్నాగాని అనలేదు.

'కాదు సీతా, దీన్నో ఇంటి దాన్నిచేసి చేతులు దులపుకుందామని ఎన్నేళ్ళనుంచి ప్రయత్నిస్తున్నామో నీకు తెలీందిగాదు. ఇన్ని సంబంధాలు చూసినా, మా దురదృష్టమో ఏమో, ఒక్కటంటే ఒక్కటి కుదిరిచావడం లేదు. వచ్చే మంచి నాంద

# నాకో తోడు కావాలి

నాడేమో బెజవాడనుంచి ఇంకోళ్ళు వస్తున్నారు, దీన్ని చూడ్డానికి సెలవుపెట్టి రమ్మని ఉత్తరం రాద్దామనేసరికే వచ్చేసింది ...కనీసం ఇదైనా కుదిరిపోతే...'

నేనేం వినడంలేదు—కాదు నాకసలు వినిపించడంలేదు.

వచ్చే మంగళవారం ... ఈవేళ గురువారం. అదైనా కుదిరితే...అయినా ఎన్ని సంబంధాలు చూశారు. ఒకటా? రెండా? ఎంత లేదన్నా ఒకపది...ఇంతమంది పెళ్ళిచూపులకు వచ్చినా ఒక్కడంటే ఒక్కడు ఇందిరను చేపట్టడానికి సిద్ధపడలేదు. తమాషాగ ఉంది!— ఇంతకన్నా తమాషా—బహుశా మొదటిసారి ఇందిరను చూడ్డానికి వచ్చిన అతనే, ఇందిరను చూసి, దాని చెల్లెల్ని, దానిపేరేమిటి?... జయంతి, ఊఁ జయంతిని చేసుకుంటాననడం!

ఎంత ఆశ్చర్యంగ ఉంది అది ఈవేళ తలుచుకొన్నాసరే!— ఇందిరకు ఇంకా ఇరవై అయినా వచ్చిఉండవేమో—ఇందిరను చూడ్డానికి ఆవేళ ఎవరో వస్తున్నారని విని సంబరపడ్డాను—ఇందిరను తీసుకెళ్ళి కూచోబెట్టారు. ఏవేవో ప్రశ్నలు ఏం చదువుతున్నావనీ, ఏం చేస్తున్నావనీ, వంటవగైరా వచ్చునా అనీ, సంగీతసాహిత్యాలలో అభిరుచులున్నవా యని—అన్నీ అనవసరం. ఆ అమ్మాయిలో తనకు నచ్చిన గుణాలున్నాయో లేదో చూసుకుంటే చాలు. అంతేగానీ ఆ అమ్మాయి సంగీత సర్వస్వాన్ని మధించి ఉన్నంత మాత్రాన, లేకపోతే సాహితీసరస్వతి అయినంతమాత్రాన చేసుకోవటం తెలివి తక్కువపని. సంగీతమంటే ఎంత ఇష్టమున్నా, ఇంట్లో కచేరీలు చేసే స్త్రీలను చేసుకోనక్కర్లేదు. సాహిత్యమంటే ఎంత అభిరుచిఉన్నా, సరస్వతిని తెచ్చి ఇంట్లో పెట్టుకోలేం! కావాల్సింది భార్య! అంతే!!

—నా భావాలు ఇంకా ఒకకొలిక్కి రాక పూర్వమే ఒక బ్రహ్మాండమైన షాక్ తగిలింది నాకు—పెళ్ళికొడుకు తల్లి వచ్చి ఇందిర అమ్మతో అన్నమాటలను విని! ఆ అబ్బాయికి ఇందిరకన్నా జయంతి నచ్చిందిట. జయంతినిస్తే తప్పకుండా చేసుకుంటాడుట—

చేసుకో వచ్చింది ఇందిరను, చేపడతానన్నది జయంతిని!— ఇందిరను చూస్తే జాలి వెయ్యలేదుగానీ జయంతిని చూస్తే మటుకు అదృష్టవంతురాలనిపించింది. ఇంట్లోవాళ్ళు పెద్దకూతురికి పెళ్ళి కాకుండా రెండోకూతురి పెళ్ళి అనేసరికి కొంత తటపటాయించినా, ఇందిరే పూనుకొని జయంతికి, అతనికీ పెళ్ళి జరిపించింది. జయంతి పెళ్ళితోనే ఇందిర పెళ్ళి చేద్దామని ఎంత ప్రయత్నించినా ఏ సంబంధమూ కుదిరి రాలేదు.

జయంతి పెళ్ళయి ఏడేళ్ళు అయింది—ఇద్దరు పిల్లలతల్లీ అయింది.

ఇందిరకింకా పెళ్ళేకాలేదు!!

జయంతి పెళ్ళితర్వాతే ఉద్యోగంలో చేరింది. ఇందిర చేరిందనే, నేనూ ఇంట్లో పోరి మరీ ఉద్యోగంలో చేరాను ఉద్యోగమంటే ఏదో థ్రిల్ అనుభవిద్దామనుకొన్నానీ, చేరాక ఉత్త రొటీన్‌వర్క్ కావడంతో బోర్ అనిపిస్తోంది. అంతమాత్రంచేత రిజైన్ చేస్తానా? ఊహూ...

ఇందిర వాళ్ళమ్మగారు ఇంకా ఏదో చెబుతూనే ఉన్నారు. నేను వెళ్తానని చెప్పకుండా ఆ మాటలమీద కొంత అనాసక్తత ప్రదర్శించేసరికి ఆవిడే వెళ్ళమన్నారు.

ఇంట్లోకెళ్ళేసరికి ఇందిర అమ్మతో కబుర్లు చెబుతోంది. నన్నుచూసి నవ్వుతూ అంది— 'ఏం చెప్పిందే అమ్మ?—'

'నువ్వే అన్నావుగా, రామాయణం అని...' ఇందిర నేనూ బయలుదేరాం—

'ఏమ్మా! బాగున్నావా?', 'సీతమ్మతల్లో, ఎక్కడికి?—', 'ఎన్నాళ్ళు సెల్చారు సెలవు? వో నారం?'

—అందుకే నాకింతగర్వం. ఈ ఊళ్ళో అడుగెట్టిన క్షణంనుంచీ వెళ్ళేంతవరకూ ప్రతివారు పలుకరిస్తూనే ఉంటారు. పంచాయితీ ఆఫీసు కెడుతూ ప్రెసిడెంట్‌గారు, పొలాలకు ఎడ్లు తోలుకెడుతూ పాలేరు బూచిగాడు, స్కూలు మాష్టారు నిరంజనంగారు ... అందరూ అందరికీ ఆత్మీయులే!

ఈ రోడ్లమీద నడుస్తోంటే ప్రాణం లేచొచ్చినట్లుంటుంది! ఈ రోడ్లు కంకరకు కూడ నోచుకోలేదు, అయితేనేం,

ఆప్యాయతలతో, ఆదరణలతో అలికినట్లుం టుంది.

పొలాల గట్లమీద నడుస్తోంటే అడి గాను— 'ఎక్కడికే ఇలాగ?'

'అదిగో, ఆ రావిచెట్టునీడలో కూచుం దాం—' అంది ఇందిర.

కూర్చోగానే అడిగాను—ఇంకా ఆలస్యం దేనికి? చెప్పు—'

నవ్వుతూ అంది ఇందిర— 'ముందు అమ్మ ఏంచెప్పిందో చెప్పు—'

'ముందిది చెప్పు — రిజైన్ చేశావెం దుకే?' —

'అబ్బ, మొదలెట్టావ్ నువ్వుకూడ!— అయినా దానిగురించి అందరికీ ఇంత ఇదిగా ఉందేం?'

'ఉండదూ మరి—నీకంటే ఒళ్ళు పొగరు గనుక, కళ్ళకు పొరలున్నాయి కనుక ఇదిగ ఉండదు మా కవేం లేవుగా, అందుకే 'ఇంత ఇదిగ' 'ఉంది.' అన్నాను నేను కోపంగ.

ఇందిర నవ్వుతూ అంది—'మరీ పెద్ద ఆరిందాలా మాట్లాడకు. నా ప్రాణస్నేహి తురాల్లా మాట్లాడు. నీ క్కూడా అలాగే అనిపించడం వింతగనే ఉంది. ఒకటడుగుతా చెప్పు — జీవితాంతం ఉద్యోగం చేస్తూనే వుంటాననా మీ ఊహ?'

'కాదు, అలాగని ఉన్నదానికి నీళ్ళొదులు కుంటావని అనుకోలేదు'

'నిజం చెప్పొద్దూ, రిజైన్ చేద్దామని నిర్ణయించుకొనేంత వరకూ నాకు తెలీదు. నిర్ణయించుకొన్న రెండు రోజులలోనే యిం టికి వచ్చేశా—'

'మంచి పని చేశావ్—' వెటకారంగ అన్నాను నేను.

'నిజమే, ఉద్యోగం వదిలేసిన తర్వాత నుంచీ ఇప్పటివరకూ అలాగే అనుకొంటు న్నాను. కారణాలు తెలుసుకొంటే నువ్వూ అలాగే అంటావ్!—'

'దీనికి కొన్ని కారణాలు కూడ ఉన్నా యేమిటి? ఒళ్ళు పొగరు, అంతే!'

ఇందిర అంత పెద్దపెట్టున నవ్వడం నా జీవితంలో కనీ వినీ ఎరుగను. నవ్వాపు కొంటూ అంది— 'అమ్మ చెప్పింది బాగా వంటబట్టినట్లుంది నీకు—సీతా, ఉద్యోగం వదిలేయడం నాకు మాత్రం సరదా అను కొన్నావుటే? రేదర్ అయామ్ ఫోర్స్డ్.

ఇలా చెబితే అర్థం గాదు నీకు; సరిగా చెబుతా విను! జయంతి పెళ్ళయి ఎన్నే ళ్ళయిందంటావ్?'

నేనేం జవాబివ్వలేదు. నాకు ఇందిరంటే మహా తిక్కగ ఉంది.

'ఏడేళ్ళయిందా? అసలు జయంతి భర్తను నాకోసం చూశారా? పోన్లే. ఈ ఏడేళ్ళలో నా పెళ్ళే చేయలేకపోయారా?'

నా కర్థం కాలేదు 'అంటే?—'

'అంటేనా? నా మొహం మా అమ్మకు, నాన్నకు నన్నొక ఇంటిదాన్ని చేసే ఊహే లేదంటున్నాను, తెలిసిందా?'

తెలిసిందా? — లేదు. ఏమిటి దీని ఉద్దేశం?

'సీతా, ఏదో సరదాకు ఉద్యోగం చేద్దామనుకొని చేరాను కానీ అది నా జీవి తానికే అడ్డొస్తుం దనుకోలేదే! — అమ్మ నాన్నలు ఇపుడెంతగ దిగజారి పోయారో తెలుసా? నెల నెలా నేను తెచ్చే రెండు వందల యాభై రూపాయలకు మూడొం దల రూపాయల ఖర్చు ఎదురు చూస్తుంది. మొదట్లో డబ్బు ఏం చేయాలో తోచక పంపేదాన్ని. ఇపుడు, అపుడెందుకు పంపే దాన్నా అని ఏడుస్తున్నా — నీకు తెలీదు సీతా, నేను ఉద్యోగంలో ఉన్నంతకాలం నాకు పెళ్ళి జరగదు—' ఇందిర కంఠం గద్గదంగ మారిపోయింది

ఇందిర ఏం చెబుతోందో, ఆ చెప్పే దాంట్లో ఎంత ఇందిరకు అర్థమౌతోందో నాకయితే తెలీదు. కానీ ఇందిర ఇలా

అంటోందేం అసలు? ఇందిరకు పెళ్ళి చేయ కూడ దనేదే వాళ్ళమ్మ నాన్నల ఉద్దేశ మయితే, వచ్చే మంగళవారం మాట ఏమిటి?'

ఇందిరకు ఇది తెలీదు. తెలిసి ఉండదు. తెలిస్తే ఇదంతా జరగదు.

'కానీ ఇందూ, నీకోసం సంబంధాలు చూస్తూనే ఉన్నారు గదే—?'

'నాన్సెన్స్—చూసేవారు. ఇపుడు మాను కున్నారు. జయంతి పెళ్ళి తర్వాత నాకు చూసిన సంబంధాలెన్నో తెలుసా?—మూడు. జయంతి పెళ్ళయి ఏడేళ్ళయింది! చాలా? ఇంకా చెప్తాను విను, ఆ మూడింటిలోనూ ఒకతను నాకన్న పొట్టి. వరహీనమని వద్ద న్నారు. మరొకతనికి నేను నచ్చినా, మేమి స్తామన్న కట్నం నచ్చలేదు. మరో రెండు వేలు ఇస్తామంటే సరే అనేవాళ్ళే! ఆ రెండు వేలు వీళ్ళు ఇవ్వలేక పోయారంటే? అంత దరిద్రంతో అల్లాడుతున్నారనుకోను. సరే ఆఖరిది—అతనెవరో గౌహతీలో ఉంటా డుట — అస్సాంలో అయితేనేం, అండమా న్స్‌లో అయితేనేం, కూడ పోవాల్సిన దాన్ని నేనయినపుడు వీళ్ళ కేమిటి?—ఉహూ... ఇదంతా కుట్ర...'

ఛీ—ఏమిటే ఇందిర ఇలా అంటోంది?

'అది కాదే ఇందూ...' నచ్చ చెప్ప బోయాను నేను.

'నువ్వు ఊరుకోవే సీతా! వీళ్ళ కసలు ఇపుడు డబ్బు పిచ్చి పట్టుకొంది. నా కిపుడు పెళ్ళి చేస్తారనుకో, నా పది



వదిలేసు వేందాకా ఖర్చు. పైపెచ్చు నా జీతం ఇకనుంచి వాళ్ళాశించలేరు. ఔనా?... అమ్మో, ఎంతగ ఆలోచించగలిగారే వీళ్ళు?'

ఆలోచించగలిగింది వాళ్ళుకాదు—ఇందిర.

ఇదంతా ఇందిర కట్టుకొంటున్న కాకి గూడు.

ఇందిర చెబుతూనే ఉంది—'అందుకేనే, అందుకే ఉద్యోగం వదిలేసి వచ్చేశా! వీళ్ళకు కొంత డబ్బుమీద కాంక్ష తగ్గితే, నా పెళ్ళి జరిగే తీరుతుంది. నాకా నమ్మకం ఉంది.'

నాకు నవ్వాలో ఏడ్వాలో అర్థంగాలేదు.

ఉద్యోగం వదిలేసినంత మాత్రాన పెళ్ళి చేయాలని ఉందా? అడిగాను.

'గుండెలమీది కుంపటిలా వుంటే ఏం చేస్తారు? నీకు తెలీదేమో, కాసే చెట్టును ఎవరూ నరకరు—నా చేతిలోంచి డబ్బులు రాలకుంటే ఇంట్లోంచి తరిమేసి తీరతారు నాకు తెలుసు...'

నాకెందుకో ఏహ్యత జనించింది, ఇందిర మాటలు వింటూంటే.

పిచ్చిది—పిచ్చిది కాకపోతే ఇంకేమిటి?

'ఒక్కవిషయం చెప్పనిస్తావా నన్ను? ఈ విషయాలన్నీ నీకై నువ్వే ఆలోచించుకున్నావా? లేకపోతే ఎవరైనా ప్రవేశపెట్టారా?'

'అంత చిన్న పిల్లనేమిటే ఎవరైనా ఏదో అంటే చేసేటందుకు?'

నవ్వొచ్చింది నాకు—'కాదులే, మరీ పెద్దదానివైపోయినందుకే ఆశ్చర్యపోతున్నా. కన్నకూతుర్ని గుండెలమీద కుంపటిగ భావించే తల్లిదండ్రులు నీకే ఉన్నారను

# నాకో తోడు కావాలి

కునే స్థితికి ఎదిగిపోయిన నువ్వా చిన్న పిల్లవు? పోనీద్దూ, జరిగిందేదో జరిగింది కానీ నీకొకటి చెబుతా, నాకేమిస్తావ్?'

'నీకా?—ఆ మొగలిపువ్వంటి...' నవ్వుతూ అంది ఇందిర.

'నా సంగతి సరేగానీ, నీకోసం మంగళవారం వస్తున్నారు తెలుసా?'

—ఇందిర ఆశ్చర్యపోయింది. 'నిజం?'

'నువ్వు నమ్ము నమ్మకపో! మీ అమ్మా నాన్న నీవేడి భరించలేక సంబంధం చూశారు. ఇది నీ అమోఘమైన తెలివితేటలకు బహుమానం...' వెటకారంగా అన్న నాకు ఇందిర ఇచ్చిన జవాబు ఆశ్చర్యాన్నే కలిగించింది—'పోనీలెద్దూ, ఇదన్నా కుదిరి వెళ్ళిపోతే అంతే చాలు—'

'నీ తొందరంతా పెళ్ళికోసమేనా? లేకపోతే...'

'ఛీ, పోవే సిగ్గులేనిదానా' అంది ఇందిర నవ్వుతూ, 'అయినా ఈ సంగతులేవీ ఎవరితోనూ అనకు—'

నిజమే! కొన్ని సంగతులు మనతోనే మరణించాలి—అంతే!!

* * *

సోమవారంనాడు నేను ఆఫీసుకు వెళ్ళాల్సి ఉన్నా, మంగళవారందాకా, ఉండి వెళ్ళమని ఇందిర, వాళ్ళమ్మగారు అడగటంతో సెలవు పొడిగించాను—ఆ పెళ్ళి చూపులూ, ఆ తతంగమూ కొంత ఎంజాయ్ చెయ్యచ్చునని!!

మంగళవారం నాకూ ఇందిరకూ మామూలుగా తెల్లవారలేదు.

ఇందిరను పెళ్ళిచూపులకు తయారుచెయ్యటం, ఆ తర్వాత దాన్ని వేళాకోళం, వెక్కిరింతలతో ఉడికించటం— ఒంటరిగానే అనుకోండి—అంతా నా పనే అయింది. ఈ పనులలో నాకు జయంతిలోటు స్పష్టంగా కనిపిస్తూనే ఉంది.

జయంతికూడ ఉండిఉంటే బాగుండేది!!

వాళ్ళొచ్చారన్నాక ఎవరికీ నేలమీద కాలు నిలవలేదు, అటు ఇటు తిరగను... ఒకటే పనిలేని పని! యథాప్రకారం అన్నీ అడిగారు, చదువు, సంస్కారం, వంటావార్పూ, సంగీతం, సాహిత్యం...నాకేమో ఇంటరెస్ట్ కలిగింది—ఇదేదో కుదిరేలా ఉంది!!

ఫార్మల్‌గా పెళ్ళి చూపులనేవి జరిగాక ఆషామాషీలోకి దిగారు, కాబోయే వియ్యపురాళ్ళు ఇద్దరూ. అక్కడే కూర్చుని ఆమాటలు వింటూ అక్కడే ఉండిపోయాను. విషయం అటు తిరిగి, ఇటు తిరిగి ఆఖరికి ఇందిర మీదకే మళ్ళింది— ఉద్యోగం గురించి అడుగుతూ 'ఎన్నాళ్ళు పెట్టింది అమ్మాయి సెలవు?' అనడిగారు.

ఇందిర వాళ్ళమ్మగారు క్షణం ఆగి అన్నారు—'సెలవుకాదు లెండి, ఉద్యోగం మానేసింది!' నిర్వికారంగా నిర్లిప్తంగా అన్నట్లుంది.

ఆవిడ తెల్లపోయారు. 'అదేమిటండీ! మా అబ్బాయికి ఉద్యోగం ఉన్న అమ్మాయినే చేసుకోవాలని ఉంది. ఆ సంగతి స్పష్టంగా ముందు మీకు రాశాంకూడా..'

నేను ఇందిరవైపు చూశాను—ఇందిర నావైపు చూడ్డంలేదు. ఎక్కడో చూస్తోంది. ఇద్దరం లేచి లోపలికి వెళ్ళాం...

'అతడికి ఉద్యోగం చేస్తోన్న అమ్మాయి కాని అక్కర్లేదుట...ఇదంతా మా ఖర్మ...' ఇందిర అమ్మ సణగడం. ఆవిడ మాటలు ఇందిరమీద ఎలా పనిచేస్తాయో నేను ఊహించలేను... ఊహిస్తే ముందు నా గుండెకి గాయం అవుతుంది. అది ఇందిరను వోదార్చే స్థితికాదు. ఆ కళ్ళల్లో అప్పటికే నీళ్ళు నిండుకొన్నాయి. ఆ కన్నీటి సముద్రంలో నేను మునిగిపోతానని భయంవేసింది...ఆ గదిలో చీకటికీ, ఒంటరితనానికీ ఇందిరను బలిపెట్టి, నేను బయటకు నడిచాను. ●

దేశంలో దారిద్ర్యం-పేదరికం
నిరుద్యోగం.. అల్లర్లు మేం నివారించ
లేకపోయిన మాట నిజమే— అవన్నీ
లేకుండా పోయున్నాటు ఇక ఈ ఎన్నికల
అవసరం-మా అవసరం ఏముం
ఉంది!?

# కలిసి ప్రయాణించటం లాభదాయకం!




మీరు ఒక గుంపుగా ప్రయాణం చేస్తే ఎయిర్-ఇండియా వారి ఎఫినిటీ గ్రూప్ స్కీము క్రింద తక్కువ, చాలా తక్కువ చార్జీలు చెల్లించవలసి ఉండును.

**ఎటువంటి గుంపులు ఇందుకు అర్హులు ?**

మీ గుంపులో కనీసం 15 మంది సభ్యులైనా ఉండాలి. మీరంతా కనీసం 6 మాసాల పాటైనా ఒకే స్కూలు/కాలేజి, ఇన్‌స్టిట్యూట్, ఫర్మ్, క్లబ్, సొసైటీ, కార్పొరేషన్, అసోసియేషన్ లేక సమాఖ్యకు చెందినవారై ఉండాలి.

**ఎటువంటి ప్రయోజనానికి ?**

ఒక కాన్ఫరెన్స్ లేక కన్వెన్షన్‌కు హాజరవ్వటానికి గాని లేక కులాసా కోసం గాని మీరు ప్రయాణం చెయ్యదలచినట్లైతే మీకా తగ్గింపు సదుపాయం లభించగలదు. ఎయిర్—ఇండియా మీ గుంపులో భాగముగా మీ భార్య/భర్త మరియు పిల్లలను గూడా చేర్చటానికి అంగీకరించగలదు. నిజంగా మీరు ఎంతో డబ్బు—కొన్ని సెక్టర్లలో ఒక్కొక్క చార్జీ మీద రు. 2000 లకు పైగా—ఆదా చేసుకోగల్గుతారు.

జీఐటీని గురించి మీ ట్రావెల్ ఏజెంటును సంప్రదించండి గ్రూప్ ఇంక్లూజివ్ టూర్ స్కీము క్రింద కలిసి ప్రయాణం చేసే 10 మంది గల గుంపుకు విమాన చార్జీలలో, హోటల్ బుక్కింగులలో, వివిధ ప్రదేశాలను చూడటానికి ఏర్పాటుచేసిన టూర్లలో తక్కువ రేట్ల ప్రయోజనం మీకు లభిస్తుంది మీ ట్రావెల్ ఏజెంటు 21-రోజుల యూరపు పర్యటనను కేవలం రు. 5 800లకు మాత్రమే ఏర్పాటుచేయగలదు.

మీ స్థానిక ఎయిర్-ఇండియా ఆఫీసు లేక మీ ట్రావెల్ ఏజెంటును పూర్తి వివరాలకై సంప్రదించండి కలిసి ప్రయాణం చేయటం ఎంతో లాభదాయకమని మీరు తెలుసుకోగల్గుతారు.

**ఎయిర్-ఇండియా**

మిమ్మల్ని ప్రేమించే ఎయిర్‌లైన్

సీరియల్



# పిల్లలతో ప్రేమయాత్ర

పరిమళా సోమేశ్వర్

### జరిగిన కథ

కాంతారావు పెళ్ళయిన దగ్గర్నుంచి హనీమూన్‌కి వెళ్ళాలనుకుంటున్నాడు ఇద్దరు పిల్లలు కలిగినా అతని ఆశ తీరలేదు. అనుకోకుండా వచ్చిన డబ్బుతో పిల్లలతోపాటు ప్రేమయాత్రకి బయల్దేరి తీరాలి అనుకున్నాడు అతని కోరిక కళ్యాణిని మొదట్లో ఆశ్చర్యపరిచినా — ఆ ప్రయాణం ఆమెకీ ఆనందమే. బయల్దేరదామంటే బయల్దేరదామనుకున్నారు వారి మొదటి మజలీ తిరుపతి దైవదర్శనం అయ్యాక కాళహస్తి వెళ్ళారు. ఆ తర్వాత ప్రయాణం కంచికి మొత్తం మీద, కంచి చేరుకునే వరకు వారి యాత్ర ఆనందభరితంగానే వుంది, కంచిలోవున్న దేవాలయాలన్నింటినీ సందర్శించారు తర్వాత మద్రాసు చేరుకున్నారు

## 11

బీచ్‌కి వెళ్ళేటప్పుడు కళ్యాణి తెల్లని నైలెక్సుచీర కట్టుకుని వాలు జడలో మల్లెలు, మెడలో ముత్యాలహారం వేసుకుంది. పెదవులకు లేత గులాబిరంగు లిప్‌స్టిక్కు వేసుకుంది

ఆమెనలా చూస్తూనే ఎవరో అపరిచిత వ్యక్తిని చూస్తున్నట్లు వింతగా చూస్తూ నిలబడ్డాడు కాంతారావు.

కళ్యాణి కనుకొలకులలోనుండి అతని వంక కొంటెగా చూస్తూ నవ్వింది.

కాంతారావు తేరుకుని 'త్వరగా బయల్దేరు కొంచెం ఎండ ఉండగానే బీచ్‌కి చేరుకుంటే అక్కడ కొన్ని స్నాప్స్ కూడా తీసుకోవచ్చు' అన్నాడు.

బీచ్‌వద్దున విల్సన్ని కూర్చుని వివిధ భంగిమలలో భర్త తనని ఫోటోలు తీస్తుంటే గర్వంగా, తృప్తిగా నవ్వుకుంది కళ్యాణి.

ఎండతగ్గి, చల్లబడగానే బఠానీలు తింటూ యిసుకలో కూర్చున్నారిద్దరూ ఒకరినొకరు ఆనుకుంటూ. పిల్లలు ఎన్నడూ సముద్రాన్ని చూడకపోవటంవల్ల పట్టరాని ఆనందంతో సముద్రపు కెరటాలను, వాటిమీద తేల్తున్న తెల్లని నురగను చూసి సంతోషం పట్టలేక యిసుకలో పొర్లుతూ ఆడుకోసాగేరు.

కళ్యాణికీ కాంతారావుకీ ఆ వాతావరణంలో ఎంతో హాయిగా ఉంది. చుట్టూ ఎంతమంది మనుషులున్నా ఎవరికి వారు తమ ప్రపంచంలో మునిగిపోయి పక్కవారిని గమనించటమే లేదు అందుకే ప్రణయోద్వేగంతో కొన్ని జంటలు ఒకరినొకరు ఒరుచుకుంటూ ఒకరి ఒడిలో ఒకరు తలపెట్టి పడుకుని సమ్మోహితులైపోతుంటే, జీవితంమీద విరక్తిపుట్టి, అనుభవాలమీద అసహ్యం పుట్టిన మరికొందరు నిర్లిప్తంగా కెరటాలపై ముసురుకున్న చీకటిని చూస్తూ తమ అంతరంగ ఘోషను ప్రతిధ్వనిస్తున్న సముద్రపు హోరును వింటూ కూర్చున్నారు ఏమీ ఎరుగని పసిపాపలు ఆనందంతో కేరింతాలు కొడుతుంటే అనుభవాలకోసం అర్రులు చాచే ప్రథమ యౌవనంలోని పడుచులు, బ్రహ్మచారులు ఏదో తెలియని బాధతో వెలితితో ఆ ప్రశాంత వాతావరణంలో అసహనంగా తిరుగుతున్నారు. చీకట్లు క్రమంగా చిక్కబడినయ్! లైట్ల వెలుగుకు దూరంగా కూర్చున్నారు కాంతారావు, కళ్యాణి. కాంతారావు అంతసేపూ కళ్యాణి చెప్తున్న మాటలను పరధ్యాన్నంగా వింటూ 'ఊఁ' కొడుతున్న వాడల్లా బాగా చీకటిపడ్డాక, తమ చుట్టుపక్కల్లో ఎవరూలేరని నిర్ధారించుకుని ఆమెను ఒకసారి దగ్గరకు తీసుకుని ముద్దుపెట్టుకున్నాడు అతని పెదవులకు లిప్‌స్టిక్కు జిగురు అంటుకుంది. వెంటనే 'ఛీ' అంటూ రుమాలుతో తన పెదవులను తుడుచుకున్నాడు.

కళ్యాణి పకపక నవ్వింది.

'ఎందుకలా నవ్వుతావు, సిగ్గులేక ?'

అన్నాడు కోపంగా కాంతారావు.

సిగ్గా! ఎందుకు?' అంటూ ఇంకా విరగబడి నవ్వసాగింది కళ్యాణి.

'ఛీ పాడు రంగులూ నువ్వూను. 'నాచురల్ బ్యూటీ' మనిషిలో ఎప్పుడు ఉండదో మనసులోని తియ్యదనం కూడా అప్పుడే పోతుంది' అన్నాడు.

అతను సీరియస్‌గా ఆ మాటలనే సరికి కళ్యాణి షాక్ తిన్నట్లయి ఒక్కసారిగా నవ్వు నాపేసింది

'ఏమిటి మీరనేది?' అన్నది కొంచెం కటువుగా.

'లేకపోతే పెదవులకా రంగులేమిటి? చూడు నిన్ను ముద్దుపెట్టుకుంటే నీ పెదవుల తియ్యదనం కాదు నాకు లభించింది నీ రంగులజిగురు' అన్నాడు యింకా కోపంతోనే.

కళ్యాణి నిటారుగా లేచి నిలబడింది. 'బిఊటూప్ం వెరీసారీ కాంతం! ఐతే ఒక్క మాట. ముద్దులు పెట్టుకునేందుకు యిది సమయం, స్థలంకాదు. ఆ విషయం గ్రహించక తొందరపడ్డందుకు తప్పునీది. బయటకు వచ్చినపుడు అందంకోసం, పెదవులకు, కావాలంటే యింకా బుగ్గలకీ కూడా నేను రంగువేసుకుంటాను. వాటిని ఊరికే మీరు కళ్లతోచూసి ఆనందించాలే తప్ప సమయా సమయాలు చూడకుండా రుచులకోసం ఎగబడటం నాకేమీ నచ్చలేదు. కావాలంటే యింట్లో ఉన్నప్పుడు నువ్వు ఉండమన్నట్లే సహజంగానే ఉంటాను. కాని యిలా బయిటకు వచ్చినప్పుడు కొంత ఆడంబరం, షోకులు ఆడదానికి తప్పనిసరి అని నా కనిపిస్తోంది. అందుకే నేను అలా అలంకరించుకుంటున్నాను. ఐ కాంట్ హెల్పిట్! యుహేవ్‌టు సింప్లీ ఎక్స్క్యూజుమి ఫరిట్' అంది.

'చాల్లే పద ఇక యింటికి పదు' అన్నాడు కాంతారావుకూడా లేచి.

'మనయిల్లు యిక్కడలేదు హైద్రాబాద్‌లో ఉంది' అన్నది పెంకెగా.

'హైద్రాబాద్‌లో ఉన్నదికూడా అసలు యిల్లుకాదుగా అద్దెకొంపే. కాబట్టి ప్రస్తుతం మనం ఉన్న హోటలునే యిల్లుగా భావించటంలో తప్పేంలేదని నా ఉద్దేశ్యం' అన్నాడు కాంతారావు సీరియస్‌గానే.

కళ్యాణి కిలకిల నవ్వింది. నవ్వకూడదు అనుకుంటూనే కాంతారావు కూడా అప్రయత్నంగా నవ్వేసేడు.

ఇద్దరూ పిల్లలను తీసుకుని హోటలుకు బయల్దేరేరు.

ఆరాత్రి భోజనాలయినాక కళ్యాణి పిల్లలను పడుకోపెట్టి తానుకూడా అక్కడే పడుకుంది.

ఎంతసేపటికీ తన దగ్గరకి రాకపోయే సరికి కాంతారావు ఆమెను మెల్లగా పిలిచేడు

కళ్యాణి నిద్రనటిస్తూ అతని మాటలు వినిపించుకోనే లేదు.

కాంతారావు వచ్చి ఆమె చెయ్యిపట్టుకుని లేపబోయేడు. కళ్యాణి విసురుగా చెయ్యి లాగేసుకుంది 'నేను మీదగ్గరకు రాను పొండి' అంది.

'అర్థరాత్రి ఏమిటా అలుపులు



# పిల్లలతో ప్రేమయాత్ర

మాట్లాడకరా" అన్నాడు కాంతారావు.

'మీరు బీచ్‌లో నన్నెందుకు కోప్పడ్డారు? మీతో నేనసలు మాట్లాడను. మీదగ్గర అంతకన్నా పడుకోను' అంది బెట్టుసరి చేస్తూ కళ్యాణి.

'అబ్బబ్బ! ఆ గొడవలన్నీ యిప్పుడెందుకు చెప్పు? అప్పుడేదో కోపంలో అన్నాను. తప్పయిందిలే! మళ్లీ మనం హదన పెట్టుకున్నామంటే పిల్లలు లేస్తారు.' అన్నాడు బ్రతిమాలే ధోరణిలో.

'అబ్బబ్బ! ఏం మనిషి బాబూ! నిద్ర కాస్తా చెడగొట్టేసేడు' అని తనకేమాత్రం యిష్టంలేనట్టు లేచి అతనివెంట వెళ్లింది కళ్యాణి.

తెల్లవారేక ఉదయమే మహాబలిపురం వెళ్లే బస్సులో కూర్చున్నారు కాంతారావు కుటుంబం. ఆరోజు ఉదయం ఆకాశం మేఘావృతమై ఉండటంవల్ల బస్సు ప్రయాణం ఎంతో ఆహ్లాదకరంగా ఉంది. పిల్లలుకూడా కేరింతాలు కొడుతూ తమ ఆనందాన్ని వ్యక్తపరుస్తుంటే బస్సులో కూర్చున్న మిగతావాళ్లంతా వాళ్లని చిరునవ్వుతో పరికిస్తున్నారు. ఆ బస్సులో ఉన్నవాళ్లందరూ కూడా వాళ్లలాగే టూరిస్టులే! అయితే ఏ ఒకరిద్దరో తప్ప ఎవరూ పిల్లలను వెంట తీసుకురాలేదు. ఆ టూరిస్టులలో కొత్తగా పెళ్లయి, హనీమూన్‌లో ఉన్నట్లు కనబడుతున్న నాలుగు జంటలు, తమలాగే యిద్దరు ముగ్గురు పిల్లలున్నా వాళ్లను యింటివద్ద వదిలేసి ప్రేమయాత్ర సాగిస్తున్న జంటలు మూడు, పిల్లలందరికీ పెళ్లిళ్లు చేసేసి తీరికగా హనీమూన్ జరుపుకుంటున్న వృద్ధుల జంటలు రెండూ, ఉన్నయ్.

వాళ్లంతా మద్రాసునుండి, ఊటీవరకు ప్రయాణం చెయ్యాలని తమలానే ప్లాను వేసుకు వచ్చినట్లు తెలిసింది. మహాబలిపురం దగ్గర బస్సు దిగగానే ఎవరికివారు విడిపోయి రాతిలో పొదగబడిన శిల్పసంపదను చూడటానికి బయల్దేరేరు.'

'ఈ ప్రదేశాలన్నీ వివరంగా చెప్తాను రండి.' అంటూ ఒకగైడ్ తమ దగ్గరకు వచ్చేసరికి 'ఆ వివరాలన్నీ మేము 'బాలరాజు కథ' సినిమాలో చూసేం లేవోయ్! నువ్వేం చెప్పనక్కర్లేదు' అంది కళ్యాణి.

ఆమె వేసిన జోక్‌కి కాంతారావే కాక గైడ్‌కూడా నవ్వేసరికి కళ్యాణికి తన సమయస్ఫూర్తిమీద, సెన్సాఫ్ హ్యూమర్ మీద తనకే ఎంతో నమ్మకం కలిగి గర్వపడింది.

పిల్లలిద్దరినీ వదిలేసి నడవమని, ఆలుమగలిద్దరూ ఒకరిచెయ్యి ఒకరు పట్టుకుని నడుస్తూ వెళ్తుంటే వాళ్లవంకే చూస్తూ నిలబడ్డాడు గైడు కొద్దినిమిషాలపాటు. 'ఇద్దరు పిల్లలు పుట్టినావాళ్లిద్దరూ ఎంత ప్రేమగా ఉన్నారు! అలాటి అదృష్టం అందరికీ ఉండొద్దూ!' అనుకున్నాడు నిట్టూరుస్తూ. అతనిభార్య యిటీవలనే నలుగురు పిల్లలనీ అతనినీ వదిలేసి రౌడీ రంగడితో లేచిపోయింది.

ఒకేశిలతో చెక్కబడిన పంచపాండవుల విగ్రహాలను, ఏనుగునూ మొదలైన విగ్రహాలన్నిటినీ చూస్తుంటే హఠాత్తుగా యీ మహాబలిపురాన్ని కట్టించింది ఎవరా? అన్న ప్రశ్న కలిగింది కళ్యాణికి. 'ఇంతకీ దీనిని కట్టించింది నరసింహవర్మా మహేంద్రవర్మా?' అని అడిగింది భర్తను.

ఆ విషయం కాంతారావుకి కూడా చప్పున గుర్తుకు రాలేదు. కాని ఆ విషయం పైకి చెప్పేందుకు మనసొప్పక 'ఇప్పుడే అంటివికదా గైడ్‌తో—'బాలరాజు కథలోనే' వివరాలన్నీ తెలుసుకున్నానని' అన్నాడు దెప్పి పొడుస్తున్నట్లుగా.

'అసలు నరసింహవర్మ మహేంద్రవర్మ కొడుకా, లేక మహేంద్రవర్మే నరసింహవర్మ కొడుకా? అర్ధం కావటంలేదు నాకు!' తలపట్టుకొంది కళ్యాణి.

ఆమె అలా అనేసరికి కాంతారావుకి కూడా అనుమానం వేసింది. ఐనా ఆడ, మగలో ఏదో ఒకటి నిజం కాకపోతుందా అన్న ధోరణిలో 'మహేంద్రవర్మ కొడుకే నరసింహవర్మ.' అన్నాడు కొంచెం సందేహిస్తూనే.

అతను సందేహించటం గమనించిన కళ్యాణి 'కాదు నరసింహవర్మ కొడుకే మహేంద్రవర్మ' అంది గట్టిగా.

'కావచ్చు' అన్నమాట కాంతారావు కంఠంలోనే ఆగిపోయింది 'పోనీ గైడ్ నడిగి తెలు ఆగాదా తీర్చుకుందామా' అంటే ఆ చుట్టుపక్కలెక్కడా కనపడని లేదు గైడు.

'ఏం లాభం? ఏమ్మే ప్యాసయ్యారు. ఆమాత్రం తెలియదు' అంది మూతి విరుస్తూ కళ్యాణి.

'నేను ఎమ్మే పాసయినా నువ్వు బియ్యే తప్పినా హిస్టరీని మనం చదివింది యిద్దరమూ ఎస్సెల్సీలోనే. ఆ పరీక్షలయిన మర్నాడే చదువుకున్న చరిత్రనంతా మర్చిపోయేం. ఇప్పుడు యిద్దరు పిల్లలను కన్నాక యింకా యేం గుర్తుండి చస్తుంది!' అన్నాడు యిసుకలో కూలబడుతూ కాంతారావు.

కళ్యాణికూడా చేసేదేంలేక అతనిపక్కనే కూలబడింది. 'నరసింహవర్మ కొడుకు మహేంద్రవర్మా, లేక మహేంద్రవర్మ కొడుకు నరసింహవర్మా?' అన్న ప్రశ్నను గురించే తీవ్రంగా ఆలోచిస్తూ.

తరువాత లైట్‌హౌస్ దగ్గరకు వెళ్లి, కొంతదూరం ఎక్కి, యిక నడవలేనంటూ క్రిందికిదిగి వచ్చేసింది కళ్యాణి. కొబ్బరి బొండాలు కొనుక్కొని నీళ్లు తాగేరు. పాపకు ఓ పూసల దండ కొన్నది కళ్యాణి.

సముద్రపు వొడ్డునఉన్న బండరాళ్ల పక్కనే కాసేపునడచి ఆ వాతావరణానికి ముగ్ధుడైన కాంతారావు 'ఐడియా!' అంటూ యీలవేశాడు కాంతారావు.

'ఏమిటా ఐడియా అంటూ' ముందుకు నడుస్తూ వెనక్కితిరిగి భర్తవంక ప్రశ్నార్థకంగా చూసిందికళ్యాణి.

'హారెవా! వండర్‌ఫుల్‌పోజు! జస్ట్ వన్ మినిట్! అలాగే కదలకుండా నిలబడు' అంటూ కెమెరాను 'క్లిక్' మనిపించేడు కాంతారావు.

అతను దగ్గరకు వచ్చేక 'ఏమిటా ఐడియా, చెప్పనేలేదు' అంది కళ్యాణి.

'ఇవ్వాళ రాత్రికి మనిద్దరం ఒంటరిగా అంటే పిల్లలు వెంటలేకుండా యిక్కడకు వద్దాం అన్నాడు.

'ఎందుకు?'

'ఎందుకేమిటి నీ మొహం! ఒక్కసారి ఈ చుట్టూఉన్న వాతావరణాన్ని చూడు. ఎంత బ్యూటీఉందో యిక్కడ. ఇదే వాతావరణాన్ని ఒకసారి వెన్నెలలో ఊహించుకో! వో! ఎంతగొప్ప సౌందర్యమో! ఆ ప్రకృతి సౌందర్యంలో ఒక భాగమైన ఈ సౌందర్య




# ఉతికే బిళ్ల
# డెటర్జెంట్ శక్తితో నిండినది
















**డెట్** డెటర్జెంట్ ఉతికే బిళ్ల

సబ్బు కంటె 50%
ఎక్కువ బట్టలను ఎక్కువ
తెల్లగా ఉతుకుతుంది
—మంచి నీళ్లు లేక ఉప్పు నీళ్లతో

Shilpi HPMA-45/70 Tc

దేవతతో కొంతసేపు ముగడపాలని ఈ భక్తుడి విన్నపం. దేవి అనుగ్రహించినట్లేనా ?' అన్నాడు.

కళ్యాణి మనసు చలించి పోయింది. 'కాంతం ! నువ్వెంత మంచివాడివి !' అన్నది అతని చేతిని తనచేతిలోకి తీసుకుని.

'సారీ! ఆలస్యంగానైనా నా మంచి తనాన్ని గ్రహించేవు థాంక్స్!' అన్నాడు నిష్ఠురంగా ముఖంపెట్టి.

'ఇప్పుడుకాదు ఎప్పుడో గ్రహించేను. నీ మంచితనాన్ని నిర్మలమైన ప్రేమను చూసేకదా నిన్ను చేసుకుంది.' అన్నది ఆర్ద్రమైన కంఠంతో.

ఆమె అలాగనగానే కాంతారావుకూడా వెంటనే సీరియస్‌గా అయిపోయి, ఆమెచేతిని మృదువుగా నొక్కేడు.

'నువ్వు నన్నుచేసుకో లేదమ్మాయ్! నేనే నీమెళ్లో తాళికట్టి పెళ్లి చేసుకున్నాను. నిన్ను నాదాన్ని చేసుకున్నాను.' అన్నాడు ఆమె కళ్లలోకి చూస్తూ. ఆనాలుగు కళ్లూ కొద్ది నిమిషాలపాటు నిశ్చలమైన ప్రేమతో వెలిగి, వెంటనే దృష్టులను మరల్చు కున్నయ్.

కాంతారావు వాళ్లు బసచేసింది బీచ్‌కి దగ్గర్లో ఉన్న ఒక చిన్న హోటల్లో. ఆ హోటలు ఏమంత గొప్పగా లేకపోయినా బీచ్‌కి దగ్గరలో ఉండాలని అదే తీసు కున్నాడు కాంతారావు. పగలు భోజనంచేసి విశ్రమించేరు. సాయంత్రం హోటలు రూము ముందు బాల్కనీలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటుంటే పిల్లలిద్దరూ అలసిపోయేలా ఆడుకున్నారు.

రాత్రి ఏడున్నర అయేసరికి అంతా భోజనాలుచేసేరు. ఎనిమిదింటికల్లా పిల్ల లిద్దరూ గాఢ నిద్రలో మునిగిపోయేరు. వాళ్లు నిద్రపోగానే పక్కమీదనుండి లేచి, యువతలకు వచ్చింది కళ్యాణి. తెల్లటి చీరా, తెల్లజాకెట్టు, మెడలో ముత్యాలహారం, భుజాలమీదకు బరువుగా వేలాడుతున్న మల్లెచెండు, పిల్లలపక్కనే కాసేపు పడుకో వటంవల్ల ఆమెతల కొద్దిగా చెరిగింది. బట్టలు కొంచెం నలిగి ఉన్నాయ్

అప్పుడే కాంతారావు హోటల్లోఉండే ఒక కుర్రాడిని వెంటపెట్టుకుని వచ్చేడు. వస్తూనే రూముముందు వెన్నెల వెలుగులో నిల్చున్న కళ్యాణిని చూస్తూ 'ఎంత



అందంగా ఉంది!' అనుకున్నాడు. కాని పక్కనే కుర్రవాడు ఉండటంవల్ల ఆ మాటను పైకి అనలేదు.

కళ్యాణి కేమిటో భయంగా ఆందోళ నగ ఉంది పిల్లలను విడిచి వెళ్లాలంటే మరోవంక భర్తతో కలిసి యిలాటి సమ యంలో ఒంటరిగా ఆ రాతిగుట్ట దగ్గర సముద్రం ఎదుట కూర్చోవాలన్న కోరిక కూడా ఆమెలో తీవ్రంగానే ఉంది.

'పిల్లలు నిద్రపోతున్నారు చూస్తూండు. మేమిప్పుడే అరగంటలో వచ్చేస్తాం పిల్లలు మంచి నిద్రలో ఉన్నారు. ఇప్పట్లో అయితే లేవరు. ఒకవేళ లేస్తే చిచ్చికొట్టు వెంటనే నిద్రపోతారు.' అని అది ఐదోసారి కాంతారావు కుర్రవాడితో చెప్పటం.

ఆ పిల్లవాడు కూడా 'అలాగేసార్. మీకేం భయంలేదు.' అని ఐదోసారి

## జ్ఞాపకం ఉంచుకోండి!

ప్రతి గిన్నెకీ, వస్తువుకీ, తగిన స్థలం ఉండాలి. లేకుంటే ప్రతిదానికోసం వెతు క్కుంటూనే ఉండాలి.

ఇల్లు శుభ్రంగా లేకుంటే వంటా శుభ్ర ముగా ఉండదు. వండే పొయ్యికూడా చూడ్డా నికి బాగుండాలి. సోడానీళ్ళలో ముంచిన బట్టతో స్టౌలూ, వండే చోటూ తుడిచేస్తే శుభ్రంగా వుంటుంది.

వంటింట్లో చేరే చెత్త ఎప్పటికప్పుడు కాల్చేస్తూ వుండాలి. చెత్తబుట్టలో తడిపి పడేయ కూడదు. కంపుకొట్టడం ప్రారం భిస్తుంది.

ఆహార పదార్థాలు కొనేటప్పుడు శ్రద్ధ అవసరం ఉన్న డబ్బూ. అవసరం చూసుకుని కొంటే బిల్లులు పెరగవు

కొనేటప్పుడు మంచివే కొనుక్కోవాలి. కొంచెంలో కక్కుర్తిపడితే మొదటికే మోసం. తాజావికాని కూరలు, పళ్ళు కొనడం దండుగ.

స్టౌలూ, కుంపట్లూ అవసరం అయితే వెల్గించడం, పనికాగానే ఆర్పడం అలవాటు చేసుకోవాలి.

వంటల్లో మసాలాలు అవసరానికి మించి వాడడం శుద్ధ దండుగ కొద్దిగా వేస్తే వచ్చే సువాసనా, రుచీ ఎక్కువ వేస్తే చెడి పోవచ్చు!

— కె. రా

అతనికి భరోసాయిచ్చి అక్కడే ఉన్న స్టూలుమీద కూర్చుని 'ఇంక మీరు వెళ్లి త్వరగా రండి.' అన్నాడు. కళ్యాణి, కాంతారావు వెళ్లగానే తను అరగంట కూర్చునేందుకుగాను లభించిన రూపాయి నోటు జేబులో ఉన్నదా లేదా అని పదో సారి తడిమి చూసుకున్నాడు.

కాంతారావు కళ్యాణి నడుంచుట్టూ చెయ్యివేసి, ఆమెను మెల్లిగా నడిపించు కుంటూ తాము నిర్దేశించుకున్న ప్రదే శానికి తీసుకుపోయేడు.

చుట్టుపక్కల ఎక్కడా జనసంచారం లేదు. ఎత్తుగా ఉన్న రాళ్ళగుట్ట ఎన్నాళ్ళ నుండో ఒంటరిగా శోషిత భర్త్రుకలా నిర్జీవంగా నిలబడి ఉంది. ఉండుండి సముద్రకెరటాలు వచ్చి, ఆ గుట్టను తాకి వెనక్కి పోతున్నయ్. అలా ఎన్నో సంవత్సరాల తరబడిగా ఆ కెరటాలు స్పృశిస్తున్నా ఏమాత్రం కదలిక లేకుండా నిశ్చలంగా నిలబడి ఉంది ఆ రాతిగుట్ట, దానిదగ్గర ఆ యువదంపతులిద్దరూ ఇసు కలో కూర్చున్నారు భర్త స్పర్శతో పులక రించి పోతోంది ఆమె శరీరం. భర్త కౌగిలింతవల్ల ఆమెను వోపక్క మోహా వేశం ఆవరించుకుంటున్నా, మరోవంక మనసులో పిల్లలను వదిలి వచ్చేమే అన్న ఆరాటంకూడా పీడించ సాగింది.

ఇటు భర్త ప్రేమకు సంతోషించాలో, పిల్లలకోసం పరితపించాలో తెలియక ఉక్కిరి బిక్కిరవుతూ నిస్సత్తువగా యిసుకలో వాలిపోయి పడుకుంది కళ్యాణి.

కాంతారావు ఆమెమీదకు వాలేడు. కళ్యాణి రెండుకళ్ళూ గట్టిగా మూసు కుంది

హఠాత్తుగా 'హే!' అన్న కర్కశమైన కంఠస్వరం వినిపించి, భార్యాభర్త లిద్దరూ చటుక్కున లేచి కూర్చున్నారు. తమ కెదురుగా యమకింకరుల్లా నిలబడిన రెండు నల్లని పెద్దపెద్ద ఆకారాలను చూస్తూనే తాము 'తెలుగు సినిమా యేమీ చూట్టంలేదు కదా!' అనుకుంది కళ్యాణి.

సినిమాల్లోని విలన్‌లలా కనిపించే మనుషులు వాస్తవిక జీవితంలో ఉండటం సంభవమేమోనని ఆమెకు జీవితంలో ఎప్పుడూ స్ఫురించనేలేదు.

అందువల్ల అది కలో, నిజమో తెలి

మని అయోమయావస్థలో కొన్నిక్షణాల పాటు కూర్చుండి పోయింది కళ్యాణి. వెంటనే తేరుకుని కాంతారావు లేచి నిల్చు న్నాడు.

ఆ ఆకారాల్లో ఒకటి లొడలొడమంటూ అరవంలో ఏదో అరచింది. కళ్యాణి, కాంతారావులకు ఆ భాష అర్థంకాక ఒకరిముఖం ఒకరు చూసుకున్నారు. కళ్యాణి లేచి భర్తదగ్గరగా వచ్చి అతని చెయ్యిపట్టుకుని నిలబడింది, ఆ విలన్లు తన భర్తను ఏం చేస్తారోనన్న భయంతో.

వీళ్లనుండి ఎలాటి సమాధానం రాక పోయేసరికి రెండవ ఆకారం మొదటి ఆకారంతో 'తెలుంగు' అంటూ యింకా యేమిటో మాట్లాడింది. దానిని బట్టి వాళ్ళు తాము తెలుగువాళ్లమని గ్రహించేరని తెలుసుకుని కాస్త సంతోషించేరు కళ్యాణి, కాంతారావు.

ఇంతలోకే రెండవ ఆకారం చేతులు రెండూ నడుంమీద పెట్టుకుని రెండడుగులు ముందుకువేసి హుంకరిస్తున్నట్లుగా 'మీరు తెలుగు వాళ్ళా ?' అని అరవ యాసలో అడిగేడు

ఔనన్నట్లు తలూపేడు కాంతారావు.

'ఈ సమయంలో మీరిక్కడెందు కున్నారు?' అంటూ మరో రెండడుగులు ముందుకు వేసేసరికి, కళ్యాణి గజగజ వణికిపోతూ భర్తచేతిని గట్టిగా పట్టుకుని 'ఆగు! దగ్గరకు రాకు!' అంటూ గట్టిగా అరచి వెంటనే స్పృహతప్పి క్రింద పడి పోయింది.

కాంతారావుకి ఆ పరిస్థితులకు ముచ్చె మటలు పోసినయ్. ఐనా ఎలాగో ధైర్యం తెచ్చుకుని కళ్యాణి పక్కనే కూర్చుని 'ఇంతకీ మీరెవరు? ఇలా వచ్చి మమ్మల్ని బెదిరించటంలో మీ ఉద్దేశ్యమేమిటి ? పోలీసులకు చెప్పి మీ అంతు తేలుస్తాను' అన్నాడు.

'అదేమాట మేమూ అంటున్నాం. పద పోలీస్స్టేషనుకు. ఆ అమ్మాయి ఎవరు? ఎందుకు తెసుకొచ్చేవిక్కడకు?' అన్నది ఆ రెండవ ఆకారం.

'ఆ అమ్మాయెవరేమిటి ? నా భార్య' అన్నాడు.

దాంతో పెద్దపెట్టున నవ్వేడు ఆ విలన్. 'హహహ భార్యట భార్య! ఆమె నీ భార్యే అయితే యిలా రాత్రిపూట దొంగ చాటుగా పారిపోవలసిన అవసరమేముంది?' అన్నాడు.

అప్పటికి కాంతారావుకి పరిస్థితి కొంత వరకు అర్థమయింది. తాము భార్యాభర్తలం కాక గూళ్లనుండి పారిపోయిన ప్రేమపక్షులుగా భావించి వీళ్లు తమని బ్లాక్మెయిల్‌వేసి డబ్బు గుంజాదామనుకుంటున్నారని తెలుసుకుని కొంత తేలికగా ఊపిరి పీల్చుకున్నాడు.

'చూడు బాబూ! మేము మీరనుకుంటున్నట్లుగా పారిపోయిన వచ్చిన బాపతు వాళ్ళం కాము. మేమిద్దరం భార్యాభర్తలం. మాకు యిద్దరు పిల్లలుకూడా ఉన్నారు. ఊరు చూట్టానికని వచ్చి ఆ ఎదురుగా కనబడుతున్న హోటల్లో మకాం వేసేం. పిల్లలిద్దర్నీ నిద్రపుచ్చి యేదో కాస్త వెన్నెట్లో కులాసాగా కాలక్షేపం చెయ్యటానికి వచ్చేం. అంతే! అనవసరంగా మీరు శ్రమపడివచ్చి మమ్మల్ని శ్రమ పెట్టేరు. ఇటు చూడండి. నా భార్య స్పృహతప్పి పడిపోయింది. ఇప్పటికైనా దయచేసి వెళ్లండి' అంటూ కాసిని నీళ్ళు తెచ్చి కళ్యాణి ముఖంమీద చల్లేడు కాంతారావు.

ఆ రెండవవాడు మొదటివాడితో అరవంలో యేదో చెప్పేసరికి వాడు కూడా మాట్లాడకుండా ఊరుకున్నాడు. కళ్యాణి కళ్లుతెరచి వాళ్లిద్దరినీ చూసి మళ్లీ భయంతో వణికిపోతూ భర్త నానుకొని కూర్చుంది.

కాంతారావు ఆమెను భయపడవద్దని వారించేడు. వాళ్ళు ప్రమాదకరమైన వ్యక్తులు కారని చెప్పి ఆమె భయాన్ని పోగొట్టేడు. ఆ దృశ్యం చూసి వాళ్లేమను కున్నారో, మాట్లాడకుండా వెళ్లిపోయేరు.

కాంతారావు, కళ్యాణి కూడా హోటలు వైపుకు నడచేరు. దారిలో కాంతారావు కళ్యాణికి వాళ్ళను గురించి వివరంగా చెప్పేడు. 'సాధారణంగా నగరాల్లో ప్రేమ పక్షులిలా సమయం కాని సమయంలో,

చోటుకాని చోటులో ప్రణయకలాపాలు సాగించటంవల్ల అలాటి వాళ్ళను బెదిరించి, ఏదో వదో వసూలు చేస్తారు యిలాటివాళ్ళు. ఒకరకంగా చెప్పాలంటే వీళ్ళు ప్రమాదకరంకాని మనుషులే! వీళ్ళు బెదిరించి డబ్బులు వసూలు చేసేరకం. ప్రాణాలయితే తియ్యరు' అని.

'వాళ్ళు కనుక ఏ దొంగలో నీచులో అయినట్లయితే మన గతి యేమయ్యేది? మన పిల్లలు ఏమయ్యేవాళ్ళు? ఇవ్వాళ మనం లేచిన రోజు మంచిది. మన పిల్లల అదృష్టం బాగుండబట్టి సరిపోయింది. ఇంకా నయం వాడు నా వంటిమీద చెయ్యి వెయ్యలేదు. మిమ్మల్ని తన్ని తగలెయ్యలేదు. ఒకరకంగా చచ్చి బ్రతికాం మనం' అన్నది కళ్యాణి.

వాళ్ళు హోటలుకు వెళ్ళేసరికి కుర్రవాడు స్టూలుమీదనే కూర్చొని గాఢంగా నిద్రపోతున్నాడు. కాంతారావు అతని భుజం తట్టేసరికి ఉలికిపడి, లేచి నిల్చున్నాడు.

'వచ్చేరా సార్? ఇంతాలస్యమయిందే? మీరెంతకూ రాకపోయేసరికి యిప్పుడే కునుకు తీసేను. పిల్లలు మంచిగా నిద్రపోయేరు. లేవనే లేవదు' అని చెప్పి జేబులో రూపాయ నోటు ఉన్నదో లేదో ఒకసారి తడిమి చూసుకుని వెళ్ళిపోయేడు.

గది తలుపు గడియపెట్టి మంచంమీద వాలగానే కళ్యాణి భర్తను బల్లిలా అంటిపెట్టుకుని నిద్రపోయింది భయంతో.

తెల్లవారిన తరువాత మొట్టమొదటగా కళ్యాణికి రాత్రి జరిగిన సంఘటనే గుర్తుకొచ్చింది. ఇంకా గాఢంగా నిద్రపోతున్న పిల్లలిద్దరినీ ముద్దుపెట్టుకుని 'అబ్బ! ఎంత గండం గడచింది!' అన్నది భర్తతో.

కాంతారావు కూడా మనసులో అదే మాట అనుకున్నాడు కాని పైకి అనటానికి మగతనం అడ్డురావటం వల్ల మౌనంగా కూర్చున్నాడు.

'అసలు మనం భార్యాభర్తలం కాదని వాళ్ళకెందుకనుమానం వేసిందో! నామెళ్ళో నల్లపూసలు కూడా కనపడలేదేమిటి వాళ్ళకు!' అని తనలోతాను అనుకుంటున్నట్లుగా అంది కళ్యాణి.

'పెళ్ళయి యిద్దరు పిల్లలు పుట్టిన తరువాత ఏ భార్యాభర్తలూ వెన్నెల్లో ప్రణయ కలాపాలు సాగించరు. అది లోకం రివాజు. మనం అందుకు వ్యతిరేకంగా కనపడటంతో వాళ్ళకు విడ్డూరంగా కనపడి ఉండవచ్చు' అన్నాడు.

'అంటే పెళ్ళయిన తరువాత, భార్యాభర్తల మధ్య ప్రేమ ఉండదేమిటి?'

'ఒకవేళ ఉన్నా కాని, ఎవరూ మరీ యింత వెర్రిగా మనలా ప్రవర్తించరులా ఉంది.'

'దీనికంతటికీ కారణం మీరే! ఎంత ప్రేముంటే మాత్రం పిల్లలు పుట్టిన తరువాతైనా దంపతులు కొంత పెద్దమనిషి తరహాను అలవర్చుకోవాలి. పిల్లల్ని వదిలి 'టింగురంగా' మంటూ బయటకు వెళ్ళినందుకు మనకి మంచి శిక్షే లభించింది. ఇకనైనా బుద్ధి తెచ్చుకోండి. ఇలాటి పిచ్చి పిచ్చి ఆలోచనలెప్పుడూ చెయ్యకండి. మన పిల్లల అదృష్టంకొద్దీ బ్రతికి బయట పడ్డాం' అంది.

ఇంతలో పిల్లలు లేచేసరికి భార్యాభర్తలిద్దరూ కూడా పక్కలమీద నుండి లేచేరు.

ఆ ఉదయమే హోటలు ఖాళీ చేసి మద్రాసు వెళ్ళి, అక్కడ నుండి బస్సులో సాయంత్రానికల్లా బెంగుళూరు చేరుకున్నారు. అప్పటికి కళ్యాణి మానసికంగా, శారీరకంగా కూడా బాగా అలసిపోయింది ప్రయాణం వల్ల. పిల్లలు కూడా వడిలిపోయి ఉన్నారు. కాంతారావు పర్సుకూడా ఖాళీ కాబోతోంది. అందువల్ల త్వరలోనే తను యాత్ర ముగించేయ సంకల్పించుకున్నారు.

'టూరిస్టు బస్సులో కూర్చుని ఒక్క రోజులో ఊరంతా చూసి రావచ్చు. మద్రాసులో మనతోపాటు వచ్చిన వాళ్ళు కూడా అలాగే చూస్తున్నారట' అంది కళ్యాణి. దాంతో కాంతారావు ఆ రాత్రికే టూరిస్టు బస్సుల ఆఫీసుకు వెళ్ళి మర్నాటి ప్రయాణం కోసం సీట్లు రిజర్వు చేయించుకుని వచ్చేడు.

అతను వచ్చేసరికి కళ్యాణి కూడా అలసిపోయి, పిల్లలతోపాటు తాను కూడా నిద్రపోయింది.

భర్త రాగానే తలుపు తీసి మళ్ళీ వెంటనే పక్కమీద వాలి నిద్రపోయింది.

కాంతారావు బట్టలు మార్చుకుంటూ నలిగిన మల్లె చెండులా నిద్ర మత్తులో ఒక విలక్షణమైన అందాన్ని ఒలికిస్తూ ఆదమరచి నిద్రపోతున్న కళ్యాణి వంక రెప్పవాల్చకుండా చూసేడు.

తరువాత లైటు తీసేసి అతను కూడా మంచం మీద పడుకున్నాడు. క్రితం రాత్రి మహాబలిపురంలో జరిగిన భయంకర సంఘటన వల్ల, తెల్లవారగానే పగలల్లా ప్రయాణంలో ఉండటం వల్ల అతను కళ్యాణికి దగ్గరగా ఉండటానికి అవకాశమే కుదరలేదు. అందువల్ల తన పక్కనే మల్లె చెండులా ముడుచుకు పడుకున్న భార్యను మరింతగా నలిపి ఆమెను తన ఎదలో దాచుకుని గాఢంగా నిద్రపోయాడు కాంతారావు.

* * *

టూరిస్టు బస్సు ఏడున్నరకే బస్టాపులో బయలు దేరుతుంది. అందువల్ల కళ్యాణి, కాంతారావు ఉదయం ఆరుగంటలకి బలి

వెంటానే వి[దమేత్త్యమండి, బిగికాగిరి వెచ్చదవామ్మండి, తేరుకుని తేవవలసి వచ్చింది.

లేస్తూనే కాలకృత్యాలు తీర్చుకుని స్నానంచేసి, డ్రెస్సింగు టేబులుముందు కూర్చున్న కళ్యాణి అద్దంలోని తన ప్రతిబింబాన్ని చూసుకుంటూనే అదిరిపడ్డది. 'ఈ కమిలిన బుగ్గలతో, పగిలిన పెదవులతో బయటకు వెళ్ళటం ఎలా? అసలు రోజురోజుకీ మీకు మతిపోతోంది.' అన్నది డ్రెస్ చేసుకుంటున్న భర్త ప్రతిబింబాన్ని అద్దంలో చూస్తూ కోపంగా.

కాంతారావు వెనక్కి తిరిగి అద్దంలోని కళ్యాణి కళ్ళతోకళ్ళు కలిపి కొంటెగా నవ్వేడు.

'హోనోయ్, ఆ మాత్రానికే సిగ్గుపడితే వీలా ? మగవాడినై ఉండి ఆమాత్రం రసికత్వంకూడా చూపకపోతే ఎలా చెప్పు?' అన్నాడు 'టై' సవరించుకుంటూ.

'రసికత్వమా పాడా, మోటుతనం అది' అంది కళ్యాణి బుగ్గలను వేళ్ళతో రాసుకుంటూ.

'రసికత్వమంటేనే మోటుతనం అని అర్థం పిల్లా! రసికతలో ఎప్పుడూ నాజూకుతనం ఉండదు తెలిసిందా?' అంటూ బూట్లు తొడుక్కుని తాళ్ళతో బిగిస్తుంటే కళ్యాణి అద్దంలోనుండే భర్త వంక కొరకొర చూసి, చిరునవ్వును అపుకుంటూ పెదవులను బిగించేసుకుంది. బుగ్గలకు మెల్లగా క్రీమురాసి, మర్దన చేసుకుంటుంటే వెనుకగా వచ్చి ఆమె మెడ మీద ముద్దు పెట్టుకుని, కాంతారావు 'మరే...చందమామకు మచ్చలా, మా కళ్యాణి ముఖానికి యీ మచ్చలు కూడా మరింత అందాన్నిస్తాయిలే. బస్సులోని మిగతా ఆడవాళ్ళు 'ఏమిటమ్మా ఆ మచ్చ ?' అని అడిగితే ? 'ఏం మీకు మొగుళ్ళు లేరా ? మీకుమాత్రం పెళ్ళి కాలేదా ?' అని తీక్షణంగా అడిగేసెయ్. సరేనా ?' అన్నాడు.

కళ్యాణికి వోపక్క భర్తమాటలకు నవ్వొస్తున్నా మరోవంక కోపంగాకూడా ఉంది. అందువల్ల పక్కనే ఉన్న దువ్వెనను తీసుకుని అతని నెత్తిమీద చిన్నగా కొట్టి

'అవతలకు పొండి. నన్నసలు ముట్టుకోవద్దు. నాతో మాట్లాడవద్దు' అన్నది బింకంగా.

ఇంతలో పిల్లలు కూడా లేచేసరికి వాళ్ళను తయారుచేసి తాను కూడా ముస్తాబయింది కళ్యాణి. కంచిలో కొన్న ఎర్రటి పట్టుచీర కట్టుకుని, నుదుట ఎర్రని కుంకుమ పెట్టుకుని, పెదవులకు ఎర్రని లిప్‌స్టిక్కు రాసుకుని, కొప్పులో ఎర్ర గులాబీపువ్వు పెట్టుకుని రూమునుండి బయటకువచ్చిన కళ్యాణి ప్రాతఃకాలపు లేయెండలో మెరిసిపోతూంటే కాంతారావుకు ఆమెను చూట్టానికి రెండుకళ్ళు చాల వనిపించింది. 'బయటకు వచ్చినప్పుడు ఊరికే కళ్ళతోచూసి ఆనందించాలే తప్ప రుచులకోసం ఎగబడటానికి 'పీల్లేదు' అని మద్రాసు బీచ్‌లో కళ్యాణి స్పష్టంగా చెప్పి ఉండటంవల్ల కాంతారావు తన కోరికలన్నిటినీ తన కళ్ళలోనే కురిపిస్తూ ఆమె వంక చూసేడు. కళ్యాణి అతనివి కళ్ళతోనే వెక్కిరించి ముదిరిగింది. ఉదయం బెంగుళూరులో చలిగా ఉండటంవల్ల పిల్లలిద్దరికీ స్వెట్టర్లు వేసింది కళ్యాణి. అందరూ సరిగ్గా ఏడున్నరయేసరికి బస్టాపుకు వెళ్ళి అప్పటికే సిద్ధంగా నిల్చున్న బస్సులోకి వెళ్ళి తమ సీట్లలో కూర్చున్నారు.

(ఇంకా ఉంది)

# జీవిత పరిమితి



బులుసు వెంకటరమణయ్య. ధర్మపథం

మానవులు స్థిరంగా వుండే నిర్మాణాలు చేసేటప్పుడు తాము శాశ్వతంగా ఉండి సుఖాలను అనుభవిస్తామనే పెద్ద ఆశతో ఉంటారు. ఆ ఆశతోనే ఎంతో శ్రమపడి తమ సుఖంకోసం తగిన ఏర్పాట్లు చేసుకుంటారు. కాని, జీవితంలో వారు సౌఖ్యాన్ని అనుభవించేకాలం ఎంతో స్వల్పంగానే ఉంటుంది.

మన జీవితం అతిజాగ్రత్తగా సాగించినా నూరేళ్ళు జీవించేవారు కోటికొక్కరైనా ఉంటారో ఉండరో? ఉంటారనే అనుకుందాం. ఆ నూరేళ్ళ ప్రమాణంలోనూ సగంకాలం రాత్రిళ్ళలో గడిచిపోతుంది. ఆ సగంగా ఉండే ఉపయుక్తకాలంలోనూ సగం ఏమీ తెలియని బాల్యంతోనూ, శక్తిలేని ముసలితనంతోనూ గడిచిపోతుంది. ఆ మిగిలినకాలంలోను కొంత రోగాలతోనూ, బంధుమిత్రాదుల వియోగాది దుఃఖాలతోనూ గడుస్తుంది. కొంతకాలం జీవనోపాధికోసం ఇతరులను సేవించడంతో తీరిపోతుంది.

ఈ విధంగా లెక్కవేసి చూస్తే మానవులు సుఖపడడానికి వుండేకాలం వ్యత్యాతి స్వల్పం. మానవజీవితమో నీటితరంగం వలెనే మిక్కిలి చంచలమై వుంటుంది. ఇట్టి స్థితిలో సుఖానికి అవకాశంవుండడం ఎంతో అరుదు. ఈ విషయం ఈ శ్లోకం వల్ల తెలుస్తుంది.

'ఆయుర్వర్ష శతం నృణాం పరిమితం
 రాత్రౌ తదర్ధం గతం
తస్యార్ధస్య పరస్య చార్ధమపరం
 బాలత్వ వృద్ధత్వయోః,
శేషం వ్యాధివియోగ దుఃఖసహితం
 సేవాదిభి ర్నీయతే
జీవే నారి తరంగ చంచలతరే
 సౌఖ్యం కుతః ప్రాణినామ్?'

అందువల్ల అత్యంత స్వల్పంగా మన ఆధీనంలో ఉన్న కాలాన్ని స్వార్థదృష్టితో పెట్టుకోకుండా సద్వినియోగం చెయ్యడానికి యత్నించడం ఎంతో ఉత్తమం.




'బావా!...

ఇన్నేళ్లతరువాత నేనిలా ఉత్తరం వ్రాస్తానని నువ్ కలలో కూడా ఊహించి వుండవు! కానీ వ్రాయాలని నేను చాలా కాలంగా అనుకుంటున్నాను ... అయితే నువ్వెక్కడున్నదీ ఎంత ప్రయత్నించినా తెలియలేదు...నిన్ను ప్రమోషన్ మీద హైదరాబాదు వేసినట్లు—ఈమధ్య పేపర్లో చదివాను!... మనస్ఫూర్తిగా ప్రేమించినా —నిన్ను పెళ్లిచేసుకోలేని నా దౌర్భాగ్యానికి ఇంతకాలం చింతించినా—ఈనాటికి నువ్ ఎక్కడ వుంటున్నదీ తెలుసుకోగలగటమే —నా అదృష్టంగా భావించి—ఈ వుత్తరం వ్రాస్తున్నాను!'

..ఈపాటికి ఈ రాధ నెవరో పూర్తిగా మరచిపోయుంటావనుకుంటాను ...కానీ...రాజా! నేను మాత్రం నిన్ను మరచిపోలేక పోతున్నాను ... ఏ ఆడదైనా ఒక్కరికే మనసివ్వగలదనే సత్యం — సత్య దూరం కాదని తెలుసుకున్నాను బావా! నిన్ను తలచుకోనిరోజు లేదంటే అతిశయోక్తి కాదేమో!'

'...నేను ఏదో త్యాగం చేయాలనుకొని నా జీవితంలో నిప్పులు పోసుకున్నాను... నేను పూర్తిగా ఓడిపోయాను బావా? కానీ నువ్వయినా ఉన్నతమైన స్థితిలోకి వచ్చి—భార్యా బిడ్డలతో హాయిగా వున్నావని అనుకుంటూ — అప్పుడప్పుడు తృప్తి పడుతూంటాను!... ఈ జీవితానికి ఆ అదృష్టం చాలంటావా?...

'...నీ చల్లని/ఒడిలో తలదాచుకొని— కరువుతీరా కన్నీరుకార్చి — నీ ఔదార్య మాటలతో—నన్ను నేను శాంతింప చేసుకోవాలనుకుంటున్నాను...నాకోసం ఒక్కసారి ఢిల్లీ రాగలవా బావా?...

'...మరచి పోయాను! నీతోబాటు అక్కనూ పిల్లల్నీ కూడా తీసుకొస్తే— చూడాలని నా మనసు ఉవ్విళ్లూరుతోంది...

నీ రాకకై ఎదురు చూస్తూంటాను...

నీ

రాధ'

ఉత్తరం చదువుతూంటే నా హృదయం బరువెక్కిపోయింది...ఆనాడు రాధ కనుక కొంచెం తెగువ చేసివుంటే—మా యిద్దరి బ్రతుకులూ—మరోలా సాగేవేమో?...

భౌతికంగా—సంఘంలో ఉన్నత మయిన స్థితికి వచ్చినా—మానసికంగా—నేనుకూడా ఓడిపోయాను...ఈ భయంకరమైన నిజం రాధకు తెలియదు...తెలుసుకొని రాధ చేయగలిగిందేమీ లేదుకూడా!

నాలో ఎందుకో — ఒక్కసారి రాధను చూడాలనే బలమైన కోరిక తీవ్రరూపం దాల్చింది...చాలాకాలంగా ఆమెను చూడాలని నేనూ ప్రయత్నించాను...కానీ వీలుపడలేదు ...ఒకసారి మా బంధువు ఒకాయన కనిపించి 'రాధ ఢిల్లీలో వుంటోంది'ని చెబితే—ఒకనెల రోజులకు ఎలాగో వీలు చేసుకొని అక్కడకు వెళ్లాను...అప్పటికి వారంరోజులక్రితమే వాళ్లు 'బిలాసపూర్' వెళ్లిపోయారని తెలిసింది!... ఆ తరువాత

నాకు అక్కడకు వెళ్ళటానికి తీరికే దొరకలేదు...

రాధనుండి వచ్చిన ఉత్తరం చూడగానే నా మనస్సు ఆమెను చూడాలని ఉరకలు వేసింది...మరొక్కక్షణం కూడా ఆలస్యం చేయకూడదనుకొని 'ఎయిర్ పోర్ట్'కు 'ఫోన్' చేసి—ఢిల్లీకి టిక్కట్టు 'రిజర్వ్' చేయించుకున్నాను...

* * *

'ఎయిర్ పోర్ట్'నుండి విమానం బయల్దేరింది. ప్రయాణీకు లందరితోబాటూ నేనూ 'బెల్ఫ్‌బెల్ట్' నడుంచుట్టూ కట్టుకున్నాను. కాలం గడుస్తున్నకొద్దీ నాలో ఆరాటం ఎక్కువ కాసాగింది.

రాధ ఎలావుందో ఇప్పుడు ?

'నీ జడ నల్లత్రాచులా వుంటుంది రాధా!'— అని అస్తమానూ నేను అంటూంటే — రాధ పొంగిపోయేది...నేను వాళ్లింటికి వెడితేచాలు — నా ఎదురుగా కూర్చొని ఎన్నెన్నో కబుర్లు చెప్పేది...

'రాధా! నీకు నిలువుబొట్టు అందంగా వుండదు...చక్కగా గుండ్రని బొట్టు పెట్టుకోకూడదూ ?'— అన్నాను ఒకసారి ఆమె నిలువుబొట్టును ఆక్షేపిస్తూ...

ఆతరువాత రాధ నిలువుబొట్టు పెట్టుకోవటం నాకు తెలియదు!

మరోసారి—తన పుట్టినరోజున, తలంటు పోసుకొని కొత్తచీర కట్టుకొని మా యింటికి వచ్చింది...మా అమ్మ వంటింట్లోకి వెళ్ళగా చూసి—అక్కడే కుర్చీలో కూర్చొని పత్రిక చదువుతున్న నా దగ్గరగా వచ్చి—వంగి నా పాదాలకు నమస్కరించింది...

'ఆదేమిటి రాధా?' అన్నాను అర్థం కాక.

'ఇవాళ నా పుట్టినరోజు బావా! నువ్ కాబోయే భర్తవు కదా! నన్ను ఆశీర్వదిస్తావని...' అంది తల వంచుకొనే.

మనసులోనే రాధను మనసారా ఆశీర్వదించాను.

ఆ సంవత్సరమే నేను బి. ఏ. పరీక్ష ప్యాసవటం — వో ప్రయివేటు కంపెనీలో సుమాస్తాగా చేరటం జరిగింది.

'మీ పెళ్ళికి ముహూర్తం పెట్టించమని మామయ్యను అడిగి వస్తాను'—అంది అమ్మ ఒక రోజున.

నేనూ ఆ రోజుకోసమే ఎదురుచూశాను.

నేను పుట్టిన మూడవ ఏటనే మా తండ్రిగారు కాలం చేస్తే—అప్పటినుండీ—మాకున్న మూడెకరాల మాగాణిమీద వచ్చే రాబడితో—జాగ్రత్తగా సంసారాన్ని ఈదుకొస్తూ—అమ్మ నన్ను కళ్ళల్లో పెట్టుకొని పెంచి పెద్దచేసింది. చదువుచెప్పించి సంఘంలో నన్నొక వ్యక్తిగా నిలబెట్టింది. ఉన్న ఒక్కగానొక్క కొడుక్కి పెళ్ళి చేసి—అటువంటి పెద్ద వయస్సులో—కోడలుచేత సేవలు చేయించుకుంటూ—మనవలతో కాలక్షేపం చేయాలని ఏ తల్లి మాత్రం అనుకోదు ?

అందుకే అమ్మ మామయ్యగారింటికి వెళ్ళింది. మామయ్య కూడా అప్పుడు ఆ వూళ్ళోనే వుండేవాడు అత్తవారి వైపు నుండి వచ్చిన ఆస్థితో వడ్డీ వ్యాపారం చేస్తూ—అదృష్టం బాగుండి ఆ వూరి పంచాయతీకి చైర్మన్ కూడా అయ్యాడు. రాధ ఒక్కతే సంతానం కనుక — ఆమెను గారంతో పెంచి పెద్దచేసి—చదువు చెప్పించాడు.

''రాధని రాజశేఖరానికి ఇవ్వలేనుచెల్లాయ్ వెనక బోలెడంత ఆస్థి—అంతకు మించిన హెూదా వున్నవాని కిచ్చి పెళ్ళి చేయాలని నా సంకల్పం. నాకు మగ పిల్లాడయినా—ఆడపిల్లయినా రాధ ఒక్కతే గదా !... దాని సుఖం కోరుకోవటంలో తండ్రిగా—నా స్వార్థముందంటావా చెల్లాయ్ ?' — అని అమ్మని ప్రశ్నించాడు మామయ్య...

మామయ్య మాటలకు అమ్మ నిశ్చేష్టురాలయింది...కొన్ని క్షణాలకు తేరుకొని—

'ఇప్పుడు రాజాకి మాత్రం ఏం లోటొచ్చిందీ అన్నయ్యా? బి. ఎ. ప్యాసయి ఉద్యోగంలో కూడా చేరాడు ! ఇక ఆస్తిపాస్తులంటావా ? రేపు వాడు మాత్రం సంపాదించడా ? అయినా గుణం ప్రధానం కానీ డబ్బు ఏం చేస్తుందీ?... వాడికి రాధంటే ప్రాణం అన్నయ్యా !'— అన్నది...

'నిజమే చెల్లాయ్! నేను కాదనను... రాధను చేసుకునే హక్కు మేనల్లునిగా—రాజశేఖరానికి ఉన్నదన్న యదార్థాన్ని నేను మరచిపోలేదు...కానీ రాధ భవిష్యత్తు గురించి నేను కన్నకలలు వేరు చెల్లాయ్! అది వో పెద్దింటికి కోడలిగా వెళ్ళాలి! అడుగులకు మడుగులొత్తే పనివాళ్ళుండాలి! కారులో షికార్లకు తీసుకవెళ్ళే హెూదాకల భర్తకావాలి !...

'ఒంటరి బ్రతుకులూ — గుమాస్తా జీతాలూ—ఇంటెడు చాకిరీ—ఇవ్వన్నీ నాకు ఇష్టం వుండవు చెల్లాయ్! నా బాధ అర్థం చేసుకో! నేను అంతకన్నా ఎక్కువగా చెప్పలేను!... అలా అని రాజశేఖరమంటే నాకు దురభిప్రాయముందని మాత్రం అనుకోకు !'— అంటూ అక్కడ నుంచి వెళ్ళిపోయాడు మామయ్య...

ఇంటికి వచ్చిన అమ్మ ఈ విషయమంతా చెప్పి-కళ్ల నీళ్ళు పెట్టుకొంది ...ఒకరక్తం పంచుకొని పుట్టిన అన్నా చెల్లెళ్ల మధ్య వుండే అనురాగాలింతేనా అనుకున్నాను ... మామయ్య ప్రవర్తన నాలోని అభిమానాన్ని రెచ్చగొట్టింది...

కానీ రాధ ?

రాధను నేను ప్రేమించాను...

ఆమె మరొకరి అర్థాంగిగా వెళ్ళిపోతుందనే ఊహ కలిగితే చాలు—నాలోని నరనరాలూ కృంగిపోతాయి !

ఆ మర్నాడే రాధను కలుసుకున్నాను...

'నీ నిర్ణయం కూడా అంతేనా రాధా?' అని అడిగాను...

ఆమె బదులు చెప్పలేదు...కానీ ఆమె కళ్లలో నీరు మెరవటం నేను చూశాను...

''బావా! నన్ను మరచిపోలేవా ?'- అని అడిగింది రాధ కొన్నిక్షణాల తరువాత.

'అయితే నన్ను మరచి నువ్ ఉండగలవన్నమాట !' అన్నాను కొంచెం ఉద్రేకంతో...

'ఉండాలని ప్రయత్నిస్తాను బావా! కాలమే సమస్యల్ని పరిష్కరిస్తుందంటారు! కొన్నాళ్ళు బాధగానే వుంటుంది. నాకూ ఒక సంసారమూ, పిల్లలూ—అంటూ ఏర్పడితే — నిన్ను మరచిపోవటం కష్టం కాదేమో?' మన వయస్సు పాలపొంగు లాంటిది బావా! ఎవరూ గమనించకపోతే పాలు పొంగి పొర్లిపోతాయి. కాదని కాసిని నీటి చుక్కలు చల్లితే చప్పున చల్లబడిపోతాయి.'

రాధ మాటలు నాకు వింతగా తోచాయి.

'నీమీద నేను ఎన్నో ఆశలు పెట్టుకున్నాను రాధా!'

'నామీద నాన్నగారు కూడా కొండంత ఆశ పెట్టుకున్నారు బావా! నీవు తోడు లేనిదే నే నుండలేనని నాకు తెలుసు. కానీ ఈ జన్మ ఇచ్చిన పెద్దవాళ్ళ ఆశలు తీర్చ

...లో వున్న త్యాగం- స్వార్థంతో వాళ్ళకి అన్యాయం చేయటంలో లేదనుకుంటాను!'

'హు! త్యాగం! స్వార్థం! అంత పెద్ద మాట లెందుకులే రాధా! ఏది స్వార్థమో ఏది త్యాగమో నాకు బాగా తెలుసు!... వస్తాను!' అంటూ ఆమె ఏదో చెప్పబో తున్నా వినిపించుకోకుండా అక్కడి నుండి ఇంటికి వచ్చేశాను.

'ఏమిటి సార్! పాలం ఎయిర్‌పోర్ట్‌లో విమానం దిగి చాలా సేపయింది. మీరింకా ఆలోచిస్తూనే కూర్చున్నారు' — అంటూ నా దగ్గరగా వచ్చి పలకరించింది 'ఎయిర్ హోస్టెస్'. నేను ఆలోచనల నుండి తేరుకొని నా సూట్‌కేసు తీసుకొని విమానం దిగాను...రాధ ఇచ్చిన చిరునామా చూసుకొని టాక్సీని పిలిచాను.

* * *

మరో అర గంటకు రాధ ఇంటిముందు టాక్సీ ఆగింది. అదొక చిన్న డాబా. చుట్టూ సువిశాలమైన కాంపౌండు! గేటు తీసుకొని లోపలకు అడుగు పెట్టాను. తోట మాలి కాబోలు, గులాబీ మొక్కలకు నీరు పెడుతున్నాడు. రాధకి గులాబీ పువ్వులంటే ప్రాణం! అందుకే ననుకుంటాను తోట నిండా గులాబీ మొక్కల్ని నాటించింది. అంతలోనే తోటమాలి నా దగ్గరకు వచ్చి 'ఎవరు కావాలి బాబూ?' — అని ప్రశ్నించాడు.

'రాధమ్మగార్ని చూడాలి!' అన్నాను.

'హాలులోనే కూర్చున్నారు వెళ్ళండి బాబూ!'— అంటూ మళ్ళీ తనపనిలో లీనమై పోయాడు తోటమాలి...

హాలులో మధ్యన నాలుగు సోఫాలు అమర్చి వున్నాయి ... వాటిమధ్యన వున్న 'రోజవుడ్ టీపాయ్' మీద 'ఫ్లవర్ వేజ్' అందంగా కనిపిస్తోంది. సోఫాలో కూర్చొని ఏదో 'లేసు' అల్లుతోంది రాధ...

'రాధా!'— పిలిచాను...

ఆమె తలఎత్తి చూసింది...ఆ పెను బాధగానే నా కాళ్ళ కింద నేల కరిగి పోతున్నట్లనిపించింది...

'బావా! నువ్వా?... నాకు తెలుసు నువే వస్తావని!... రా బావా!' అంటూ గబగబా నాదగ్గరకు వచ్చి నాచేయి పట్టుకొని తీసుకెళ్ళి సోఫాలో కూర్చో బెట్టింది. ప్రక్కనే వున్న 'ఫ్రిజ్' లోంచి

# పాతజీవితానికో...

బత్తాయిరసం తీసి — గ్లాసులో పోసి యిచ్చి—నా కెదురుగావున్న కుర్చీలో కూర్చొంది...అంతవరకూ ఆమె ప్రతి చర్యనూ గమనించటం తప్ప ఏమీ మాటాడ లేక పోయాను...

ఇన్నేళ్ళకు నన్ను చూసిన సంతోషంలో కాబోలు—ఆమె కళ్ళు ఆనందంతో వర్షిస్తూంటే — దాచుకోవాలని విశ్వ ప్రయత్నం చేసింది...

'నిన్ను ఇలా చూడవలసి వస్తుందను కోలేదు రాధా!'— అన్నాను.

రాధ మాట్లాడలేదు...

'ఈ ఘోరం ఎప్పుడు జరిగింది రాధా?'— అని అడిగాను మళ్ళీ...

'అప్పుడే పదేళ్ళు కావస్తోంది బావా! 'హార్ట్ ఎటాక్' వచ్చి పోయారు...నా జీవితంలో—నాకన్నీ ఎదురుదెబ్బలే తగిలాయి బావా!... నేను ఇంకా ఎలా బ్రతికి వున్నానా అనిపిస్తుంది అప్పుడప్పుడు—' అంటూ కళ్ళనీరు పెట్టుకొంది రాధ ...

'ఊరుకో రాధా!'— అన్నాను ఎలా ఓదార్చాలో తెలియక...

'ఇంతకీ అక్కని — పిల్లల్ని — తీసుక రాలేదా?'— అని ప్రశ్నించింది — మరి కొన్ని క్షణాలకు కళ్ళు ఒత్తుకుంటూ...

'ఒకర్ని ప్రేమించి మరొకరితో కాపురం చేయగల ధైర్యం నీకయితే వుంది కాని— నేనాపని చేయలేక పోయాను...నేను పిరికి వాణ్ణి రాధా!'— అని ఆమెవైపు చూశాను...

రాధ ఒక్కసారిగా త్రుళ్ళిపడింది.

'అయితే నువ్ అసలు పెళ్ళి చేసుకో లేదా?'

'ఎలా చేసుకుంటా ననుకున్నావ్? ఒక నాడు నా సర్వస్వం నువ్వే నమకొని — నిన్ను భార్యగా ఊహించుకున్నాను. ఆ స్థానంలోకి మరొకర్ని తీసుకొచ్చి—ఆమెను ఎలా సుఖపెట్టగలను రాధా?... అందుకే నేను పెళ్ళి చేసుకోలేదు.'

'నువ్వంటున్నది నిజమేనా బావా? ఇన్నాళ్ళూ నాకు నేనే మోసం చేసుకున్నానని అనుకున్నాను. నావల్ల నువ్ కూడా మోస పోయావన్న మాట! ఇలా జరుగుతుం దను కోలేదు బావా!'—అంటూ తల వంచుకొంది రాధ.

మా యిద్దరి మధ్యా కొన్ని క్షణాలు మౌనంగా దొర్లిపోయాయి.

'ఇంతకీ నీ పిల్లలు కనిపించరేం?' అని ప్రశ్నించాను—నిశ్శబ్దాన్ని భరించలేక.

'బహువచనం వద్దులే! పుట్టింది ఇద్దరయినా—నాకు మిగిలింది ఒక్కడే! నీ పేరే పెట్టాను వాడికి...రాజశేఖరం! ... ఇక్కడ 'లీడింగ్' డాక్టరు!' ఇంకా పెళ్ళి చేయాలి. ఏదో కాన్ఫరెన్సంటూ కలకత్తా వెళ్ళాడు. నాలుగు రోజుల్లో వస్తాడు...'

రాధ అలా మాట్లాడుతూంటే—ఆమె ముఖంలోకి చూస్తూ వుండిపోయాను... వయసు పెరిగినా—మనసు పెరగని రాధ నామీది మమతను త్రుంచుకొనలేక — తన కొడుక్కి నా పేరు పెట్టుకొంది.

'ఏం బావా? అలా చూస్తున్నావ్?

## ఓం నమః శివాయ

కం. వనిత వృద్ధనై వహింపనన్న
వాత్సాతుర్యతతో వర్ధిల్లు నేను
కొంటిన్
విపరీత వ్యంగ్య విమర్శన
పిచికలో విసిగి వేసారితి వికలనై.

కం. వుందు గ్గైకొందు నీ సేవన్
వ్రాహాలోకమే స్థాపింతు స్థిరము
గన్
వృషభుడే దీవ్వంచున్
వ్రాధాకాంక్షె పనొల్ల, నటరాజా.

కం. ఖేదుకొ్రందు, వెంబడింతు నిన్నే
వేకువ జామునవే సేతు నీ జపము
వైరివిగాదు, ధురంధరా
వొకరినివేడ, ఎవరిని పొగడ నీ
వుండగన్.

కం. వోర్తు, నేర్తు, చేకూర్తు
హాసేనా పఠింతు, భజింతు, భువన
గిరిసే
వందన సహా నము లర్పింతు
పః వహా విశ్వసృష్టికర్తస్వయంభూ
ంభుడే.

—రచయిత్రి : శ్రీమతి సరస్వతిగిరి

గుండ్రని బొట్టు నా ముఖానికి అందం తెస్తుందనేవాడివి!...ఆ అందం నా నుంచి శాశ్వతంగా దూరమయి పోయిందని ఆలో చిస్తున్నావా?' – అన్న రాధ మాటలకు ఉలిక్కిపడ్డాను.

'లే బావా! అలసిపోయినట్లున్నావ్ !... స్నానం చేసి వస్తే భోజనం చేద్దాం...' అంటూ లేచింది రాధ.

నేను భోజనం చేస్తున్నంతసేపూ — మాచిన్నప్పటి సంఘటనలు గుర్తుచేస్తూనే వుంది.

'నన్ను పెళ్ళి చేసుకొని వుంటే నువ్వింత అభివృద్ధిలోకి వచ్చేవాడివి కాదు బావా!' అంది రాధ అన్నం వడ్డిస్తూ.

'కావచ్చు! నేను భౌతికంగా ఇంత అభివృద్ధిలోకి వచ్చినా—మానసికంగా పతనమై పోయాను రాధా! దానికి కారణం నువ్వేనని నాకు తెలిసినా—ఆ తప్పు – నన్ను పుట్టించిన దేవుడిమీదకు త్రోసేసి – తృప్తి పడుతూంటాను అప్పుడప్పుడు!'

'నిజమే బావా! నన్ను క్షమించు'–రాధ కళ్ళలో నీరు చిప్పిలటం నేను గమనిస్తూనే వున్నాను.

రాధ మళ్ళీ అంది...

'నేను అనుకొన్న దొకటయితే మరొకటి జరిగింది. ప్రపంచంలో ఎంతమంది ప్రేమించుకుంటున్నారు. కానీ అందులో కొందరే పెళ్ళి చేసుకునే అదృష్టాన్ని పొందగలుగుతున్నారు. మిగిలినవాళ్ళు తమ ప్రేమ విఫలమయిందని జీవితాంతం కుమిలి పోతూ తమ బ్రతుకుల్లో నిప్పులు పోసుకుంటున్నా రంటావా బావా? ప్రేమించిన వారిని పెళ్లి చేసుకునే అవకాశం లేని ఎంతమంది మరొకరితో హాయిగా జీవించటం లేదు?...

'...అందుకే నిన్ను ఎంతగానో ప్రేమించిన నేను—నాన్నగారి కోరికమీద మరొకరి అర్ధాంగినయ్యాను. నన్ను అల్లారుముద్దుగా పెంచి పెద్దచేసి — నా సుఖ సంతోషాలు కోరుకున్న తల్లిదండ్రుల కోరిక తీర్చటం కోసం ఆనాడు మన ప్రేమను త్యాగం చేశాను బావా!...కాల ప్రవాహంతోబాటు – తీయని మన వలపుల తలపులు కూడా కొట్టుకపోతాయనుకున్నాను ...

'...కానీ...నేను మోసపోయాను బావా! పూర్తిగా మోసపోయాను. వారి సాన్నిధ్యంలో వుండే అనుక్షణమూ నాకు నువ్వే జ్ఞాపకానికి వచ్చేవాడివి! భార్యగా ఆయనను సుఖపెట్టలేకా—మనస్ఫూర్తిగా ప్రేమించిన నిన్ను మరచిపోలేకా – అడుగడుగునా నేను నరక యాతన అనుభవించేదాన్ని ... పవిత్రమయిన ప్రేమ విలువ ఏమిటో నాకు తెలిసింది బావా!'–రాధ చెప్పటం మాని కన్నీరు తుడుచుకుంది...'

'ఇవాళ తృప్తిగా భోజనం చేశాను రాధా– నా జీవితానికి ఇవాళ నిండుతనం వచ్చినట్లు 'ఫీల'వుతున్నాను'—భోజనం ముగించిన తరువాత హాలులోకి వచ్చి అక్కడ సోఫాలో కూర్చుంటూ అన్నాను.

'ఎవరో ఒకర్ని పెళ్లిచేసుకొని వుంటే ప్రతిరోజూ తృప్తిగానే తినేవాడివేమో ?' —అంది రాధ చిన్నగా నవ్వుతూ...

'ఏమో రాధా ! మొదట నాకా ఉద్దేశ్యమే కలగలేదు...తరువాత కొన్నాళ్లు అవకాశం దొరకలేదు...మరి కొంతకాలానికి అవసరంకూడా లేకుండా పోయింది. ఇక ఇప్పుడంటావా ?... రేపో మాపో 'రిటైర్' అయిపోవటాన్కి సిద్ధంగా వున్నాను...నాకు పిల్ల నెవరిస్తారు చెప్పు ?'— అన్నాను నేనుకూడా నవ్వుతూ !

ఈసారి రాధ బదులు చెప్పలేదు !

'ఆనాడు మామయ్య అమ్మదగ్గర అన్న మాటలు నాలోని అభిమానాన్ని రెచ్చగొట్టాయి రాధా!... విటువంటి అంతస్తూ—హోదా–గలవాణ్నే తెచ్చి నీకు చేయాలను కున్నాడో—అంతకు మించిన ఐశ్వర్యాన్ని పొందాలని నిశ్చయించుకొని— అహోరాత్రాలూ–అందుకు కృషిచేశాను...

'ఒక మిత్రుని సహాయంతో ఎమ్మే పరీక్ష కట్టాను...అది ప్యాసయిన తరువాత 'ఐఎయస్'కి కూడా వెళ్లాను.

'...అప్పట్లో అమ్మ—పెళ్లిచేసుకోమని పోరు పెడితే—రెండు మూడు సంబంధాలు చూశాను...పందెంలో లక్ష రూపాయలు పోగొట్టుకున్నవానికి ఒకరూపాయి దొరికితే ఏం తృప్తిపడగలడు ?... నా పరిస్థితి కూడా సరిగ్గా అలాగే అయింది. నన్ను ప్రేమించి, నీకు మనసిచ్చిన నేను మరొకర్ని ఆ దృష్టితో చూడలేక పోయాను... పెళ్లి చేసుకున్నా—ఆమెను సుఖపెట



లేక—అన్యాయం చేసినవాణ్ణి అవుతానను తున్నాను...

'...ఆ తరువాత కొన్ని సంవత్సరాలకే అమ్మకూడా—నన్ను వదిలి వెళ్ళిపోయింది! ...నేను ఏకాకిని !... ఉద్యోగరీత్యా చాలా ప్రదేశాలు తిరిగాను...పెద్ద పెద్ద వాళ్ళంతా నాకు స్నేహితులు! ఉన్న బాధల్ని మరచి పోవటాన్కి—వాళ్ళతో కలిసి — లేని అల వాట్లు నేర్చుకున్నాను...ఎటువంటి సుఖా న్నయినా డబ్బుతో పొందవచ్చనీ—ఎంతటి సంతోషాన్నయినా—బజారులో కొనవచ్చనీ తెలుసుకున్నాను...అందుకే పెళ్లి చేసుకునే అవకాశం—అవసరం—నాకు కలగలేదు'— అన్నాను నేను...

'చాలు బావా! ఇంక చెప్పకు...నీ పత నానికి కారణం నేననే ఊహ నాలో కలగ నివ్వకు! అది నేను భరించలేను'—అంటూ గబగబా—తన గదిలోకి వెళ్ళిపోయింది రాధ...

రాత్రి తెల్లవార్లూ ఆమె గదిలో దీపం వెలుగుతూనే వుంది...మధ్య మధ్య—ఆమె ఏడుస్తున్నట్లు—సన్నని వెక్కిళ్ళు కూడా

# పాతజీవితానికో...

వినిపించాయి...కానీ ఆమెను ఓదార్చే శక్తి లేదు నాకు!

* * *

ఒక రాత్రివేళ ఏదో చల్లని స్పర్శ తగిలి—మెలకువ వచ్చి చూశాను! నా కాళ్ళదగ్గర రాధ కూర్చొనివుంది... ప్రక్కనేవున్న 'బెడ్‌స్విచ్' నొక్కాను... తెల్లని వెలుతురు గదంతా పరచుకుంది...

రాధకళ్ళు ఎర్రగా—వాచిపోయి వున్నాయి

'ఏమిటి రాధా! ఏడుస్తున్నావా ?'—నా ప్రశ్న ఆమెను ఓదార్చటానికి బదులు —మరింత క్రుంగదీసింది...హటాత్తుగా వచ్చి—నా గుండెలమీద వాలిపోయి చిన్న పిల్లలా ఏడ్చింది.

ఓదార్చటానికి నా గొంతునుంచి మాట పైకి రాలేదు...నా పరిస్థితి కూడా దాదాపు అలాగే వుంది...

'తెల్లవారేవరకూ నీ చల్లని ఒడిలో ఇలా తలదాచుకొని కన్నీరు ఇంకి పోయేలా నన్ను ఏడ్వనీయ్ బావా'— అంది రాధ...




'ఊరుకో రాధా! మరీ చిన్నపిల్లలాగా ఏమిటిది ?'— ఎలాగో గొంతు పెగల్చు కొని అన్నాను...

'నాకు ఓ సహాయం చేయగలవా బావా?' —లేచి కళ్ళు తుడుచుకొని—ఒక నిర్ణయా నికి వచ్చినదానిలా—ప్రశ్నించింది...

'నామీద నీకా నమ్మకం లేదా రాధా?'

'ఉంది బావా! అందుకే అడుగు తున్నాను...నన్ను నీతో తీసుకపో!'

రాధా!'...నేను అదిరిపడ్డాను...

'నిజమే బావా! నేను నీతో వచ్చే స్తాను! ఒకనాడు ప్రేమించిన ప్రియురాలి గానూ—నీ యింటికి యిల్లాలిగానూ కాదు! కేవలం ఒక స్నేహితురాలిగా నీ సన్నిధిలో నా కింత చోటివ్వు బావా! నువ్వుకూడా పెద్ద వాడివై పోయావు! ఈ వయసులో నీకు సేవ చేయటానికి— ఎలాగా— ఒక మనిషి కావాలి ... ఈ సేవ నేను చేస్తాను! ... మనిద్దరం ఒకరికి ఒకరుగా — ఈ ఆఖరి రోజుల్ని గడుపుదాం...

'...ఒకనాడు నేను చేసిన త్యాగం నీ జీవితాన్ని నాశనం చేసింది... ఈనాడు మళ్లీ నేను చేస్తున్న ఈ త్యాగం నాకు మనశ్శాంతి నిస్తుంది ... ఈ అవకాశాన్ని నాకు ప్రసాదించు బావా!'— రాధ మాటలు చాలా దృఢంగానూ నిశ్చయంగానూ వున్నాయి.

నాకు మాత్రం అంతకన్నా కావలసిన దేముంటుంది? అందుకే రాధతో అన్నాను—

'బ్రతుకుబాటలో నేనొక దారితప్పిన ప్రయాణికుడ్ని రాధా! నా పాత జీవి తానికి— ఓ మంచి మలుపు ప్రసాదిస్తానని నువ్వంటే కాదంటానా? పతనమయిపోతున్న నా బ్రతుక్కి వ్యక్తిత్వాన్ని ప్రసాదించు రాధా'— అన్నాను ఆమెను గట్టిగా నా హృదయానికి హత్తుకుంటూ...

* * *

ఆ తరువాత నాలుగురోజులకే నే మిద్దరం ఎక్కిన విమానం హైదరాబాదు వైపు ఎగిరింది. ●

# వారఫలం

**28.1.1972 శుక్రవారం మొదలు 5.2.1972 గురువారం వరకు**

**మేషం:** అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి. వారం మధ్యలో వృత్తివ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి.

స్త్రీలకు:— బంధు మిత్రులను కల్సుకొంటారు. విలాస వస్తువులు కొంటారు.

**వృషభం:** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. సామాన్యమైన పనులకుకూడా మీరు యెంతో కృషి చేయవలసి వస్తుంది.

స్త్రీలకు:— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. పుణ్య కార్యాలు చేస్తారు

**మిధునం.** మీ ఆలోచనలు లాభదాయకంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. సాహసములో కూడిన వ్యవహారాలు లాభించగలవు. వృత్తిలో పోటీవారి పోటీ తగ్గుతుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సంతోష కరమైన వార్తలను వింటారు.

**కర్కాటకం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు బాగుంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. విద్యా వైజ్ఞానిక రంగాలో మీకృషి రాణించ గలదు. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి

స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. శుభ కార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**సింహం:** కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసంచేయడానికి ప్రయత్నిస్తారు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. మీ తాలూకు వస్తువులు పోవచ్చును వారం మధ్యలో అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు:— అధిక వ్యయం జరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. సాహిత్య కళారంగాల్లో మీకృషి రాణించగలదు. వారం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది అలంకార వస్తువులు కొంటారు.

**తుల** అధికారుల వలన జరుగ వలసిన వ్యవహారాలు బాగా ఉంటాయి. స్థిరాస్తి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది మీ ఆలోచనలు ప్రయోజన కరంగా ఉంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**వృశ్చికం:** వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది నూతన విషయాలను తెల్సుకొంటారు. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. మీకంటే పెద్దవారుకూడా మీ సహకారాన్ని కోరవలసి వస్తుంది

స్త్రీలకు:— సంతోషకరమైన వార్తలను వింటారు. ప్రయాణాలోచనలు చేస్తారు.

**ధనుస్సు** కొన్ని వ్యవహారాల్లో అనవసరమైన శ్రమ కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాలల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మకరం** ప్రయత్నించిన ప్రతి పనీ సుఖవుగా నెరవేరుతుంది రావలసిన డబ్బు సమయానికి అందగలదు. పోటీవారిలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో వ్యతిరేక పరిస్థితి యేర్పడుతుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. అనుకూలమైన వార్తలను వింటారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. మీ ఆలోచనలు ఫలిస్తాయి

**కుంభం** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు శ్రమమీద నెరవేరతాయి. పోటీవారితో వాద ప్రతివాదాలు తగవు. అకారణంగా సందేహాలు కలుగుతాయి. ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు. ప్రయాణాలోచనలు చేస్తారు

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్య కార్యాలు చేస్తారు

**మీనం.** మీకు మున్ముందు లాభించగల వ్యవహారాలక్కి అభివృద్ధిని సాధించగలరు వృత్తిలో ఆదాయం బాగుంటుంది. మిత్రుల సహాయం లభిస్తుంది రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. సాంఘిక కార్యక్రమాలకు ఆహ్వానాలు వస్తాయి

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

—మహేష్



'మానవుడు—దానవుడు'లో శోభన్‌బాబు. గుర్తించి కృష్ణకుమారికి శారద చెప్పున్నది ఏమిటి?

# సినిమా

## ప్రతిస్త్రీ కోరుకునేదేమిటి?

✱ డాక్టర్ వేణుని, రాధ ప్రేమించి, తండ్రిని ధిక్కరించి, పెండ్లిచేసుకుంది. వారిరువురి దాంపత్యజీవితం నిత్యనూతనంగా వుంటూ, నవవసంతాలను కురిపిస్తూ వుంది.

భర్త విస్సహాయంగావుండి, తన చేత అన్నిపనులు చేయించుకుంటే, భార్యకు అంతకుమించిన ఆనందం వుండదట భర్త ప్రతియిల్లాలికీ తీరని పాపాయట. భర్తను పాపాయిగా లాలించాలని, బుజ్జగించాలని, తన ఒడిలో నిద్రపుచ్చాలని ప్రతి వనిత కోరుకుంటుందట ఇలాంటి అనురాగానుబంధాలను ప్రతిబింబించే చక్కటి కుటుంబ గాధాచిత్రమే ఉషశ్రీవారి 'మానవుడు — దానవుడు.'



'అమ్మమాట'లో అత్యాచారం! సత్యనారాయణ వాణిశ్రీ.

## విభిన్న దృక్పధాలు!

భార్యగా శారద, భర్తగా శోభన్ నిజ దంపతులా అనిపించేంత సహజంగా రాధ వేణు పాత్రలను పోషిస్తున్నారట. శోభన్



'అబ్బాయిగారు—అమ్మాయిగారు'లో, వాణిశ్రీ.

రెండు విభిన్నదృక్పధాలు కలిగిన పాత్రలను పోషించే యీ చిత్రానికి ఉషశ్రీ కథకుడు పి చంద్రశేఖరరెడ్డి దర్శకత్వంలో సర్వాంగసుందరంగా తయారవుతున్న 'మానవుడు–దానవుడు చిత్రానికి మోదుకూరి జాన్సన్ మాటలను, అశ్వత్థామ సంగీతాన్ని, సుకదేవ్ ఛాయను నిర్వహిస్తున్నారు. ప్రధానపాత్రలను సత్యనారాయణ, రాజబాబు, ముక్కామల, అర్జా జనార్దనరావు, జయకుమారి, జ్యోతిలక్ష్మి, మీనకుమారి పోషిస్తున్నారు. పి. చిన్నప

రెడ్డి నిర్మించే యీ సంచలనాత్మక చిత్రానికి అనిల్ ప్రభాస్ పంపిణీదారులు. నవయుగ విడుదల.

## జాతిపితకి అంకితంచేస్తున్న చిత్రం

పత్రికా రచయిత వాశిరాజు ప్రకాశం, ఒంగోలు వ్యాపారస్తుడు బి. హనుమంతరావులు కలిసి స్థాపించిన చిత్రనిర్మాణ సంస్థయే మమతా ప్రొడక్షన్స్. ఈ చిత్రా



'అత్తను దిద్దిన కోడలు'లో ఒకదృశ్యం. గుమ్మడి, ఎస్ వరలక్ష్మి.

నికి కె. విశ్వనాథ్ స్క్రీన్ ప్లే, దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు.

## మంచి, చెడ్డలే మతాలు

'భూమిపైవున్న జాతులు రెండే ఆడ, మగ అంటారు వాటిని మంచి, చెడ్డలను రెండు మతాలుగా పరిగణించవచ్చు కుల మతభేదాలన్నవి మానవుడు తన అవకాశం, అవసరాల ననుసరించి యేర్పరచుకున్న నీటి తెరలు మాత్రమే ఆ తెరలు మానవతకు మమతకు అడ్డుగోడలు కాకూడదు ఈ పరమసత్యాన్ని ప్రబోధించే ప్రయోగాత్మక



'నీతి నిజాయితీ' కోసం కృష్ణంరాజుని ప్రాధేయపడుతున్న కాంచన.

చిత్రమే మమతా ప్రొడక్షన్స్‌వారి మొదటి చిత్రం.

పై చిత్రంలో శోభన్‌బాబు, ఎస్వీ రంగారావు, చంద్రమోహన్, అల్లు రామలింగయ్య, సాక్షి రంగారావు, శారద, అంజలీదేవి. సూర్యకాంతం, గీతాంజలి ముఖ్యపాత్రధారులు. సంగీతాన్ని రాజేశ్వరావు, కళను కళాధర్, సంభాషణలను బొల్లిముంత, ఛాయను అశోక్‌కుమార్ నిర్వహిస్తున్నారు. ఫిబ్రవరి 9న షూటింగు ప్రారంభమవుతుంది. ఈ చిత్రాన్ని పూజ్య బాపూజీ, జాతిపితగాంధీకి అంకితం చేస్తారట.

అశోక్‌కుమార్‌కి ఫిలిమ్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఇండియావారి బంగారు పతకం, 1970లో కేరళప్రభుత్వ పుత్తమ ఛాయాగ్రాహక బహుమానం వచ్చివున్నాయి. ఈ ఛాయాగ్రాహకునికి మంచి భవిష్యత్తువుంది.

## విధి బలీయం

ఆజానుభాహుడు, గంభీరవదనుడు ఆసూరి శ్రీనివాసరావు, ముగ్ధమోహన రూపంతో భాసిల్లే గౌరిని సమీపించాడు. 'గౌరీ'



చిత్రం—బీగలపాట్లు నటీనటులు విజయలలిత, చంద్రమోహన్.

## సినిమా

అన్నారు. ఆమె మెల్లగా వచ్చి అతని ముందు నిలబడింది. (ఏమిటండీ ? అని ప్రశ్నార్థకంగా చూసింది)

'విధి ఎంత బలవత్తరమైనదో, అనుభవించినవాడిని నేను. నాతోపాటు మిగిలిన వారు కూడా ఎందుకు యీ సుడిగుండంలో చిక్కిపోవాలి ?' అన్నాడు, శ్రీనివాసరావు. 'అవును గౌరీ. ఒక పవిత్రాశయం కోసం భగవంతుడు మనని కలిపాడేమో, అందులో నేను కేవలం పూజారిని. శాసించే యజమానిని కాదు. ఎవరికో చెందిన పూల చెట్టుకి కొన్నాళ్ళు నీళ్ళుపోసి పెంచాను దానిమీద హక్కున్న వ్యక్తి యీనాడు తిరిగి వచ్చాడు దానిని అతని కప్పచెప్పటం నా విధి గౌరీ' అన్నాడు శ్రీనివాసరావు

గౌరీ తన మాంగల్యం చూపించి 'యీ మంగళసూత్రం మీరు కట్టారు ఆ హక్కు మీది. నేను మీదాన్ని' అంది. జాలిగా నవ్వాడు శ్రీనివాసరావు.

'గౌరీ, అన్నింటినీ నడిపే సూత్రధారుడు ఆపైన వున్నాడు. ఆ సూత్రానికి నిన్ను శాశ్వతంగా బంధించి, ఆ సూత్రధారుడికి ఏమని సమాధానం చెప్పను. నువ్వు, అమర్ కలిసి సుఖంగా వుండండి.' అన్నాడు శ్రీనివాసరావు. గౌరీ నిశ్చేష్టురాలైంది 'మీరేనా యీ మాటలు అంటున్నది ఈ కుంకుమను మీరు దిద్దారు. నేను మీ భార్యను ఆ స్థానాన్ని నాకిచ్చి, మీ పాదాల దగ్గరే పోనివ్వండి' అంటూ చర చరా వెళ్ళిపోయింది గౌరి.

పై సన్నివేశం మాధవి ఆర్ట్స్ ప్రొడక్షన్స్ వారి 'వంశోద్ధారకుడు'లో కనిపిస్తుంది అమర్‌గా శోభన్, శ్రీనివాసరావుగా ఎస్వీరంగారావు, గౌరిగా కాంచన నటిస్తున్న యీ చిత్రానికి పి. సాంబశివరావు దర్శకుడు మాటలను నంది, సంగీతాన్ని ఘంటసాల, ఛాయను స్వామి కూర్పును గోపాలరావు, సహదర్శకత్వాన్ని జి సి శేఖర్ నిర్వహిస్తున్నారు. ఎ ఎస్ ఆర్. ఆంజనేయులు నిర్మించే 'వంశోద్ధారకుడు' త్వరలో లక్ష్మీ ఫిలింస్ ద్వారా విడుదలవుతుంది. ఈ చిత్రంలో దర్శకుడు కె ఎస్. ప్రకాశరావు,



'సంపూర్ణరామాయణం'లో సీతగా చంద్రకళ

నటి అంజలీదేవి దంపతులుగా నటించడం ఒక ప్రత్యేకత.

## తల్లికి తీసిపోని విధంగా నటించిన తనయుడు !

విజయలక్ష్మీ మూవీస్ నిర్మించిన 'అమ్మ మాట' ఫిబ్రవరిలో అనిల్ ప్రభావ్ ద్వారా విడుదలవుతుంది. భమిడిపాటి కథ, మాటలను వ్రాసిన యీ చిత్రానికి రమేష్ నాయుడు సంగీతం పెద్ద ఎస్సెట్ అనే చెప్పాలి మాతృత్వంయొక్క మహిమను శాంత స్వభావాన్ని, ఓర్పును చిత్రించిన చక్కటి కుటుంబగాథా చిత్రమే 'అమ్మ మాట'

మాతృమూర్తిగా సావిత్రి అద్భుతంగా నటించింది. ఆమె మాటకు కట్టుపడిన కుమారుడిగా శోభన్‌బాబు తల్లికి తనేమీ తీసిపోని విధంగా నటించాడు. నాయికగా వాణిశ్రీ అందంగా, హుషారుగా కనిపించి ఆ పాత్రకు తనయితేనే న్యాయం చెయ్యగలదనే భావాన్ని కలిగిస్తుంది క్లిష్టమైన పాత్రలను నాగభూషణం, అల్లు రామలింగయ్య ప్రతిభావంతంగా నిర్వహించారు.

## సినిమా డైరీ

- కౌముదీ ఆర్ట్ పిక్చర్స్ నిర్మించనున్న సాంఘికానికి కె ఎస్ ప్రకాశరావు దర్శకుడు
- సూర్యచిత్రవారి ప్రొడక్షన్ నెం 2లో జమున నాయికగా నటిస్తుంది శ్రీరామ్ దర్శకుడు.
- రామవిజేత వారి సాంఘిక చిత్రానికి భమిడిపాటి రచయిత కె బాబురావు దర్శకుడు
- మహేశ్వరి పిక్చర్స్‌వారి క్రయిమ్‌థ్రిల్లర్‌కి కృష్ణ నాయకుడు చంద్రకళ నాయిక విజయ్ దర్శకుడు
- మమత ప్రొడక్షన్స్ వారి మొదటి చిత్రానికి కె. విశ్వనాథ్ దర్శకుడు. ఎస్ రాజేశ్వరరావు సంగీత దర్శకుడు
- చలనచిత్ర నిర్మించిన 'మహమ్మద్ బిన్ తుగ్లక్' ఫిబ్రవరి 11 న విజయా కంబైన్స్ ద్వారా విడుదలవుతుంది. బి వి ప్రసాద్ దర్శకుడు
- శ్రీ వెంకటేశ్వరా ఆర్ట్ పిక్చర్స్ వారి 'మంచివాళ్లకు మంచివాడు' అవుట్‌డోర్ షూటింగు ఫిబ్రవరి 5 నుండి 15 వరకు ఉదయపూర్‌లో జరుగుతుంది కె ఎస్ ఆర్ దాస్ దర్శకుడు.
- విఠలాచార్య నిర్మించిన 'బీదలపాట్లు' మార్చి 24న అన్నపూర్ణా ద్వారా విడుదలవుతుంది బి. విఠలాచార్య, అక్కినేని కాంబినేషన్‌లో తయారయిన మొదటి చిత్రం యిదే
- శ్రీ లక్ష్మీ ప్రొడక్షన్స్‌వారి 'పాపం పసివాడు' షూటింగు జనవరి 26 నుండి ఫిబ్రవరి 3 వరకు జరుగుతుంది నటవర్గం అంతా పాల్గొన్నారు వి రామచంద్రరావు దర్శకుడు.
- అన్నపూర్ణా ఆర్ట్ పిక్చర్స్ వారి 'ప్రొడక్షన్ నెం 2' షూటింగు జనవరి 22 నుండి 31 వరకు సారథిలో జరిగింది తారాగణమంతా పాల్గొన్నారు ఆదుర్తి సుబ్బారావు దర్శకుడు
- డి. బి. ఎన్ ప్రొడక్షన్స్ 'అబ్బాయిగారు—అమ్మాయిగారు' షూటింగు జనవరి 18 నుండి 25 వరకు వాహినీలో జరిగింది ముఖ్యనటులందరూ పాల్గొన్నారు. వి రామచంద్రరావు దర్శకుడు
- రవిశంకర్ పిక్చర్స్‌వారి మొదటిచిత్రానికి 'మేనకోడలు' అని పేరు పెట్టారు. బి. ఎస్. నారాయణ దర్శకుడు

వి. బి. రాజేంద్రప్రసాద్, లక్ష్మీఫిలింస్ అధినేతలు తమ చిత్రంయొక్క సంవత్సరాది పండుగకి వచ్చే మొత్తం డబ్బును దేశరక్షణనిధికి యిచ్చారు. నటి సావిత్రి ముఖ్యమంత్రికి వేసిన ఒక పూలమాలను 32 వేలకు కొని, రక్షణనిధికి యివ్వడం అభినందనీయం. అలాగే జమున తన చిత్ర ఆదాయంలో 10 శాతం యివ్వడం హర్షనీయం. మన తెలుగు నటీనటులు, నిర్మాత దర్శకులు యితోధికంగా 'దేశరక్షణనిధి'కి సహాయపడి, మానవత్వంవున్న మనుష్యులు అని నిరూపించుకున్నారు.

## విశ్వాసాన్ని చూరగొన్న సంస్థ

ప్రజల విశ్వాసానికి పాత్రమయిన కొద్ది సంస్థల్లో అన్నపూర్ణా సంస్థ ఒకటి. ఉత్తమ కథలని ఎన్నుకుని, వున్నత ప్రమాణాల్లో నిర్మించే తాహతు, దుక్కిపాటి



ప్రేమనగర్ శతదినోత్సవ సభలో శ్రీ జైహింద్ సత్యం తన షీల్డును వేలం వేసి ఆ సొమ్మును రక్షణనిధికి యివ్వవలసిందిగా కోరారు. ఆ సందర్భంలో హిందీనటుడు శ్రీ ప్రాణ్ ఆ షీల్డ్‌ను రు 7000లకు పాడి గెలుచుకున్నారు. ముఖ్యమంత్రి శ్రీ కరుణానిధి శ్రీ ప్రాణ్ శ్రీ జైహింద్ సత్యంలను ఈ స్టిల్‌లో చూడవచ్చు



'భార్యాబిడ్డలు'లో నాగేశ్వరరావు, జయలలిత.

సహాయ భూమికలను సత్యనారాయణ, రాజబాబు, లీలారాణి, సుజాత ధరించారు. ఈ చిత్రానికి వి. రామచంద్రరావు దర్శకత్వాన్ని, కన్నప్ప ఛాయను, వాలి కళను, ప్రకాశం కూర్పును చేపట్టారు. వ్యాపారదక్షత, వ్యవహారదక్షత తెలిసిన జి వి ఎస్ రాజాకు 'అమ్మ మాట' ఆశించిన ఫలితాన్ని యిచ్చి తీరుతుంది.

## శ్రీలక్ష్మీ కళామందిర్ వారి పద్మవ్యూహం

వలన చిత్ర పరిశ్రమలో సంచలనం

# సినిమా

రేకెత్తించిన సంస్థ లక్ష్మీ కళా మందిర్. ఈ చిత్ర సంస్థ 'సినిమాకథ' పోటీని నిర్వహించింది. ఈ పోటీలో అనేక మంది పాల్గొన్నారు. కథను చదివి అనేక పేర్లను సూచించారు. అలా సూచించిన వారిలో ఆర్. విజయలక్ష్మి ఒకరు. ఈమె ఆ కథకి 'పద్మవ్యూహం' పేరు సరయినదని సూచించారు. మద్రాసులోని పెరంబూరు వాస్తవ్యురాలయిన విజయలక్ష్మికి వెయ్యిన్నూట పదహార్లు యివ్వడానికి, కథకు ఉత్తమ ముగింపు సూచించిన కె సత్యానందం గారికి వెయ్యిన్నూటపదహార్లు అందచెయ్యడానికి పై సంస్థ నిర్ణయించింది. బహుమతి ప్రదానం ఫిబ్రవరి 20న కాకినాడ స్థానిక పేలస్ థియేటరు ఆవరణలో జిల్లా కలెక్టర్ యల్. మాలకొండయ్య అధ్యక్షతన జరుగుతుంది. ప్రగతిశీల అభిప్రాయాలతో సమీకరించబడిన సమస్యాత్మక సంచలన సాంఘిక చిత్రమే 'పద్మవ్యూహం.'



'పిల్లా? పిడుగా'లో హెలెన్ నృత్యం

## మేలో ప్రారంభం అక్టోబరులో విడుదల

మే నెల చివరన షూటింగు ప్రారంభించబడి అక్టోబరులో చిత్రాన్ని విడుదల చెయ్యాలని యీ చిత్రం (పద్మవ్యూహం) యొక్క రచయిత, దర్శకుడు తోట రామమోహనరావు సంకల్పించారు. సినిమా రంగంతో రెండు దశాబ్దాల పరిచయం వుండి, పరిస్థితులు అనుకూలించక కొంత



'శభాష్ వదినా'లో కె. ఆర్. విజయకి హరనాథ్ చెప్పిన మాట వినకూడనిదా?

# సినిమా

ఎవర్‌గ్రీన్ దర్శకుడు పి. పుల్లయ్య తమ శక్తిని, అనుభవాన్ని వినియోగిస్తున్నారట. శ్రీఫిలింస్ విడుదల.

## మంచివాళ్లకు మంచివాడు

'మోసగాళ్లకు మోసగాడు'గా దర్శకు మెచ్చి, ప్రేక్షకులను మెప్పించి, పరిశ్రమలో సంచలనాన్ని రేకెత్తించిన హీరో కృష్ణ త్వరలోనే 'మంచివాళ్లకు మంచివాడు'గా సాక్షాత్కరించ బోతున్నారు. శ్రీ వెంకటేశ్వర ఆర్ట్ పిక్చర్స్ పతాకంకింద పూర్తి రంగుల చిత్రంగా తయారయ్యే యీ చిత్రం యొక్క ఇన్‌డోర్ షూటింగు పూర్తయింది ఎస్. భావనారాయణ నిర్మించే యీ చిత్రానికి కె. ఎస్. ఆర్ దాస్ దర్శకుడు.

## ఉదయపూర్‌లో అవుట్‌డోర్

ఉదయపూర్ లొకేషన్స్‌లో అవుట్‌డోర్ షూటింగు నిమిత్తం శ్రీ వెంకటేశ్వర పిక్చర్స్ యూనిట్ దాదాపు 110 మంది బయల్దేరుతున్నారు ఫిబ్రవరి 5 నుండి పదిరోజులుపాటు సాగే యీ షెడ్యూలుతో షూటింగు దాదాపు పూర్తయినట్టే. ఈ చిత్రంలో ప్రకృతి రమణీయకతతో విలసిల్లే సుందర ప్రదేశాలను (అవుట్‌డోర్) చిత్రీకరిస్తారు.

టైటిల్‌పాత్రను కృష్ణ, అతగాడి జంటగా విజయనిర్మల నటిస్తున్న 'మంచివాళ్లకు మంచివాడు' చిత్రానికి వి. ఎస్. ఆర్. స్వామి ఛాయను, సత్యం సంగీతాన్ని, గోపాలరావు కూర్పును, రామలింగం కళను, వెంకన్నబాబు ప్రొడక్షన్ను నిర్వహిస్తున్నారు ముఖ్యపాత్రలను నాగేష్, ప్రభాకరరెడ్డి, సత్యనారాయణ, జగ్గారావు, ఆనందమోహన్, సాక్షి రంగారావు, రావుగోపాలరావు, షబ్నమ్, హలం, విజయశ్రీ, ఉడవల్లి రమ, మాస్టర్ రాము ధరిస్తున్నారు. ఈ చిత్రం 'మోసగాళ్లకు మోసగాడు' వలె భారీఎత్తున నిర్మించబడుతూంది. హీరో కృష్ణ సమర్పించే మరొక సంచలనాత్మక చిత్రమే 'మంచివాళ్లకు మంచివాడు.'

## మహమ్మద్ బిన్ తుగ్లక్!

సత్యాన్ని, నీతిని అణగద్రొక్కి, అసత్యం, అవినీతి స్వైరవిహారం చేస్తున్న కలియుగంలో 'మహమ్మద్ బిన్ తుగ్లక్' సరయిన గుణపాఠాన్ని నేర్పగలదని కథాంశాన్ని బట్టి చెప్పవచ్చు. చలనచిత్ర నిర్మించిన యీ చిత్రంలో క్యారెక్టరు నటుడు నాగభూషణం తుగ్లక్ పాత్రను పోషించారు. పదునైన సంభాషణలు, మధురాతి మధురమైన పాటలు, మనోహరమైన నృత్యాలు యీ చిత్రంలోని ప్రత్యేక ఆకర్షణలు.



'కిలాడీ బుల్లోడు' శోభన్‌బాబు జ్యోతిలక్ష్మికి భయపడటమా!

## ఫిబ్రవరి 11 న విడుదల

ప్రముఖ తమిళ హాస్యనటుడు, రచయిత, జర్నలిస్టు అయిన చో రూపొందించిన యీ కథకు దాసరి నారాయణరావు మాటలను పొందుపరిచారు. 'మట్టిలో మాణిక్యం' ఫేమ్ బి వి ప్రసాద్ దర్శకత్వంలో సర్వజనరంజకంగా తయారవుతున్న యీ చిత్రానికి ఎస్. హనుమంతరావు సంగీతాన్ని, సంజీవిమోహన్ను ఛాయను, కందస్వామి కూర్పును, ఏ బి. ఎల్ ప్రసాద్ నిర్మాణ నిర్వహణ బాధ్యతను గమనిస్తున్నారు. వి జగన్నా



'కన్నతల్లి'లో ప్రభాకరరెడ్డి, సావిత్రి. 'అసలు సమస్య ఏమిటో?'



'రిక్షా రాముడు'లో
ఎం. జి. రామచంద్రన్, మంజుల.

హనరావు నిర్మించే యీ చిత్రం విజయ కంబైన్స్‌ద్వారా ఆంధ్రాలో, బలరాం పిక్చర్స్‌ద్వారా సీడెడ్‌లో, శ్రీ వెంకటేశ్వరా మూవీస్ ద్వారా నైజాంలో విడుదలవుతుంది. ఈ చిత్రంలోని ముఖ్యపాత్రలను కృష్ణంరాజు, నాగయ్య, అల్లు రామలింగయ్య, రాజబాబు, రామ్మోహన్, ధూళిపాళ, ముక్కామల, మాధవపెద్ది సత్యం, పి. వెంకటేశ్వరరావు, పెమ్మసాని రామకృష్ణ, జగ్గారావు, జమున, కృష్ణకుమారి, హేమలత, జూనియర్ శ్రీరంజని, ఛాయాదేవి, బుష్పేంద్రమణి ఈ చిత్రంలో నటిస్తున్నారు.

రావికొండలరావు, కె. వి. చలం, రమేష్, కోళ్లసత్యం, రామచంద్రరావు, పి. హెచ్. కృష్ణమూర్తి, బలరాం, రమాప్రభ, సంధ్యారాణి. ఛాయాదేవి, లీలారాణి, సుకుమారి, సచ్చు, జయకుమారి పోషించారు. ఈ చిత్రం ఫిబ్రవరి 11 న విడుదలవుతుంది. నేపథ్యగాయకుడు బాలసుబ్రమణ్యం ఒక దృశ్యంలో కనిపిస్తాడీ చిత్రంలో. నేటి కలుషిత వాతావరణంలో 'తుగ్లక్'లాంటి చిత్రం కనువిప్పు కలుగించవచ్చు.

## సంపూర్ణ రామాయణము

బాపు దర్శకత్వంలో విడుమర్తి పద్మాక్షి నిర్మిస్తున్న లక్ష్మీ ఎంటర్ ప్రైజెస్‌వారి ఈస్ట్‌మన్ కలర్ చిత్రం 'సంపూర్ణ రామాయణము'లో దృశ్యాలెన్నో రంపచోడవరం అడవిప్రాంతంలో కొండలతో, సెలయేళ్ళతో, పచ్చికబీళ్ళతో సహజమైన వర్ణ దృశ్యాల్తో కూడిన రమణీయమైన ప్రకృతిలో చిత్రీకరించారు. మహర్షి వాల్మీకి రామాయణంలో చిత్రించినట్టు ప్రత్యేకంగా ఆశ్రమాల్ని నిర్మించి సహజసుందరమైన ప్రశాంత వాతావరణాన్ని కల్పించటం జరిగింది. శబరి ఆశ్రమం, గుహుడిగూడెం, మారీచ ఆశ్రమం, వేదవతీ ఆశ్రమం, పంచవటి పర్ణశాలలను వ్యయప్రయాసలతో నిర్మించి, వేదవతి కథ, మారీచుని వృత్తాంతం, సీత మాయలేడిని కోరటం లక్ష్మణరేఖ, సీతాపహరణం ఘట్టాలను చిత్రీకరించారు. దేవులపల్లి కలం చిలికిన శబరిపాట, కొసరాజు వ్రాసిన గుహుడిపాట, సి నారాయణరెడ్డి రచించిన శూర్పణఖ పాటలుగూడా మనోహరంగా చిత్రీకరించబడ్డాయి. ఇంతటితో సంపూర్ణ రామాయణం చిత్రనిర్మాణం దాదాపు పూర్తయింది.

ఈ కార్యక్రమంలో శోభన్ బాబు, చంద్రకళ, ఎస్వీ రంగారావు, నాగరాజు, అర్జా జనార్దనరావు, పండరీబాయి, జయకుమారి పాల్గొన్నారు. సీతుగారి గుమ్మడి, నాగయ్య, చంద్రమోహన్, ధూళిపాళ, మిక్కిలినేని, సత్యనారాయణ, ముక్కామల, మాధవపెద్ది సత్యం, పి. వెంకటేశ్వరరావు, పెమ్మసాని రామకృష్ణ, జగ్గారావు, జమున, కృష్ణకుమారి, హేమలత, జూనియర్ శ్రీరంజని, ఛాయాదేవి, బుష్పేంద్రమణి ఈ చిత్రంలో నటిస్తున్నారు.

ఆరుద్ర, ముళ్ళపూడి వెంకటరమణ రచన చేసిన ఈ చిత్రానికి డా. సి. నారాయణరెడ్డి దేవులపల్లి, కొసరాజు, ఆరుద్ర, దాశరధి పాటలు వ్రాస్తున్నారు. పద్యాలు గబ్బిట వెంకటరావు రచించారు. కె. వి. మహదేవన్ సంగీతాన్ని సమకూర్చారు. అఖిలభారత స్థాయిలో అవార్డులు పొందిన కె. యస్. ప్రసాద్ కలర్ ఫొటోగ్రఫీని, రవికాంత్ నగాయిచ్ ట్రిక్ ఫొటోగ్రఫీని నిర్వహిస్తున్నారు.

తదితర సాంకేతికవర్గం: కూర్పు: సంజీవి, కళ: ఎ. కె. శేఖర్, అలంకరణ: వాలి, నృత్యాలు: వెంపటి చిన సత్యం, స్టూడియో: ప్రసాద్, ఏ. వి. యం, విక్రమ్. విడుదల లక్ష్మీఫిలింస్.

—శ్రీనివాస్ ●



'రైతుకుటుంబం'లో ప్రేమికులు: కాంచన, నాగేశ్వరరావు

# పుస్తకాలు

### శ్రీ వేంకటేశ్వర కళాశాల వార్షిక వరచిక

సంపాదకులు— ప్రిన్సిపాల్ బి. రామసుబ్బారెడ్డి డెమ్మీ 1/4 క్రౌను 38+50+6 పుటలు.

తిరుపతి శ్రీ వేంకటేశ్వర కళాశాల వారు ప్రకటించిన యీ సంచికలో తొలుత ఆంగ్లంలోను, తర్వాత తెలుగులోను, చివర హిందీలోనూ వ్యాసాలున్నవి. కొన్ని అధ్యాపకులవి, కొన్ని విద్యార్థులవి కళాశాలకు సంబంధించిన వివిధ ఉత్సవాల సందర్భంలో తీసుకున్న ఛాయాచిత్రాలు చాలా ఇందు చేర్చబడినవి. కొద్ది వ్యాసాలు మినహా మిగిలినవి. పాఠశాలల విద్యార్థులు వ్రాసిన వ్యాసాల స్థాయిలోనే ఉన్నవి. కాలేజీ మ్యాగజినులో అందరూ తెలిసికోదగిన విషయాలను గురించిన వ్యాసాలుండడం అవసరం. తెలుగు విభాగం తక్కిన వాటికంటె చాలా వెనుకబడి ఉన్నట్లు కానవస్తుంది.

ముద్రణ చాలా చక్కగా ఉన్నది. శ్రీ పద్మావతీదేవి, శ్రీ వేంకటేశ్వర స్వామివార్ల వర్ణచిత్రాలు దీనికి కొంత శోభ కూరుస్తున్నవి. —అంగీరస

### 1. చలంగారి శిలం స్త్రీషము పంపు

* * *

### 2. ఆరాత్రి

పై రెండూ చలం కథల సంపుటులు. 'ఎమెస్కో పాకెట్ బుక్స్ మ[...] సు—1' [...]రి ప్రచురణలు [...] : రు. 2—50 లు.

### ఉద్దేశ్యాలకీ వాటి పర్యవసానాలకీ వైరుధ్యం

వివాహ వ్యవస్థ స్త్రీలకు 'నవ యవ్వనపుశోభ' తెచ్చే ప్రేమోద్వేగాల ఆనందానుభూతిలో పాల్గొనే అధికారం లేకుండా చేసిందనీ, సమాజంలో ఈనాడు స్త్రీలు అనుభవిస్తున్న పరవశ్యతలకీ, దుర్గతికీ ఆ వ్యవస్థమీద స్త్రీలు జరపవలసిన తిరుగుబాటు, స్వభావాన్నీ స్వరూపాన్నీ భూతద్దంలో చూపి. తెలుగు రచయితలూ, పాఠకులూ మనస్సుల మీదవున్న కొన్ని ఇన్‌హిబిషన్స్‌ను వదలగొట్టిన ఉత్తమ కథారచయిత శ్రీ చలం.

మహిళల తిరుగుబాటు స్వరూపాన్ని భూతద్దంలో చూపించే మహదావేశంలో కూడ శ్రీ చలం వారి ఈ దుస్థితికి మూలంలో వున్న కారణాలను మరిచిపోయేరనుకోలేము. తాము వ్రాసిన జెలసీ కథలో ఒక చోట ఆయన— 'ఎంత నాగరికత..... కలిగిన మనుష్యులూ భార్యల దగ్గర అల్లా అవుతారు గావును.... ముఖ్యంగా తన మీద ఆధారపడి, ఇతరమైన దిక్కులేని భార్యల ముందు'— అంటారు. ఈ ఆధారపడడం, దిక్కులేక పోవడం ఆర్థికంగా ననేది వేరే చెప్ప నక్కర్లేదు.

నవీన జీవితం క్రూరంగా వుందంటూ స్త్రీలు అర్థ పోషణపీ, అధికారాన్నీ తప్పించుకోవాలంటే చదువుకొని, ఏ వుద్యోగమో చేసుకొని ధనం సంపాదించుకోడం అవసరం అవుతూందని 'సరస్వతీ ప్రసన్నం' కథలో సూచిస్తారు.

ఈ విధంగా స్త్రీ ఆర్థికంగా పరాధీనంగా వుండడానికీ, శారీరకంగ, మానసికంగా, సాంస్కారికంగా దుస్థితిలో వుండడానికీ సంబంధం వున్నదనే భావం చలంగారి ఈ రెండు పుస్తకాలలో చాలా కథలలో తగులు తుంది.

ఆ ఆర్థిక పరిస్థితి— మారాలంటే సమాజంలోని స్థితే మారాలిసి వుంటుంది. కానీ, అలా మారాలనే అభిప్రాయం శ్రీ చలానికి నచ్చదు. 'అట్లాంటి (కొత్త స్థలం, పరిమళాలు, సంగీతం, ప్రకృతి రామణీయకతల మధ్య శృంగారం) అనుభవాలివ్వడానికే డబ్బు ఉపయోగం' అంటారు, ఆయన.

'ఆ ధనం అందరికీ పంచుతా మంటారా? ఇప్పుడు కొంతమంది కైనా చాలా అందమైన జీవిత భాగాలున్నాయి. అప్పుడెవరికీ వుండవు'—అంటారు.

ఈ సందర్భంలో —చలంగారికి దురుద్దేశం ఆపాదించ లేను, తెలియకనే అంటాను— ఆయన కమ్యూనిజం ఆశయాన్ని తల్లక్రిందులుగా చెప్పి, ఆ ఇజమ్ యొక్క నిజమైన ఆశయాన్ని మెలికలు తిప్పి, తమ లక్ష్యానికి ఉపయోగించుకో ప్రయత్నించేరు. 'ఆ రాత్రి' కథలో రాజయ్యచేత ఇల్లా చెప్పిస్తారు.

'అసలు డబ్బు పంపకం వేరే విధంగా వుండాలి. ఎవరి అవసరాన్ని పట్టి వారి కెంత ధనం కావాలో నిర్ణయించాలి. కమ్యూనిజంలో సంఖ్యని బట్టి పంచుతారు. అట్లా కాదు. అవసరాన్ని పట్టి, తక్కువ తినేవాడికీ, ఎక్కువ తినే వాడికీ రేషన్‌లో ఒకే కొలత బియ్యం ఇవ్వడం ఎంత బుద్ధి తక్కువో సరిగ్గా అర్థయుతంగా ఖర్చు చేసుకోడం తెలీని వాడికి ధనం ఇవ్వడం అంతే అవివేకం'— అని ఆయన అభిప్రాయం.

అయినా జీవితంలో సెక్స్ ఆనందానుభూతికి కూడా ధనం ఆవశ్యకమని గుర్తించిన శ్రీ చలం స్త్రీకి ధనం అవసరం లేదనగలరా? అనలేరు. ప్రస్తుత సమాజ స్థితిలో స్త్రీకి మిగిలిన ధనార్జనావకాశా లేమిటి? రహదారి బంగళాలో చైర్మన్ గారి దగ్గర లిల్లీలాగ 'వుద్యోగం సంపాదించుకోవడం తప్ప!

ఆ విషయాన్ని 'సరస్వతీ ప్రసన్నం' లో ఇంకా వాచ్యం చేశారు.

'నీ కళ్ళతో, చిరునవ్వుతో, కంఠపు వూపులతో లోకాన్ని భ్రమింప చెయ్యడం సాధన చెయ్యి. . . .సమస్త ధనమూ అడగకుండా కుమ్మరించేట్టు చేసే విధం వుండగా, యీ ఇరవై రూపాయల ఖర్మ యేమిటి నీకు? . . . . ఆలోచించుకో అట్లా జన్మ అంతా గడించేది ఒక్క నెలలో గడిస్తావు'— అని సరస్వతి చేత చెప్పిస్తారు.

అయితే అందరికీ ఆ అందం వుండదు. మరి వాళ్ళ మాటో అనే ప్రశ్న వస్తుంది. 'పోనీ అందం లేని ఆడవాళ్ళు చదువుకోవచ్చు. చాతనైతే పెళ్ళి చేసుకో వచ్చు' నంటారు చలం.

మరి ఆయన స్త్రీలకు ఉపదేశిస్తున్న తిరుగుబాటు స్వభావం స్వరూపం ఏమిటి? వారి దుస్థితికి కారణమని ఆయన విశ్వసించిన వివాహ వ్యవస్థని పూర్తిగా తోసెయ్యడం లేదు కదా! అనవరార్థంగా కొందరికి అయినా ఆ మార్గం చూపుతునే వున్నారు. తానే నిరసించిన 'ప్రపంచోద్ధరణగాళ్ళు చెప్పే ఆర్థిక సంస్కరణలను— (అవసరాన్ని పట్టి ధనం పంచాలనేది)— తీసుకొంటున్నట్లే కనబడి, వానికి సంబంధించిన రాజకీయ, సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక పరిసరాల నుంచి విడదీసి, ముందుకు లాక్కువచ్చి, ఆ స్థితి నేడే వున్నట్లు చూపి, సంస్కరణాభిలాష తప్పన్నట్లు చూపిస్తున్నారు. అదో గొడవ.

'పాపఫలం' కథలో 'ఉద్దేశ్యాలకీ, వాటి పర్యవసానాలకీ లోకంలో అంత వైరుధ్యం వుండబట్టే లోకం అంత మిస్టీరియస్‌గా కనబడు తుంది' అన్నారు, ఆయన.

శ్రీ చలంగారి భావాలతో కనపడే మిస్టరీకి కూడా అటువంటి వైరుధ్యమే వున్నదనుకొంటున్నా, తప్పు లేదు.

—అవంతి

### విద్యార్థి కథాసాహితి

విశ్వవిద్యాలయ విద్యార్థుల కథానికా సంకలనం, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, ఏలూరురోడ్ విజయవాడ—2. డెమ్మీ పుటలు 122. వెల: రెండు రూపాయలు.

ఈ చిన్న కథానికల సంకలనంలో మొత్తం పదకొండు కథానికలున్నాయి. ఈ రచయితలందరు విశ్వవిద్యాలయంలో విద్యార్థులు. వీరిలో ఒక రచయిత్రి కూడా ఉన్నారు. ఈ పదకొండుగురు రచయితలలోను మొత్తంమీద అభ్యుదయ దృక్పథం ప్రత్యేకించి పేర్కొనాలి. వీరిలో కొందరు అంత నిశితమయిన అభ్యుదయ దృష్టి లేకపోయినా రచనలో చక్కని చాకచక్యం వ్యక్తీకరించారు.

వై. వి. యస్. యస్. యస్. మూర్తి రచించిన 'అసమర్థుని జీవితంలో ఒకరోజు' భట్టిప్రోలుని కూ 'జీవిహారి', 'శింజనీ', సుమనశ్రీ 'జరాసంధుని చరమగీతం' గొర్తి రతి 'మారు?' చన్నాప్రగడశ్యామల పది రూపాయల నోటు ఈ సంపుటిలో ఎన్నదగిన కథానికలు.

ఈ రచయితలు ముమ్ముందు ఇంకా ఇంత మంచి కథలు వ్రాయగలరన్న ఆశ కలుగుతుంది. ఈ రోజులలో విద్యార్థి రచయితల రచనా ధోరణికిది ఒక చిన్న అద్దం. —గాత్రి

### తెలుగు జిలుగు

జాతీయ పక్ష పత్రిక. ఎడిటర్ కిమిడి రామకృష్ణారావు, 22 పేజీలు. 25 పైసలు. ఆకివీడు, ప. గో. జిల్లా.

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Steert, Madras-1, and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada 3.
Chief Editor : S. Sambhu Prasad.

ఆరోగ్యమును కావాలనుకొనే వారు వివా అంటే యిష్ట

ఆరోగ్య పానీయపు తయారులో ఒక నూతనమైన సాధన—వివా!

వివా ప్రతి చెంచాలోను ప్రోటీనుయొక్క ఆరోగ్యము, కార్బోహైడ్రేటుయొక్క శక్తి, పాల మీగడ సారము మరియు మాల్టుయొక్క మంచి గుణము యిమిడి ఉన్నాయి

వివా, ఆరోగ్యకరమైన తేలికగా జీర్ణమయే పోషణకు

వివా పగలంతా ఎంతో శక్తిని, రాత్రంతా సుఖమైన విశ్రాంతిని యిస్తుంది త్వరగా కరిగే కార్బోహైడ్రేట్లు, సులభముగా జీర్ణమయే ప్రోటీన్లుగల వివా రోగులకు, రోగమునుండి కోలుకొంటున్న వారికి దివ్యమైన పుష్టికరమగు ఆహారము మీ డాక్టరును అడగండి, ఆయన అదే సలహా యిస్తారు

# వివా

రెండు విధములుగా ఆరోగ్యమును కలిగించే పానీయము






"వివా, మొట్టమొదటి గొప్ప రుచిగల ఆరోగ్య పానీయము."

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.




అశోకా ఆమ్లా బ్రిలియంటైన్
& అశోకా ఆమ్లా హేర్ ఆయిల్

నల్లని కురులకు, చల్లని గుణమునకు,
మరులుగొల్పు పరిమళమునకు

విజయ కెమికల్సు, మద్రాసు-7